





# కొత్త అజయ్ టూత్‌పేస్ట్
# లవంగ శక్తి సహితం
# దంతాలకిస్తుంది లాంగ్ లైఫ్



అజయ్ - 1985 నుండి టూత్‌బ్రష్ కేటగిరీలో మీకు నమ్మకమైన మరియు నచ్చిన బ్రాండ్‌గా నెలకొని ఉంది. ఈ నమ్మకం మరియు సురక్షణల బంధాన్ని ముందుకు కొనసాగిస్తూ అజయ్ సమర్పిస్తున్నారు 'కొత్త అజయ్ టూత్‌పేస్ట్. ఇందులో లవంగ తైలపు ప్రకృతిసహజమైన ఔషధీ గుణాలు మిమ్మల్నీ మరియు మీ పూర్తి పరివారాన్నీ దంత సమస్యల నుంచి పూర్తిగా కాపాడి మరియు తాజా శ్వాసను అందచేస్తాయి. లవంగపు ప్రకృతిసహజమైన శక్తితో నిండిన కొత్త అజయ్ టూత్‌పేస్ట్ వాడండి మరియు చిగుళ్లను ఆరోగ్యంగా మరియు దంతాలను పటిష్టంగా చేసుకోండి.

☑ కేవిటీల నుండి సురక్షణ ☑ క్రిములతో పోరాడుతుంది ☑ ఆరోగ్యమైన చిగుళ్లు
☑ పంటి నొప్పిని తగ్గించటంలో సహాయం ☑ నోటి దుర్వాసనను నిరోధిస్తుంది










For any trade enquiry please feel free to call us at 044-28221270, 42333921 or write to ajaychennai@yahoo.in



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM


## ముందడుగు వేయండి

హిందూదేశంలో మధుమేహంతో ఇందరు పీడించబడటానికి ముఖ్యకారణం అజీర్ణమే. అక్కడక్కడ ఎవరోఒక్కొక్కరు మెదడుతో ఎక్కువగా పరిశ్రమించటంవల్లకూడా ఇదికలగడం నిజమేకాని, సామాన్యంగా అజీర్ణవ్యాధే కారణం.

భోజన విషయంలో మాత్రం జాగ్రత్త వహించి అజీర్ణవ్యాధి రాకుండా చూసుకోండి. సాధ్యమైనంత సమయం బహిరంగప్రదేశంలో గడపండి. చాలాదూరం నడవండి. గాఢ పరిశ్రమ చెయ్యండి కాళ్ళ కండరాలు ఇనుముమాదిరి గట్టిగావుండాలి. ఉద్యోగంలో వుంటే, వీలయినప్పుడు సెలవుతీసుకుని యాత్రలకెళ్ళి నడవండి.

నడవగలిగితే సెలవుల్లో నగరం నుండి మీ స్వగ్రామానికి రాకపోకలు కాలినడకనే సాగించండి. నడవడానికి ఇతరుల సహాయం కావలసినవాడు, ఇతరుల చేత అన్నం తినిపించుకోవలసినవాడు, క్లేశాలు అనుభవించక తప్పదు. అతడు నిస్సంశయంగా దుర్బలుడే.

పులిసి పొంగబారిన రొట్టెకూడా విషమే. దాన్ని తాకనేవద్దు. పొంగుపదార్థంతో కలిపితే పిండి హానికరమవుతుంది. పొంగించబడ్డ దేన్నీ తినవద్దు. మన శాస్త్రాల్లో అలాటి ఆహారం నిషిద్ధం. ఈ విషయం అత్యంత ముఖ్యమైంది.

పులియబారిన తీపిపదార్థం మన శాస్త్రాల్లో 'శుక్త' మనబడుతోంది.

పెరుగు ఒక్కటి తప్ప శుక్తపదార్థాలన్నీ నిషిద్ధాలు. అదిమాత్రం శరీరానికి మంచిది. ఉపకారి. పొంగించిన రొట్టెను తినవలసివస్తేదాన్నిముందుగా నిప్పులమీద చక్కగా కాల్చండి. అపరిశుద్ధ జలం, అపరిశుద్ధాహారం సమస్త వ్యాధులకు కారణమన్న విషయం గుర్తుంచుకోండి.

- స్వామి వివేకానంద



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 34 | 1.12.2017 | సంచిక 22

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Discipline of life is more important than life itself for it is out of that discipline, life derives its value

### సీరియల్స్



### కథలు



### స్పెషల్ ఫీచర్స్



### శీర్షికలు



ముఖచిత్రం కత్రినాకైఫ్ Courtesy : FILMFARE


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433




SKIN FAIRNESS CREAM

WITH SAFFRON®

ఇప్పుడు పొందండి
సిని తారలలాంటి
మెరుపుదనం

*Minissha Lamba*
మినిషా లాంబా
బాలీవుడ్ నటి మరియు
వి-జాన్ సాఫ్రాన్ ఫెయిర్‌నెస్ క్రీమ్ యూజర్







సిని తారలలాంటి చర్మం, సిని తారలలాంటి మెరుపుదనం.

అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక

## సాక్షి

17.11.2017

'సేవా పరాయణత' మాలో సేవా భావాన్ని పెంపొందింపజేసింది.

ఫీచర్ 'సి.ఎమ్‌లకు సవాల్' తెలంగాణ రాష్ట్ర రాజకీయాలకు రెండు రాష్ట్రాలలో జరుగుతున్న వర్తమాన రాజకీయ సమీకరణాలకు అద్దంపట్టింది.

సరసమైన కథ 'తీయని రేయి' అలరించింది. 'చందమామ రావే' శీర్షికలో ప్రచురించిన ట్యాక్సీలో పర్సు కథనం బాగుంది. 'అనిల్' పేజీలో దేశవిదేశాల పౌరులు ఫోటోలు బాగున్నాయి.

బి.వి.ఎస్.ప్రసాద్ చాగల్లు

'మనిషిలో మనిషి', 'అఆఇఈ', 'వసంతసేనా చారుదత్తం', 'ఓ బేవార్స్ గాడి లవ్‌స్టోరీ' సీరియల్స్ అన్నీ ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నాయి.

'నేనెవరో తెలుసా!', 'సత్యాన్వేషణ', 'అనిల్' శీర్షికలు బాగున్నాయి.

డి.జయప్రద హైదరాబాద్

మంచిగా ఉంటూ, మంచిని చేస్తూ మంచిగా ఉండేందుకు సర్వదా ప్రయత్నించమని సంపాదకీయంలో స్వామి ఓంకార్ చక్కగా ఉద్బోధించారు.

'మనిషిలో మనిషి' కొత్త సీరియల్ చక్కని ఉపోద్ఘాతంతో అలరించింది. 'ఓ బేవార్స్‌గాడి లవ్‌స్టోరీ' సీరియల్ ముచ్చటగా ముగిసింది. 'అఆఇఈ', 'వసంతసేనా చారుదత్తం' సీరియల్స్ బాగున్నాయి. కామెడీ కథలో కామేశం కలలు చూస్తే నవ్వొచ్చింది.

ఎన్.సుభద్ర రాజమహేంద్రవరం

'సత్యాన్వేషణ' శీర్షికలోని అంశాలు భక్తిభావాన్ని పెంపొందింపజేశాయి. శ్రీ విష్ణుమూర్తి ప్రార్థన భావసహితంగా ఇచ్చినందుకు ఆనందంగా ఉంది.

'కామేశం సినిమా ఛాన్స్' కామెడీ కథ నవ్వించింది. 'మనిషిలో మనిషి' కొత్తసీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని చాలా బాగా ఆకట్టుకుంది.

'ఈ శీర్షిక మీదే' జోక్స్ బాగున్నాయి. 'B హ్యాపీ' నవ్వులు పూయించింది.

కె.శ్రీనివాసరావు కాకినాడ

'సేవా పరాయణత' స్వామి ఓంకార్ ద్వారా దైవమానవుడు నిస్వార్థసేవనే తనకు లభించిన గొప్ప ప్రతిఫలంగా, అమూల్య భాగ్యంగా భావిస్తాడన్న భావనతోపాటు 'మంచిగా ఉండు' మంచిని చేయి అనే సూక్తులు సులభగ్రాహ్యములని సంగ్రహించాం.

'పువ్వుల్... పువ్వుల్' మనసు జివ్వు మనిపించింది.

'నవ్వుల్... నవ్వుల్...' నిష్కల్మషమయిన చిన్నారుల ముఖారవిందం అవ్యయ ఆనందాన్ని కలిగించింది.

'ఫర్ U' ఉపయోగంగా ఉంది.

ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

వచ్చేవారం స్పెషల్

టచ్ పవర్



# ఇది మంచి సమయం

23.11.2017 నుండి 29.11.2017 వరకు శ్రీ హేవళంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, హేమంతఋతువు, మార్గశిరమాసం, శుక్లపక్షం.

**23.11.2017 గురువారం**
తిథి: శుద్ధపంచమి తె.5.35 వరకు
నక్షత్రం : పూర్వాషాఢ ఉ. 6.59 వరకు
వర్జ్యం: సా. 4.00-5.48 వరకు
దుర్ముహూర్తం : ప. 9.52-10.38 వరకు. మ. 2.27-3.13 వరకు
రాహుకాలం: మ. 1.12 నుండి 2.38 వరకు
మంచి సమయం: తె. 4.00 నుండి 5.30 వరకు
సూర్యోదయం: 6.13కి
సూర్యాస్తమయం: 5.25కి

**24.11.2017 శుక్రవారం**
తిథి: షష్ఠి పూర్తి
నక్షత్రం: ఉత్తరాషాఢ ప.10.03 వరకు
వర్జ్యం: మ. 2.31-4.18 వరకు
దుర్ముహూర్తం: ప. 8.20 నుండి 9.06 వరకు. మ. 12.09-12.55 వరకు
రాహుకాలం: ప. 10.20 నుండి 11.46 వరకు
మంచి సమయం: ఉ. 6.00 నుండి 7.30 వరకు
సూర్యోదయం: 6.13కి
సూర్యాస్తమయం: 5.24కి
సుబ్రహ్మణ్య షష్ఠి

**25.11.2017 శనివారం**
తిథి: షష్ఠి ఉ. 7.58 వరకు
నక్షత్రం: శ్రవణం మ. 12.49 వరకు
వర్జ్యం: సా. 5.12-6.57 వరకు
దుర్ముహూర్తం: ఉ.6.03-7.35వరకు
రాహుకాలం: ప. 8.55-10.21 వరకు
మంచి సమయం : సా. 4.00 నుండి 4.45 వరకు
సూర్యోదయం: 6.14కి
సూర్యాస్తమయం: 5.25కి

**26.11.2017 ఆదివారం**
తిథి: సప్తమి ప. 9.51 వరకు
నక్షత్రం: ధనిష్ఠ మ. 3.04 వరకు
వర్జ్యం: రా. 10.44-12.26 వరకు
దుర్ముహూర్తం: సా. 3.58-4.43 వరకు
రాహుకాలం: సా. 4.03-5.29 వరకు
మంచి సమయం : తె. 4.00 నుండి 5.30 వరకు
సూర్యోదయం: 6.15కి
సూర్యాస్తమయం: 5.25కి

**27.11.2017 సోమవారం**
తిథి: అష్టమి ప. 11.03 వరకు
నక్షత్రం: శతభిషం సా. 4.37 వరకు
వర్జ్యం: రా. 11.13-12.52 వరకు
దుర్ముహూర్తం : మ. 12.09-12.55 వరకు. మ. 2.26-3.12 వరకు
రాహుకాలం: ఉ. 7.30-8.55 వరకు
మంచి సమయం: సా. 3.30 నుండి 4.40 వరకు
సూర్యోదయం: 6.15కి
సూర్యాస్తమయం: 5.27కి

**28.11.2017 మంగళవారం**
తిథి: నవమి ప. 11.24 వరకు
నక్షత్రం: పూర్వాభాద్ర సా.5.21వరకు
వర్జ్యం: రా. 2.53-4.28 వరకు
దుర్ముహూర్తం: ప. 8.21 నుండి 9.07 వరకు. రా. 10.31-11.16 వరకు
రాహుకాలం: మ. 2.31 నుండి 4.03 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.16కి
సూర్యాస్తమయం: 5.25కి

**29.11.2017 బుధవారం**
తిథి: దశమి ప. 10.52 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర సా.5.12 వరకు
వర్జ్యం: తె. 4.42-6.14 వరకు
దుర్ముహూర్తం : ప. 11.23 నుండి 12.09 వరకు
రాహుకాలం: మ. 11.46 నుండి 1.12 వరకు
మంచి సమయం: మ. 3.00 నుండి 4.30 వరకు
సూర్యోదయం: 6.16కి
సూర్యాస్తమయం: 5.25కి

* మీకు అవసరమైన ఆశీస్సులు అందుతాయి.

# సరసమైన కథల పోటీ

# లక్ష రూపాయల బహుమతులు

**బహుమతి పొందిన ప్రతి కథకు ₹10,000 చొప్పున 10 కథలకు లక్ష**



వెన్నెల వెలుగుల్లో పట్టుపాన్పుపై పవళించి, సరససల్లాపాలాడుతూ, అరవిరిసిన చిరునవ్వులను, క్రీగంటి చూపులను ఆస్వాదిస్తూ, ఒకరి కౌగిలిలో ఒకరు కాలాన్ని కరిగిస్తుంటే జీవితం ఎంత సఫలం!! ఎంత సార్థకం!! అందుకే సాహితీ ప్రపంచం సరసమైన కథలకు మణిమయమకుట కిరీటాన్ని ధరింపచేసింది.

సరసమైన కథలు శృంగార రసగుళికలు కనుక వీటిని ప్రతివారం ప్రతి ఒక్కరూ చదివి తీరవల్సిందేనని, ఇవి గొప్ప ఫ్యామిలీ కౌన్సిలర్లని రసజ్ఞులైన పాఠకదేవుళ్ళంటున్నారు.

యవ్వనాన్ని ఇచ్చేవి, ఆయుష్షును పెంచేవి, ఆరోగ్యాన్ని, ఆనందాన్ని అందించేవి ఒక్క సరసమయిన కథలే. అందుకే ప్రతి ఏటా ఈ సరసమైన కథల పోటీని నిర్వహిస్తున్నాం. రచయిత(త్రు)లందర్నీ ఈ పోటీలో పాల్గొనవలసిందిగా కోరుతున్నాం.

**సాధారణ ప్రచురణకు తీసుకున్న ప్రతి సరసమైన కథకు ₹2,500**

ఈ పోటీలో పాల్గొనే రచయిత(త్రు)లు ఈ క్రింది విషయాలను గమనించవలసిందిగా మనవి.

1. సరసమైన కథలుగా పరిగణింపబడనివాటిలో బాగున్నవాటిని స్వాతి సపరివార పత్రికలోగానీ, స్వాతి సచిత్ర మాసపత్రికలోగానీ మామూలు కథలుగా ప్రచురిస్తాం.
2. మితిమీరిన శృంగారం మంచిదికాదనే విషయం గుర్తుంచుకోవాలి.
3. అనువాదాలు, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలు పంపవద్దు.
4. కథల ఎంపికలో స్వాతి సంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు. ఈ సరసమైన కథల పోటీ గడువుతేదీని పొడిగించేందుకుగానీ, పోటీని రద్దు చేసేందుకుగానీ స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులు ఉన్నాయి.
5. కథ తమ స్వీయరచన అని, అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్ని విధిగా జతపరచాలి.
6. కథ అరఠావు సైజులో 6 పేజీలకి మించరాదు.
7. కథలను త్రిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతపరచాలి. కవరుమీద 'సరసమైన కథల పోటీకి' అని రాయాలి.

కథలను పంపవలసిన చిరునామా : ఎడిటర్,
స్వాతి సపరివార పత్రిక, అనిల్ బిల్డింగ్స్,
సూర్యారావుపేట, పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

**రచనలు మాకు చేరవలసిన ఆఖరు తేది: 30.12.2017**

# బ్యాంక్‌లు బ్రతుకుతాయా!

దేశ ఆర్థికవ్యవస్థకు పటిష్ఠమయిన బ్యాంకింగ్ రంగం అవసరం.కాని నేటి బ్యాంక్‌లు తామే పటిష్ఠంగా ఉండనపుడు దేశ ఆర్థికవ్యవస్థలో నిజంగా పాత్ర పోషించగలవా! అన్నది ప్రశ్న.

ఒక్కసారిగా బ్యాంక్‌లు చప్పబడటం ఆందోళన కలిగించే విషయమే. బ్యాంక్ యాజమాన్యాలు సంతోషంగా లేవు. బ్యాంకుల్లో పనిచేసే ఉద్యోగులూ ఉత్సాహంగా లేరు. బ్యాంకుల్లో లావాదేవీలు నడిపే కస్టమర్లలోనూ సంతృప్తి కనపడటంలేదు.

వెరసి బ్యాంకింగ్ వ్యవస్థలో స్తబ్దత ఏర్పడింది. ఇది ఆర్థికరంగ ఆరోగ్యానికి ప్రతికూల సంకేతం.

కేంద్ర ప్రభుత్వం గత నవంబర్‌లో తీసుకున్న పెద్ద నోట్ల రద్దు నిర్ణయం, ఆ పెద్ద నోట్ల ప్రభావం నుండి దేశ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా కోలుకోకముందే, పెద్ద నోట్ల ప్రభావం పూర్తిగా అధ్యయనం జరగకుండానే జి.ఎస్.టి. అమలు నిర్ణయాన్ని కేంద్రప్రభుత్వం హడావుడిగా అమలుచేసింది.

ఇప్పుడు దేశ ఆర్థికవ్యవస్థ ఆ జోడు నిర్ణయాల ప్రభావానికి విలవిలలాడుతున్నది. దాని ప్రభావం బ్యాంక్‌లమీద సహజంగానే పడింది.

అయితే కేవలం ఈ రెండు నిర్ణయాలవల్లనే బ్యాంకింగ్ వ్యవస్థ ఇబ్బందుల్లోకి నెట్టబడిందనేది

## రాజకీయ జోక్యం శాపమవుతోంది

అంగీకరించలేని విషయం. బ్యాంక్‌లు బాధల్లో ఉన్నాయన్నది చాలా కాలంగా వినిపిస్తున్న విషయం.

యు.పి.ఎ. అధికారంలో ఉండగా తీసుకున్న నిర్ణయాల ఫలితం బ్యాంక్‌లమీద పడింది. దానికితోడు తాజా ప్రభుత్వ నిర్ణయాలు దెబ్బతీస్తున్నాయి. పైగా గుజరాత్ ఎన్నికలు తరుముకువచ్చాయి.

గుజరాత్‌లో వ్యాపారస్తులు ఎక్కువ. వారంతా బి.జె.పి. మద్దతుదారులు. అటువంటి వర్గంమీద జిఎస్‌టి భారంపడింది.

నిజానికి జి.ఎస్.టి. అమలు దేశానికి మంచిది. వ్యాపార వర్గాలకు ఇబ్బంది కలిగించేది. వినియోగదారుడికి ప్రారంభంలో ఇబ్బందిగా అనిపించినా దీర్ఘ కాలంలో లాభం చేకూర్చేది.

చాలామంది వ్యాపారస్తుల్లో పన్నులు చెల్లించనివారు అధికంగా వున్నారు.

ఇంతకాలం పన్ను జాలానికి ఆవల వున్నవారినందరినీ పన్ను చట్రంలోకి తెచ్చి దేశ ఆదాయం పెంచేందుకు ఉద్దేశించినది జి.ఎస్.టి. దీనికి రాజకీయంగా అన్ని పార్టీల మద్దతు ఉంది. అయితే వ్యాపార వర్గాలలో జి.ఎస్.టి. వ్యతిరేకత మొదలవగానే ఆ పన్ను సంస్కరణ తప్పిదాన్ని అధికార బి.జె.పి. మీద నెట్టే యత్నం ప్రతిపక్షాలు సహజంగానే చేశాయి.

జి.ఎస్.టి.వల్ల కలిగే మేలుగురించి ప్రజలకు వివరించటంలో మోడీ ప్రభుత్వం విఫలమైంది.

గుజరాత్‌లో గెలుపు కీలకం కాబట్టి జి.ఎస్.టి. విషయంలో అక్కడి వర్గాలను బుజ్జగించే పనిలో పడింది మోడీ ప్రభుత్వం.అమలు అయ్యి ఆరునెలలు కూడా తిరగకుండానే వందలకొద్దీ సవరణలు చేస్తూ,

## మెడకు చుట్టుకున్న మొండిబకాయిలు

పన్ను అధికారులు, వ్యాపారస్తులు, వినియోగదారులందరినీ గందరగోళంలోకి నెడుతున్నారు. జిఎస్‌టి అమలుకు ముందు అధికార యంత్రాంగం సరైన అధ్యయనం చెయ్యలేదని స్పష్టం.

జి.ఎస్.టి.కి ముందు తీసుకున్న పెద్దనోట్లరద్దు బాధితులైన వ్యాపారులు ప్రభుత్వంమీద వ్యతిరేకతను పెంచుకున్నారు. నల్లేరుమీద నడకలా సాగుతుందని ప్రారంభంలో భావించుకున్న గుజరాత్ ఎన్నికలు ప్రచారంలోకి దిగినతర్వాతగాని కష్టమయినవిగా బి.జె.పి.కి అర్థంకాలేదు.

దేశ ఆర్థిక నమూనాగా మోడీ ప్రస్తావించేది గుజరాత్ మోడల్. అటువంటి గుజరాత్‌లోనే కీలక నిర్ణయాలు రెండింటిమీదా వ్యతిరేకత వస్తే 2019 ఎన్నికల ముందు 'మొసళ్ళ పండగ' అయ్యే ప్రమాదం వుంది. కాబట్టి ప్రాథమికంగా ఆర్థికవ్యవస్థను చక్కదిద్దేపనిని మొదలుపెట్టిందినరేంద్ర మోడీ ప్రభుత్వం.



లౌకికవాదం అనేది అబద్ధం కాదు. మోడీ ప్రభుత్వాన్ని రామరాజ్యంతో పోల్చటమే పెద్ద అబద్ధం.-కపిల్ సిబాల్, కాంగ్రెస్ నేత

దేశ ఆర్థికవ్యవస్థకు కొత్త జవసత్వాలు కల్పించాలంటే బ్యాంకింగ్ రంగంలోనేసర్దుబాట్లు, దిద్దుబాట్లు అవసరమని భావించిన ప్రభుత్వం మూడువారాల క్రితం ప్రభుత్వరంగంలోని బ్యాంకులను ఆదుకునే పథకాన్ని ప్రకటించింది.

"పడకేసిన బ్యాంక్‌లను తట్టిలేపాలంటే ప్రభుత్వ ఆసరా తప్పనిసరి. అందుకు ఒక సాహసోపేత నిర్ణయం తప్పదు" అని ఆర్థిక శాఖామంత్రి అరుణ్ జైట్లీ ప్రకటించారు. అందులో భాగంగా బ్యాంక్‌లకు రెండులక్షలపదకొండుకోట్లరూపాయలమేర సహాయమందించనున్నట్లు వివరించారు.

ఆ మొత్తం నేరుగా ప్రభుత్వం అందించకపోవచ్చును. అందులో 18 వేలకోట్లు మాత్రమే ప్రత్యక్షంగా పెట్టుబడిగా ఇస్తుంది. మరో 56 వేలకోట్లు బ్యాంక్‌లు తమ సొంత విధానాలద్వారా ప్రభుత్వ వాటా తగ్గించుకుంటూ సేకరించుకుంటాయి.

లక్షా 35 వేలకోట్లు 'రీ కాపిటలైజేషన్ బాండ్స్'ద్వారా జరగాల్సివుంటుంది. బ్యాంక్‌లు నిధులతో బలంగా, పరిపాలన, విధానపరంగా బలంగాఉండటం చాలా అవసరం. అటువంటి ఆరోగ్యకర బ్యాంకింగ్ వ్యవస్థ పనిచేస్తున్నప్పుడే ఆరోగ్యకర పరిశ్రమలు, సంస్థలకు రుణాలు మంజూరు జరుగుతుంది.

సేకరించిన ఆ నిధులన్నీ నిజాయితీగా పెట్టుబడులుగా మారినపుడే వ్యవస్థ బాగా పనిచేసి వేల సంఖ్యలో కొత్త ఉద్యోగాలు సృష్టించబడతాయి. అయితే దేశంలోని బ్యాంక్‌ల ఆరోగ్యం ఎందువల్ల తరచుగా దెబ్బతింటున్నది!

రాజకీయ జోక్యంవల్లనా, బ్యాంకుల్లో కీలక స్థానాలలో, ఉన్నత స్థానాలలో ఉన్నవారి నిర్లక్ష్యంవల్లనా! ఆ రెండూ కలగలిపి బ్యాంక్‌లను దెబ్బతీశాయన్నది అంగీకరించాల్సిన విషయం.

1969లో బ్యాంక్‌లు జాతీయం చేయబడ్డాయి. నాటివరకు ప్రైవేట్ వ్యక్తుల చేతిలో ఉన్న బ్యాంక్‌లు సామాన్యులకు ఉపయోగపడటంలేదని- బ్యాంకుల్లోని నిధులు పేదప్రజల అవసరాలకుకాకుండా ధనవంతుల ఎదుగుదలకు మాత్రమే దోహదపడుతున్నాయని-

కాబట్టి మనదేశంలో సోషలిజం స్థాపన సాధ్యమవ్వాలంటే బ్యాంక్‌లు ప్రయివేట్ రంగంలో నుండి ప్రభుత్వరంగంలోకి వచ్చితీరాల్సిందేనని నాడు ప్రధాని

ఇందిరాగాంధీ ప్రకటించింది.

ఆమె ప్రవచించిన సోషలిజంలో భాగంగా 'రాజ భరణాల రద్దు', 'బ్యాంక్‌ల జాతీయం' అనేవి అద్భుత మయిన రాజకీయ నినాదాలుగా పనికివచ్చి 1971లో కాంగ్రెస్ పార్టీకి ఘనవిజయం సాధించిపెట్టాయి.

బ్యాంకింగ్ రంగం అంతా ప్రభుత్వరంగంలో ఉంటేనే మెరుగయిన సేవలు అందించబడతాయన్న ఆలోచనతో మొదలై, ఆ ఆలోచనకు స్వర్ణోత్సవం కూడా జరగకుండానే తిరిగి కాంగ్రెస్ పార్టీ హయాం లోనే ఆర్థిక సంస్కరణలు మొదలై, ప్రైవేటు బ్యాంకు లకు పెద్దపీట వేయటం మొదలైంది.

ప్రభుత్వరంగ బ్యాంకుల్లో ప్రభుత్వ యంత్రాంగ జోక్యం పెరిగింది. రాజకీయ, ప్రభుత్వ విధానాలకు అనుగుణంగా జాతీయరంగం బ్యాంక్‌లను వాడు కున్నారు. రుణమేళాల పేరుతో పందేరాలు చేయిం చారు. అలాగే రాజకీయ పలుకుబడి కలిగినవారికీ భారీగా రుణాలు అందించారు.

బ్యాంక్‌ల దగ్గర రుణాలు తీసుకుని, ఆ రుణాల సహాయంతో రాజకీయంలో పెట్టుబడులు పెట్టి ఎమ్.పి.లుగా ఎన్నికై, తిరిగి బ్యాంక్‌లను అజమాయిషీ చేసినవారు మనరాష్ట్రంలోనే చాలామంది ఉన్నారు.

ఇటీవలి కాలంలో సదరు ఒక రాజకీయ వేత్త ఇంటిముందు రుణబకాయిలు చెల్లించమని జాతీయ బ్యాంక్‌ల సిబ్బంది ప్లకార్డ్స్ పట్టుకుని నిలబడటం మీడియాలో చూసేవుంటారు.

ప్రభుత్వం ఛైర్మన్లను నియమిస్తుంది. అందుకు లాబీయింగ్ చేసుకుంటారు.

ఆర్థికపరంగా అధికారంలో వున్నవారిని సంతృప్తి పరిచి బ్యాంక్ ఛైర్మన్ వ్యక్తిగతంగా తన సొంత సంక్షేమం చూసుకుంటాడేగాని బ్యాంక్ భవిష్యత్తు, సిబ్బంది సంక్షేమం ఎలా చూడగలడు. పైగా జాతీయ బ్యాంక్ ఛైర్మన్ కాలపరిమితి తక్కువ.

## బ్యాంక్‌ల విలీనం అవసరమే

ఫలితంగా సరయిన బ్యాంకింగ్ విధానాల రూప కల్పన సాగదు. బ్యాంక్ లోపాలను చక్కదిద్దలేడు. కాని విచక్షణారహితంగా రుణాలు మంజూరుచేసి బ్యాంక్‌లను దెబ్బతీయగలడు.

ప్రస్తుతం బ్యాంక్‌లు ఎదుర్కొంటున్న అతిపెద్ద ఇబ్బంది మొండిబకాయిలు. రుణాలు తీసు కుని దేశం వదిలి పారిపోయిన విజయ్‌మాల్యావంటి వారు, స్వదేశంలో వుండి రుణాలు చెల్లించనివారు న్నారు. అవన్నీ నాన్‌పర్ఫార్మింగ్ ఎసెట్స్ (ఎన్.పి.ఎ.) లుగా బ్యాంక్‌లకు గుదిబండలవుతున్నాయి.

యు.పి.ఎ. హయాంలో చిదంబరం ఆర్థిక మంత్రిగా బ్యాంకర్ల సమావేశం ఏర్పాటుచేసి దేశ అవసరాలకోసం మీరంతా రుణాలను ఇవ్వాలి. పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధిలో పాలుపంచుకోవాలి అంటూ బ్యాంక్‌లచేత 2008-14 మధ్యకాలంలో జాతీయ బ్యాంక్‌లద్వారా మౌలిక వసతుల నిర్మాణ సంస్థలకు విచ్చలవిడిగా రుణాలు ఇప్పించారు.

అవన్నీ దీర్ఘకాలిక పథకాలు. బ్యాంక్‌లకు సుదీర్ఘ కాల రుణాలు ఇవ్వవలసిన అవసరంలేదు. పైగా నాడు రుణాలు మంజూరుచేసిన ఆనకట్టలు, రహ దారులు, ఇతర పరిశ్రమలు అనేకం పర్యావరణ అంశాలు, చట్టపరమైన అంశాల కేసుల్లో ఇరుక్కుని ఏమాత్రం ముందుకు కదల్లేదు.

ఇప్పుడు ఎన్.పి.ఎ.లుగా మారిన అవన్నీ గుది బండగా బ్యాంక్‌ల మెడకు చుట్టుకున్నాయి.

బ్యాంక్‌లు ఖాయిలాపడటం, తిరిగి వాటిని బతి కించటానికి ప్రభుత్వం నిధులు ఇవ్వటం, రుణాలు మాఫీచెయ్యటంవంటి వాటివల్ల లాభం, సంపద కలి గినవారిది, నష్టం దేశానిది.

ఇదివరలోకూడా బ్యాంక్‌లకోసం ఇటువంటి నిధులు కట్టబెట్టి బతికించారు. మరల అదే తరహా చికిత్స చేయాలనుకుంటున్నారు.

## ఎన్నిసార్లు నష్టం భర్తీచేసినా అదే తీరు

బ్యాంక్‌లు ఖాయిలా రోగానికి అసలు కారణం ఏదో కనుక్కుని దానికి చికిత్స చేయాల్సిందిపోయి, రోగం ముదిరినతరువాత హడావుడిగా అందించే టానిక్‌వలన తాత్కాలికంగా కోలుకుంటాయేగాని శాశ్వత ఆరోగ్యం బ్యాంక్‌లకు సమకూరదు.

భారతదేశపు జాతీయ బ్యాంక్‌ల పరిస్థితి బాగో లేదన్న విషయం 2014 మేలో సమర్పించిన పి.జె. నాయక్ కమిటీ నివేదిక స్పష్టం చేసింది. ఆ నివేదికలో రెండు సూచనలను ప్రభుత్వం ముందుంచింది. అందులో ఒకటి బ్యాంక్‌లను ప్రభుత్వరంగంలో నుండి ప్రైవేట్‌రంగంలోకి మార్చటం.

ప్రభుత్వ రాజకీయ విధానాలకు అతీతంగా బ్యాంకు లను నడుపుకునే స్వేచ్ఛ, స్వాతంత్ర్యం బ్యాంక్‌లకు ఇవ్వటం లేదా బ్యాంక్‌ల నిర్వహణా వ్యవహార శైలిలో సంపూర్ణ మార్పులు తీసుకురావటం, ఇతర బ్యాంక్‌లతో పోటీపడి, లాభ సాటిగా ముందుకు వెళుతూ ప్రభుత్వ సహాయంకోసం ఎదురుచూడని సమర్థత బ్యాంక్‌లకు సమకూరాలి.

సమర్థులయిన వ్యక్తులకు బ్యాంక్‌ల నిర్వహణ అప్పగించాలి. స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకోనివ్వాలి. ప్రభుత్వ జోక్యం బహుతక్కువగా వుండాలి.

అందుకు అనుగుణమైన మార్పులను నాయక్ కమిటీ సూచించింది. అందులో బ్యాంక్ ఇన్వెస్ట్ మెంట్ కంపెనీ సూచనమాత్రమే మరో రూపంలో ప్రభుత్వం అమలుచేసింది.

రాజకీయపరమయిన బ్యాంక్‌డైరెక్టర్ల నియామ కాలు బ్యాంక్‌లను ఎంతగా కుంగదీశాయో అంద రికీ తెలుసు.అలా అధికారంలో వున్నవారు బ్యాంక్ లను సులభంగా దోచుకుంటుంటే బ్యాంకుల్లో డిపా జిట్స్ చేసే సామాన్యులు దెబ్బతింటున్నారు.

బ్యాంక్ వడ్డీరేట్లు తగ్గుదలకు, బ్యాంక్‌ల నిర్వహ ణకు సంబంధం వుండే వుంటుంది. సీనియర్ సిటి జన్స్ తమ పింఛన్ డబ్బును బ్యాంక్‌లో వేసుకుని వడ్డీతో బతకాలన్న ఆశ అడియాస అవుతోంది.

బ్యాంక్‌ల నిర్వహణ లోపం, నష్టాల భర్తీకి వడ్డి స్తున్న సర్వీస్ ఛార్జీలన్నీ ప్రజల నెత్తినే పడుతున్నాయి. బ్యాంక్‌ల విలీనం అంశం ప్రభుత్వ పరిశీలనలో వుంది. రాజకీయ ఓటమి భయంతోనే ఆ నిర్ణయం వాయిదా వేస్తున్నది. చైనా కూడా తమ బ్యాంక్‌లను విలీనం చేసి నాలుగు పెద్ద, సమర్థ బ్యాంక్‌లను రూపొందించు కునే ముందడుగు వేసింది.

ఆ దోవలోనే బ్యాంక్‌లను విలీనంచెయ్యాలన్న ఆలోచన వుంది. భారతదేశం వంటి విస్తీర్ణం కలిగిన దేశంలో నాలుగు పెద్ద బ్యాంక్‌లకు మించిన అవసరం లేదన్నది సూచన. స్టేట్ బ్యాంక్‌లో మిగిలిన అనుబంధ బ్యాంక్‌ల విలీనం 2016-17 ఆర్థిక సంవ త్సరం అంతానికి పూర్తయింది.

ఇక 2017-18 ఆర్థిక సంవత్సరంలో మిగిలిన బ్యాంక్‌ల విలీన ఆలోచన చెయ్యక తప్పదేమో.

బ్యాంకుల్లో, సిబ్బందిలో కూడా మార్పు అవసరం. కస్టమర్లతో సంబంధాలు మెరుగుపరుచుకుని, వ్యాపార విస్తరణకు అనుకూలమైన వాతావరణం బ్యాంక్‌ల నిర్వహణలో, సిబ్బంది పనితీరులో కనిపిం చాలి. బ్యాంక్‌లు, విశ్వాసంపెంచి ప్రజలనుండి పెట్టు బడులు తీసుకోగలిగిన స్థాయికి ఎదగాలి.

బ్యాంక్‌లు తమ ఆస్తులను మరింత పెంచుకునేం దుకు, మొండిబకాయిలను రాబట్టటానికి అనువైన కొత్త మార్గాల అన్వేషణ చేయాలి.

ఎసెట్ రీ కన్‌స్ట్రక్షన్ కంపెనీలవల్ల లాభనష్టాల అంశం ఏ బ్యాంక్‌కి ఆ బ్యాంక్ అంచనా వేసుకుంటు న్నది. ఎన్.పి.ఎ.లమీద ఒక అవగాహనకి వచ్చి వాటిని లాభసాటి అంశంగా మార్చుకునే యత్నంచెయ్యాలి.

ఇది ప్రభుత్వం ఒత్తిడితో కాక తమ బ్యాంక్ ప్రతి ష్ఠకు సంబంధించినదిగా భావించి ముందడుగు వెయ్యాలి. ఆర్థికవ్యవస్థ తిరిగి గాడినపడుతున్నదన్న సంకేతాలు వస్తున్నాయి. విదేశీ పెట్టుబడి సంస్థలు మరోసారి భారత్‌వైపు చూస్తున్నాయి.

నేడు మెరుగవుతున్న విదేశీ విధానం, చైనాకు ప్రత్యామ్నాయంగా భారతదేశంలో పెట్టుబడులు పెట్టేందుకు అనేక విదేశీసంస్థలు ఉత్సాహం చూపటం కనిపిస్తున్నది. అయితే ఈ అవకాశాలను అందిపుచ్చు కునే స్థాయికి దేశంలోని ప్రభుత్వరంగ సంస్థలు సిద్ధ మవ్వాలి. ఇదే నేటి అవసరం.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు



Courtesy : MATRUBHUMI AAROGYAM

# దేవుడి మాయ

వయసువచ్చిన తర్వాత ఆడపిల్లలు కనే కలల్లో అమ్మతనంకూడా ఒకటి. ఎంతో బాధాకంమైనది ప్రసవ సమయం అని తెలిసినా ఆ రోజు కోసం ఎదురుచూస్తారు.

తన పేగు తెంచుకుని బిడ్డ బయటకు వస్తున్న ఒక మరువలేని క్షణంతో అంతవరకు పడిన ప్రసవ వేదనను మరచిపోతారు. తన కలల ప్రతిరూపం చూసుకుని మురిసిపోతారు. తన కడుపులోనుండి వచ్చిన ఆ పసిగుడ్డును పొదివిపట్టుకున్న తల్లి ముఖంలో కనిపించేఆనందం, తృప్తివర్ణనాతీతం.

తన కడుపు పండించిన భాగస్వామికి ఆ బిడ్డను మురిపెంగా చూపించే క్షణంలో ఆమెకళ్ళలో తొణికిసలాడే గర్వాన్ని చూసి తీరాల్సిందే. మాతృత్వానికి సంబంధించిన ప్రతి దశను ఆనందించే అమ్మాయి తనకుతాను అమ్మ అనే దేవతగా భావించుకుంటుంది.తానుకురిపించే ప్రేమ, పిల్లలనుపెంచటంలో తానుచూపే శ్రద్ధవగైరాలన్నీ ఆమెకలల్లోభాగమే.

పాలు ఇవ్వటం అనేది ఆమెకు గర్వకారణం. పిల్లనుపక్కన పడుకోపెట్టుకుని, వెచ్చదనం అందించటం ఆమెకు ఎంతో ఇష్టమైనది. ప్రసవానికి అటు తొమ్మిదినెలలు,ఇటు తొమ్మిదినెలల కాలాన్ని తమ జీవితంలో ఎంతోగొప్ప సమయంగా స్త్రీ భావిస్తుంది. బిడ్డలోవస్తున్న రోజువారీమార్పులను చూసి మురిసిపోవటమే కాదు జీవితకాలం మరువలేదు.

పిల్లలు చేయి చాపినా, కాలు కదిలించినా అన్నీ ఒక వింతగా, నలుగురికి చెప్పుకునే విశేషంగా ఆమె భావిస్తుంది.ఇక పిల్లలు పాకటం,బుడిబుడి అడుగులు వేయటంవరకు ప్రతిక్షణాన్నీ ఆమె మెదడులో రికార్డు చేసుకుంటుంది.

తిరిగి మరోమారు కడుపు పండేవరకు ఈ బిడ్డ గురించిన ఆలోచనలే చేస్తుంది. పిల్లలు పుట్టగానే వారిదే లోకంగా మారిపోయి, అమ్మ లోకంలో విహరించే ఆడవారిగురించి ఎన్నెన్ని వర్ణనలు, ఎన్నెన్ని కథలు ప్రచారంలో వున్నాయో లెక్కలేదు.

## సంపూర్ణ ఆనందం

మాతృత్వం ఒక వరం. అమ్మ ఒక దేవత అనేది ఆ కలలు, ఊహలు, వాస్తవాలనుండి వచ్చినవే. అయితే నేటితరం ఆ కలలలో తేలిపోగలుగుతున్నారా! ఆ వాస్తవాలను ఆస్వాదించగలుగుతున్నారా! మాతృత్వపు మధురక్షణాలు వారు గుర్తుపెట్టుకోగలుగుతున్నారా! ఇవన్నీ నేటి సందేహాలు.

ఆర్థికంగా బాగా అభివృద్ధిచెందిన దేశాలలో కొద్ది శాతంమంది మాత్రమే అమ్మాఅనేస్థానం వద్దనుకుంటున్నారని తేలింది. పిల్లలే వద్దనేవారి కారణాలు వారివి. కాని వివాహానికి సిద్ధమన్న వారిలో 95శాతంపైన మాతృత్వం అవసరమనే అంటున్నారు.

ఐతే వివాహానికిముందే తల్లి అవటం పెరుగుతున్నది అమెరికా వంటి దేశాలలో. అలాంటి వారు కూడా తమ అమ్మ అయ్యే మధురక్షణాలనుమరచిపోలేం అంటున్నారు.

కాని 'సింగిల్ పేరెంట్ చైల్డ్'ని మానసిక సమస్యలతో నిండిన పిల్లలుగా భావిస్తున్నది సమాజం. అటువంటి తల్లులు ఒంటరిగా తాము గడిపిన గర్భకాలాన్ని తలచుకుని తప్పుచేశామా అనుకోవాల్సి వస్తుంది.

ప్రకృతి ధర్మానికి విరుద్ధంగా పిల్లలను కనవద్దు, పెంచవద్దు అనే కొత్త ప్రచారం ఇప్పుడు ఆ యా దేశాలలో మొదలుపెట్టారు. దీనికంతటికి కారణం మాతృత్వకాలాన్ని సంపూర్ణంగా ఆనందించటం అమ్మాయిలకు అవసరమనే నమ్మకం పెరగటమే.

సాంప్రదాయ సమాజాలలో అమ్మాయిలను పెళ్ళికి, సంసారానికి, పిల్లలను కనటానికి తగినట్టుగా తయారుచేసే పెద్దలు ఇంట్లో వుండేవారు. నేడు అభివృద్ధిచెందిన సమాజాలలో 'కౌన్సిలర్స్'అని ఒక ప్రత్యేక వృత్తిగా ఇస్తున్న సలహాలన్నీ ఆ కాలంలో ఇంటిలోని పెద్దలు ఫీజు తీసుకోకుండా ఇచ్చినవే.

అమ్మ అవబోతున్న అమ్మాయిని తమ సంరక్షణలోకి తీసుకునేవారు అమ్మాయితరఫు పెద్దలు. అక్కడనుండి కడుపులోని బిడ్డ ఆరోగ్యంతో పెరగటానికి అవసరమైన ఆహారాన్ని అందించటం.మనసుకి ఎటువంటి కష్టం కల్పించని వాతావరణం ఇంటిలో ఏర్పాటుచేసేవారు.


Courtesy : ABHIYAANMAGAZINE

ప్రసవానికి పుట్టింటికి వెళ్ళటం అనేది ఒక చక్కటి సాంప్రదాయం అని నేడు పాశ్చాత్యులు అంగీకరిస్తున్నారు. ఐతే అటువంటి సావకాశం లేని సామాజిక వాతావరణం అన్నిచోట్ల వచ్చింది.

మన దేశంలోకూడా వస్తున్నది. అందుకే అమ్మతనాన్ని ఆనందించలేకపోతున్నారు.

అమ్మతనం ఆనందించలేని పరిస్థితి సమాజంలో పెరగటం ఆందోళన కలిగిస్తున్నదనేది ఒక అంతర్జాతీయ పత్రికలో వచ్చిన కథనం. దాదాపు వెయ్యిమంది అమ్మలను వారి అనుభవాల గురించి ఇంటర్వ్యూలుచేసి సేకరించిన సమాచారంబట్టి వారు ఈ నిర్ణయానికి వచ్చారు.

అమ్మతనం ఆనందించాలన్న వారి కలలు సాకారంకాలేని పరిస్థితి నేడునెలకొన్నది. మారిన సామాజిక,ఆర్థిక, సాంకేతిక వాతా

- మాతృత్వపు మధురానుభావాలు
- సహజ నొప్పులను అంగీకరించటంలేదు
- తల్లి బాధ్యతలనుండి దూరం
- అమ్మతనం అందుకోలేని తరం

వరణం అమ్మాయిలలోగందరగోళం పెంచుతున్నది. ఇదివరలో గర్భవతి అయినప్పటి నుండి అమ్మ నుండి సలహాలు తీసుకునేవారు.

ఇప్పుడు అమ్మతో కాలంగడపలేని పరిస్థితి.అమ్మ నుండి, ఇతరకుటుంబ పెద్దలనుండి సలహాలు తీసుకోవటం చిన్నతనమవుతోంది. వారివన్నీ పాత పద్ధతులంటూతోసిపుచ్చి తనతోటివారితో చర్చిస్తున్నారు.

పత్రికల్లో వస్తున్న విషయాలకు, ఇంటర్నెట్‌లో లభించే సమాచారానికి విలువ ఇస్తున్నారు. వాటిలో భిన్నమైన సమాచారం వుంటున్నది. కొన్నిసందర్భాలలో పూర్తిగా విరుద్ధమైన సమాచారం లభిస్తున్నది. అందులో ఏదిసరైన సమాచారం, దేనిని అనుసరించాలి అనేది మరింత ఇబ్బందికి గురిచేస్తున్నది.

అమ్మగాని,ఇంటిలోని పెద్దలు గాని ఆ అమ్మాయి శారీరక, మానసిక తత్వంగురించి తెలిసినవారుగా, వాటిని పరిగణనలోకి తీసుకుని సలహాలుఇస్తారు.

కాని ఇతర పద్ధతుల్లో లభించే సమాచారం 'గర్భిణీ స్త్రీలంతా ఒక్కటే' అనే రకంగా రూపొందించబడినవి. ఈ విషయం అర్థంచేసుకోని అమ్మాయిలు తమమీద వచ్చిపడుతున్న అనవసరపు సమాచారంతో కడుపులో వున్న సమయంలో మానసిక ఒత్తిడిని పెంచుకుంటున్నారు.

కడుపుతోవున్నప్పుడు తీసుకునే ఆహారం,విశ్రాంతి వంటివి కీలకంఅని తెలిసినా వాటినిపాటించనందున అమ్మతనపు తొలిదశను ఆనందించటం లేదన్నది సర్వేలో తేలిన విషయం.

ఆర్థిక స్వాతంత్ర్యం అనే ఆలోచనతో ఉద్యోగాలు చేస్తున్నారు. ఉద్యోగినులకు ప్రసూతి సెలవులు ఇస్తారు. అయితే ఈ సెలవును తనకుపుట్టే బిడ్డతో ఎక్కువకాలం గడిపేందుకు వాడుకోవాలన్న ఆలోచనతో నెలలు నిండుతున్నా ఆఫీసుల్లో పనిచేస్తున్నారు. ఇది ఒక రకమైన ఇబ్బంది. తన కడుపులోని బిడ్డగురించి, తన ప్రసవం గురించి ప్రశాంతంగా ఆలోచించాల్సిన వేళ, పలు రకాల ఆఫీసుపనుల ఒత్తిడిని నెత్తిన వేసుకుంటున్నారు.దీనితో కడుపులోనిబిడ్డ కదలికలను గుర్తించి ఆనందించే అవకాశం కోల్పోతున్నారు.

## ● ఆర్థిక, సాంకేతిక వాతావరణం

తల్లుల ఆనందాన్ని లాగేస్తున్నది సాంకేతిక అభివృద్ధి. ఇంటర్నెట్ సమాచారంమీద నమ్మకం పెంచుకున్న ఈ తరం అమ్మాయిలు గర్భస్థసమయం, ప్రసవ సమయం అన్నింటికీ గూగుల్‌నే గురువుగా తీసుకుంటున్నారు. తమ గర్భస్త అనుభవాలను ప్రసవాన్ని రికార్డుచేసి యూట్యూబ్‌లో పెడుతున్న ప్రముఖులున్నారు.

సహజ ప్రసవంగురించి కలలు కనని అమ్మాయిలు వుండరు. పురిటినొప్పులు అనేవి అనుభవించి తీరాలంటుంది ప్రకృతి. అటువంటి నొప్పులను భరించి బిడ్డకు జన్మనివాలన్న కోరిక అమ్మాయిలలో వున్నప్పటికీ అదికూడా తీరనివ్వటంలేదు నేటి వైద్యులు.

సహజ ప్రసవం ఇష్టత దాదాపు 60శాతం మంది అమ్మాయిలకు వుంటుంది. ఆ కోరికతోనే ఆసుపత్రికి వస్తారు.కాని చివరికి వారికి పురిటినొప్పుల అనుభవం కూడా రానివ్వకుండా 43శాతం మందికి ఎపిడ్యూరల్ నిర్వహిస్తారు, 22శాతం మందికి సిజేరియన్ చేస్తారు వైద్యులు.

తాముకోరుకున్న పద్ధతిలో ప్రసవ అనుభవంతోబయటకు రావటంలేదు. పుట్టినబిడ్డను వెంటనే తాను చూసుకోవాలని, దగ్గరకు తీసుకోవాలనుకుంటుంది తల్లి. కాని చివరికి ఆ అవకాశాన్ని ఇవ్వని హడావుడి ఆసుపత్రుల్లో చేస్తున్నారనేది ఫిర్యాదు.

బిడ్డతో గడపాల్సిన సమయంలో ఆఫీసులో, బిడ్డ పాల కోసం ఎదురుచూస్తున్న సమయంలో కంప్యూటర్ ముందు గడిపే తల్లులు మానసికంగా ఇబ్బందిపడుతున్నారు.

మనసులో తల్లి పాలు ఇవ్వాలనే వుంటుంది. తల్లిపాలు తన బిడ్డ ఆరోగ్యానికి దోహదం చేస్తాయని తెలుసు. అయినా పాలు ఇవ్వలేని పరిస్థితిలో మాతృత్వపు ఆనందం ఎక్కడ అన్నది వారి ప్రశ్న. ప్రతిదశలో మాతృత్వపు అనుభవం ఒక సవాలుగా నిలుస్తున్నది. ఆనందంకన్నా ఆదుర్దా అధికం.

మధురఅనుభవంకన్నా మానసికఒత్తిడి ఎక్కువ. ఇది నేటి పరిస్థితి. కాని కాలం వెనక్కి తిరుగుతున్నది. ఆసుపత్రుల వాతావరణం, వైద్యుల హడావుడి భరించలేని విదేశీయులు ఇప్పుడు ప్రకృతిసహజ ప్రసవవిధానాలను అనుసరిస్తున్నారు.

మంత్రసానులకు డిమాండ్ పెరుగుతోంది. ఇంటి దగ్గర ప్రసవమే క్షేమం అనుకుంటున్నారు. గర్భిణీస్త్రీలను అమ్మలాగా చూసుకునే మంత్రసానులు, నగర వాతావరణానికి దూరంగా ఒక ప్రశాంత వాతావరణంలో ప్రసవ కేంద్రాన్ని నిర్వహిస్తున్నారు. ఆసుపత్రి ప్రసవాలు వద్దేవద్దని ఇంటి దగ్గరే ప్రసవాన్ని కోరుకున్న అమెరికన్ అమ్మాయిల సంఖ్య 2015లో 38 వేలుగా నమోదు అయింది.

సిజేరియన్‌కి వ్యతిరేకంగా పెద్ద ఉద్యమంచేసిన బృందం ఈ ప్రత్యామ్నాయ ప్రసవపద్ధతులు, ప్రదేశాలను నిర్మిస్తున్నారు.

మనంపాశ్చాత్యంవైపు పరుగులుతీస్తుంటే వారు మన సాంప్రదాయ పద్ధతులను కొంచెం మెరుగుపరిచి ప్రయోగాత్మకంగా అమలుచేస్తున్నారు. మాతృత్వానికి సంబంధించిన ఏ ఒక్క ఆనందానికి ఆడవారు దూరం కాకూడదు. మరోజీవికి జన్మనివ్వగలిగిన దైవత్వశక్తి ప్రకృతి స్త్రీకి మాత్రమే ప్రసాదించిన విషయం మరువకూడదు.

వి.రఘురామ్

# కొత్త అనుభవాలు



"నన్ను చూస్తే ఈయనగారికి మామిడల్లం దుంపలు, మొక్కజొన్న పొత్తులు తప్ప ఇంకేమీ గుర్తుకురావేంటి చెప్మా!" ఆదిత్య తెచ్చిన కూరలసంచీని ముందేసుకుని వేటికవి వేరుచేస్తూ మంటగా అనుకుంది సాహితి.

ఆ క్షణాన తాను స్వగతంలో అనుకున్నది అతడికి చెప్పినా "అలా అంటావేంటి సాహీ... నిన్ను చూస్తే మరుమల్లెల మాలలు, మంచిగంధపు పూతలు, మరువపు గుబాళింపులు, మలయానిల వీచికలు మనసున మెదిలి నా మనశ్శాంతిని దోచుకుని నన్నారడి పెడతాయి. అనుక్షణం నీ సన్నిధిలో సేద తీరాలన్న కోరికతో నామది వేగిపోతూ ఉంటుంది..." అంటూ రొమాంటిక్‌గా బదులిస్తాడని ఆశించడం పేరాశే అనిపించుకుంది.

ఆదిత్యలో ఆ రొమాంటిక్ యాంగిల్ అసలు లేనేలేదు. పెళ్ళయిన కొత్తలో మాటామంతీ లేకుండా, ముద్దపప్పులా ఉంటూ, తనతో మూగ శృంగారం వెలగబెడుతూఉంటే  కొత్తకదా! మొహమాట పడుతున్నాడు అనుకుంది.

తనని చూడగానే ఆ కళ్ళలో మెరుపు చిందులేసి, కోరిక కదం తొక్కకపోతే.. అలా బయటపడితే నలుగురూ నవ్వుతారని బిడియపడుతున్నాడని... గోల చేస్తున్న మనసుకి సర్ది చెప్పుకుంది.

ఆదిత్య ఏనాడూ తన అందాన్ని పెదవి విప్పి కీర్తించలేదు. ఎవరైనా లేనిదాన్ని ఉన్నట్లు ఊహించి పొగిడే సాహసం చేయనక్కరలేదు కాని, కళ్ళు చెదిరే సౌందర్యాన్ని కనీసం అభినందించవచ్చును కదా!

చిక్కటి చీకటి నిండిన గదిలోకి వెలుగు కిరణాలు చొచ్చుకుపోయేందుకు మార్గం లేనట్లే అనుభూతులు కరువైనఅతడి ఎదలోకి బలవంతాన ప్రవేశించే వీలులేక నరకయాతన అనుభవిస్తోంది ఇన్నాళ్ళుగా. ఎటువంటి రసోక్తులకి, సరససల్లాపాలకి, ఆనందాలకి తమ మధ్య తావివ్వకుండా ఏదో యాంత్రికంగా తనతో అతడు సలిపిన కాపురానికి సాక్ష్యంగా సాకేత్ కడుపున పడ్డాడు.

బలవంతంగా చేసినా, ఇష్టపూర్వకంగా చేసినా కాపురం కాపురమే కదా! తాను తల్లినౌతున్నానన్న ఆనందం అందుకు కారణమైన జీవనసహచరునితో పంచుకుందామన్న ఆరాటంతో ఎంతో ఆశగా ఆ

కెం.కెం.భాగ్యశ్రీ



**తన స్పర్శను తృణీకరిస్తూ అలా ఎడమవడం అతడికి వింత గొలిపింది. తనకిష్టం లేకపోతే నోరిప్పి 'ఇవాళ వద్దు' అని చెప్తుంది కాని, ఇలా మౌనముద్ర దాల్చదు. ఆమె నిద్రపోతోందో... నిద్ర నటిస్తోందో తెలియక, అక్కడ నుండి లేచి హాల్లోకి వచ్చి కూర్చుని పుస్తకం పట్టుకున్నాడు అతడు. ఇంతలో...**

తీపికబురు అతడి చెవిన వేస్తే "అలాగా! నీ ఆరోగ్యం జాగ్రత్త" అంటూ అభావంగా అనేసి, ఇక చెప్పడానికి ఇంకేమీ లేనట్లుగా పక్కకు తిరిగిపడుకున్న మొగుడిని చూస్తే సాహితికి తనమీద తనకే జాలి ముంచుకొచ్చింది. ఇలా దాంపత్యం అంటే! ఇదా సరససరాగాలతో సాగే సుఖసంసారం అంటే! జీవితం అంటే విరక్తి ముంచుకొచ్చింది ఆ క్షణాన.

తన ఖర్మ ఇంతే!ఏం చేస్తాం?భగవంతుడు అందరికీ అన్నీ ఇయ్యడు కదా! అనుకుని సరిపెట్టుకున్నా మనసు మాత్రం ఏదో వేదనతో తపిస్తూ ఉంటుంది అప్పుడప్పుడు. అన్యోన్యంగా ఉన్న ఏ జంటని చూసినా తాను కోల్పోయినదేమిటో అర్థం అయ్యి మనసు ఆర్తితో నిండిపోతుంది.

సంసారం అంటే 'సం'... సారం ఉండాలని అతడెందుకు తెలుసుకోలేడో ఆమెకి బోధపడదు. రెండేళ్ళ కిందట కూతురికి పెళ్ళిచేసి ఆమెకు ఓ పురుడు పోసి అమ్మమ్మ అనిపించుకున్నాక, మూడునెలల కిందట కొడుక్కి ఓ అమ్మాయిని కట్టబెట్టి అత్తగారి హోదా సంపాదించుకుంది.

ఇలా పెళ్ళయిందో లేదో అలా... ఆషాఢమాసం తరుముకొచ్చింది. నవదంపతుల విరహానికి ఆజ్యంపోసిన ఆషాఢమాసాన్ని ఎలా సాగనంపాలా అని మధనపడినా దాని గడువుతీరేవరకు అది ఉండి, నవదంపతుల గుండెల్లో విరహపు నిట్టూర్పుల సెగలు రగిల్చిరగిల్చి మరీపోయింది.

ఆషాఢమాసం వెళ్ళాక శ్రావణ మాసానికి స్వాగతగీతి పాడి ఆహ్వానం పలికాక కోడలిని కాపురానికి దించవలసిన బాధ్యత సాహితిపైనే పడింది.

"మీ అన్నయ్యకి నేను లేకపోతే క్షణం గడవదు. మైత్రిని మీరే దిగబెట్టకూడదూ!" ఆదిత్య సంగతి తెలిసిన సాహితి వియ్యపురాలిని కోరింది.

"ఏం చేయమంటారు వదినగారూ! నాకు కూడా వెళ్ళాలనే ఉంది. పెద్దమ్మాయికి కూడా నా చేతులతోనే సంసారంఏర్పరచాను. చిన్నదానికికూడా అలాగే చేయాలని ఉంది. కాని, సరిగ్గా పెద్దమ్మాయిని అదే సమయంలో పురుటికి తీసుకొస్తున్నామాయే!

సరిగ్గా ఏడోనెల వెళ్ళిపోయేముందే కుదిరింది ముహూర్తం. లేకపోతే ఇంకోటి మార్చుకుని ఉండేవాళ్ళం. దయచేసి మీరు వెళ్ళి నాలుగూ చూసి అమర్చిరండి" నిస్సహాయంగా చెప్పిందావిడ.

'నెలరోజులా! అన్ని రోజులపాటు నేను చేయి కాల్చుకుని ఆఫీసుకి పరుగెత్తాలా!" లబోదిబోమన్నాడు ఆదిత్య. 'ఎప్పుడూ తిండికి లోటవుతుంది అనేకానీ ఒక్కసారన్నా...' సాహీ... నువ్వు లేకపోతే నేను ఉండలేను' అని మాత్రం అనరు!' ఉడుకుబోతుతనంతో పెదవి కొరుక్కుంది సాహితి.

పెదవికి గాయమై రక్తం ఉప్పగా నాలుక్కి తగిలింది కాని, ఆశించిన చలనం మాత్రం శూన్యం.

"మీకిబ్బంది అవుతుందని అమ్మని ఎప్పుడూ, ఎక్కడికీ పంపకపోతే? అమ్మకీ కాస్త ఆటవిడుపుగా ఉంటుంది పంపించండి" కొడుకు శ్రీహాస్ కాస్త గట్టిగానే అన్నాడు. అతడిని కాదనలేక అయిష్టంగానే సాహితిని వారితోపాటుగా పంపాడు.

కొడుకు కొత్తసంసారానికి కావలసినవన్నీ అమర్చడంతో నాలుగు రోజులిట్టే గడిచిపోయాయి. ఎప్పుడూ మాటామంతీ లేని మూగమొగుడితో ఒక గానుగెద్దులా మసలుకునే సాహితి కొడుకు కోడళ్ళ ప్రేమ నిండిన దాంపత్యాన్ని చూసి పులకించిపోయింది.

నిన్న కాక మొన్న వివాహబంధంతో ఒక్కటైన ఆ జంట ఒకరికోసం ఒకరన్నట్లుగా మసలుకుంటూ ఉంటే ఏదో ఆనందంతో మనసు మురిసింది.

తన వయసుని మరచిపోయి చిన్నపిల్లలా వాళ్ళతో కలిసి ఆనందంగా గడిపింది. వారి ముద్దుముచ్చట్లు చూసి పొంగిపోయేది సాహితి.

కొన్ని సందర్భాల్లో తాననవసరంగా ఆ కొత్త జంట నడుమున 'పానకంలో పుకడలా' ఉందేమో అన్న బిడియంతో వేగిపోయేది.

"ఒరేయ్ శ్రీ... నేనొచ్చిన పనైపోయింది.తత్కాల్‌లో టికెట్ బుక్ చేసేయి. నేనిక వెళ్ళిపోతాను" అంది. ఓ మూడు రోజులైనాక.

"ఏమ్మా? బోర్ కొడుతోందా! అప్పుడే వెళ్తానంటున్నావు?" చిన్నబుచ్చుకున్నాడు శ్రీహాస్.

"బోర్ కాదు నాన్నా... మీరిద్దరూ చిన్నపిల్లలు. హాయిగా ఎంజాయ్ చేయండి. పైగా మీ నాన్నఒక్కరూ అక్కడ అవస్థపడుతున్నారు" చెప్పింది సాహితి కొడుకు తల ప్రేమగా నిమురుతూ.

"ఆయనని ఎప్పుడూ విడిచి ఉండడం అలవాటు లేక అలా అంటున్నావు. ఎప్పుడూ ఇంటినే పట్టుకు వేలాడుతావుకదా! మళ్ళీమళ్ళీ ఇల్లు కదలడం నీ వల్ల కాదుకాని, ఎలానూవచ్చావు... మరో నాలుగురోజులు ఉండి వెళ్ళు" బలవంతం చేశాడు శ్రీహాస్.

"అవునత్తయ్యా... నాకింకా వంట పూర్తిగారాలేదు. మీరు కొన్నాళ్ళుంటే మరికాస్త నేర్చుకునే అవకాశం ఉంటుందికదా! లేకపోతే నా వంట తినలేక శ్రీ నానా

## ఆ అనుభూతి కావాలి

కోరిన సినిమాల జాబితా తారలకు కొండంత వుంటుంది. ఎటువంటి సినిమాలో నటించాలని వుంది? అని అడిగితే శృతిహాసన్ ఒక్కనిమిషం కూడా తడుముకోవడంలేదు.

"మా నాన్నగారు చేసిన గొప్ప సినిమాలు ఎన్నో ఉన్నాయి. 'మహానది' చిత్రం అంటే నాకు ఎంతో ఇష్టం. చూసిన ప్రతిసారీ ఉద్వేగానికిలోనవుతుంటా. ఎన్నిసార్లు చూసినా ప్రతిసారీ కొత్త అనుభూతి కలుగుతుంటుంది. ఆ జ్ఞాపకాలు చాలా రోజులు వెంటాడుతుంటాయి. అటువంటి లక్షణాలుగల, ఆ విధమైన అనుభూతులు ఇచ్చే సినిమాలో నటించాలన్నది నా కోరిక" అంటున్నది.



బాధాపడతారు" పక్కనేచేరి ముద్దులు గునిసింది.

"గ్రహించావు కదా! అల్లరిగా ఆమెను ఆటపట్టించిన శ్రీహాస్‌ని ఎవరూ చూడడంలేదనుకుని గిల్లేసి 'చూడండత్తయ్యా... శ్రీ ఎలా వెక్కిరిస్తున్నారో' అంటూ ఏమీ ఎరగనట్లు అమాయకంగా తనకి ఫిర్యాదు చేసిన కోడలి గడుసుతనం చూసి ముక్కున వేలేసుకుంది సాహితి.

కొడుకు కొత్తకాపురాన్ని పదిలం చేశాక ఇంటికి వచ్చేసిన సాహితి, ఈ నెలరోజులూ వండుకుని బయటకువెళ్ళలేక ఎంత బాధపడ్డానోతెలుసా!' అని స్వాగతం పలికిన పతిదేముడిని చూసి అసహనంతో తల బాదుకోవాలన్న ఆలోచనని బలవంతాన ఆపుకుంది. పెళ్ళాం అంటే వంటలక్కగా తప్ప మరి ఇంక దేనికీ పనికిరాదా ఇతగాడికి! అంటూ ఆక్రోశించింది ఆమెమది మూగగా.మనసు మరింతగా ముడుచుకుపోయింది తనలోకి తనే.

అన్నాళ్ళ వియోగం తర్వాత ఆ రాత్రి భర్త తనమీద చేయివేసినా దూరంగా జరిగిపోయింది.

ఎన్నో ఏళ్ళుగా మూసుకుపోయి తుప్పుపట్టిన మనసు తలుపులు అన్నిరోజుల తరువాత తెరుచుకున్నాక మరబొమ్మలా భర్త కౌగిట కరగలేకపోయిందెందుకో! బహుశా మనసుకి కూడా ఆనందం కావాలని తొలిసారి తెలుసుకున్నందుకా!

ఆదిత్య కూడా తొలిసారి భార్య ప్రవర్తనకి ఆశ్చర్యపోయాడు. ఏనాడూ లేనిది... భార్య తన స్పర్శను త్యణీకరిస్తూ అలా ఎడమవడం అతడికి వింత గొలిపింది. తనకి ఇష్టం లేకపోతే నోరిప్పి ఇవాళ వద్దు అని చెప్తుంది కాని, ఇలా మౌనముద్ర దాల్చదు.

సాహితి నిద్రపోతోందో...నిద్ర నటిస్తోందో తెలియక, నిద్రాదేవత తన రెప్పలమీద కొలువుతీరక లేచి హాల్లో కూర్చుని పుస్తకం పట్టుకున్నాడు.

పుస్తకంలో ఒక ఆర్టికల్ ఇంట్రెస్టింగ్‌గా ఉండడంతో ఆసక్తిగా చదవడం మొదలుపెట్టాడు ఆదిత్య. కొన్నేళ్ళ సంసారం తరువాత భార్యాభర్తల మధ్యన సాగే శృంగారంలో మొనాటనీ ఎందుకు ఏర్పడుతుందో వివరంగా రాశారు అందులో.

'ఆ మాటకొస్తే తమ సంసారం ఎప్పుడూ యాంత్రికమే కదా!' మొదటిసారిగా అనుకున్నాడు ఆదిత్య. దానికి కారణం సాహితా! కాదు..

ముమ్మాటికీ తానే. చేదుమాత్రలాంటి వాస్తవం దిగమింగలేక కాసేపు యాతనపడ్డాడు ఆదిత్య. తేరుకుని మళ్ళీ పుస్తకంలోకి దృష్టి సారించాడు.

ఆడవాళ్ళ మనసులు పూలకన్నా సున్నితంగా ఉంటాయి కాబట్టి వాళ్ళని జాగ్రత్తగా చూసుకోవాలట. ఎప్పటికప్పుడు భార్య అందాలను మనసారా మెచ్చుకుంటూ, ఆమె సౌందర్యం తన కళ్ళకి ఎప్పటికీ నవనవోన్మేషమేనని, తనని, తన అంతరంగాన్ని నిత్యయవ్వనంగా ఉంచే రసౌషధమని అన్యాపదేశంగా ఆమెకు తెలియజేస్తూఉండాలట.

అలాగే ఆడవాళ్ళు...చాలారోజులై సంసారం చేస్తున్నాంకదా! ఎలాఉన్నా మొగుడు దగ్గరకొస్తాడు అని అనుకునేందుకు వీల్లేదట! ఎప్పుడూ పరిశుభ్రంగాఉంటూ, చక్కగా అలంకరించుకుని చిరునవ్వుతో తనని ఆహ్వానించే భార్యని పురుషుడు బాగా ఇష్టపడతాడట. అలాంటి శ్రీమతి సన్నిధిలో సేదతీరాలని ఆరాట పడతాడట. నిరంతరం ఆమె నామమే జపిస్తూ, ఆమె చెలిమిలో తన పురుషత్వాన్ని సార్థకం చేసుకోవాలని తపిస్తాడట.



**స్వతంత్ర కాశ్మీర్‌పై మాట్లాడే వారంతా పాకిస్తాన్‌కి వెళ్ళిపోవటం మంచిది. -ప్రవీణ్ తొగాడియా, వి.హెచ్.పి. ప్రెసిడెంట్**

ఆ వ్యాసాన్ని ఆసాంతం చదివి పుస్తకం మడిచి టీపాయ్ మీద పడేశాడు ఆదిత్య.

అందం సంగతి తనకు తెలియదు గాని, సాహితి మాత్రం తనకు దొరికిన మహత్తర వరం. ఆ సంగతి తమ వివాహమైన తొలినాళ్ళలోనే తెలుసుకున్నాడు. చక్కటి రూపం-

సత్ప్రవర్తన, సంసారాన్ని సర్దుకునే నేర్పు ఇత్యాది మంచి లక్షణాలు అన్నీ ఒకచోట గుది గుచ్చితే అది సాహితి రూపాన్ని సంతరించుకుంటుంది అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

అటువంటి మహిళారత్నం తన జీవితంలోకొచ్చాక కూడా తానింత స్తబ్దుగా ఎందుకున్నాడూ అంటే...

తన మనసుమీద పడిన కొన్ని మరకలు తనని అలా జడునిగా చేశాయేమో!

చిన్నతనంలో తన ఇంట్లో చూసిన కొన్ని సంగతులు తనని అలా తయారుచేశాయి.

"సరూ నీకళ్ళు కలువరేకులు అంటూ..." ఏకాంతంలో అంటున్న అన్నయ్యని-

"సర్లెండి... పొగడ్తలకేమిటి! అవసరం కాస్తా తీరిపోతే ఇవేకళ్ళు చింతాకుల్లా కనిపిస్తాయి.

మీరు పొగిడినా పొగడకపోయినా పెళ్ళాం అన్నాక పక్కలోకి రాక తప్పదుకదా!" అంటూ ఈసడించుకునే వదినని చూస్తే ఆడవాళ్ళందరూ అలాగే ఉంటారేమో అన్న అపోహ కలిగింది.

ఆమెనలా తయారుచేసిన తన ఇంటి సంప్రదాయ వాదుల భావజాలంలో నుంచి తాను విడివడడం మానేసి, అందులోకే కూరుకుపోవడం మొదలెట్టాడు. దశాబ్దాలపాటు ఆ ఊబిలోనే గడిపినా వాళ్ళలా స్త్రీ అంటే చులకనభావం మాత్రం ఏర్పడలేదు.

అలాగని ఆమె ఔన్నత్యాన్ని గుర్తించి, కీర్తించే తత్వమూ అలవడలేదు.

మగవాడు ఏదో ఆశించి మాత్రమే తమ అందాన్ని మెచ్చుకుంటాడని సగటు స్త్రీలందరూ భావిస్తారని, కేవలం పడకగదిలో మాత్రమే శ్రీమతి శ్రీవారి కళ్ళకి అందంగా కనబడుతుంది కాబట్టి, మగవాళ్ళు అప్పుడే ఆడవాళ్ళని పొగుడుతారన్న అపోహ స్త్రీలందరికీ ఉంటుందని అతడి మదిలో బలంగా నాటుకుంది. అలాంటివే మరికొన్ని ఘటనలు చూశాక.

పెళ్ళిచూపుల్లో సాహితిని చూసినప్పుడు తన కలలరాణి ఈమే అని గట్టిగా ఫిక్సయ్యాడు.

పద్మపత్రాల్లాంటి విశాలమైన సాహితి నయనాలు చూస్తే కవిత్వం అంటే ఏమాత్రం తెలియని తన మదిలో కవితావేశం వెల్లువైపొంగేది.

అక్షరంముక్క రానివాడిచేతకూడా కావ్యాలు పలికించే ఆమె కళ్ళు

సూదంటురాళ్ళై తనని ఆకట్టుకున్నాయి.

మూడుముళ్ళు పడిన తరువాత తమదైన రస సామ్రాజ్యాన్ని ఏలే శుభతరుణంలో మదిని ముంచెత్తే రసోద్వేగాన్ని బయల్పరచాలని అనుకున్నప్పుడు ఆనాటి వదినమాటలు మెదడులో మెదిలి తనని ఆలోచనలో పడేశాయి.

మగవాడు తన పబ్బం గడుపుకునేందుకు అలా మాయదారిమాటలు చెప్తాడన్న ఆవిడ అభిప్రాయమే సాహితికీ ఉండి ఉంటే...అన్న సందేహం తనలోని రసహృదయపు నోరునొక్కేసింది.

ఫలితం ఇన్నేళ్ళుగా రసహీనమైన కాపురం. తన నుంచి ఏదో ఆశిస్తున్నట్లుగా సాహితి చూసే చూపులు తనని వెంటాడకుండా ఒక గిరిగీసుకుని అందులో బతుకుతూ వస్తున్నాడు.

కాని, ఇన్నేళ్ళ తరువాత.. సాహితిలేని ఈ ఇల్లు నిశ్శబ్ద నిలయంలా అనిపించింది. ఆమె అందెలసవ్వడి వినబడని ఈ నీరవం పిచ్చెక్కించింది. ఆమె స్వరం చెవులపడకపోతే ఏదో చైతన్యం లోపించినట్లనిపించింది.

ఇప్పుడీ వ్యాసం చదివాక, ఇప్పటి సాహితి ప్రవర్తనని సమీక్షించుకున్నాక, తనలోని లోపం భూతంలా బయటకొచ్చి తనని భయపెడుతున్నట్లుంది.

ఇన్నేళ్ళ తన స్తబ్దత, తన భావప్రకటనా రాహిత్యం సాహితిని ఇంకెంత భయపెట్టిఉండాలి!



ఆనాటి ఆడపిల్ల కాబట్టి తాను ఎలా ఉన్నా సర్దుకుని పోయింది సాహితి. అదే ఇప్పటి అమ్మాయిలు అయితే... ఈపాటికి విడాకులే! ఆలోచన రాగానే కంపించిపోయాడు ఆదిత్య. సాహితిలేని జీవితాన్ని ఊహల్లోనైనా భరించలేనట్లుగా తల విదిల్చాడు.

తానేం చేయాలో ఆలోచించుకుంటూ బెడ్ రూమ్‌లోకి వెళ్ళాడు.

అన్నాళ్ళుగా హృదయంలో అదిమేసుకున్న భావావేశం ఒక్కసారిగా బద్దలైన అనుభూతి కలిగింది ఆదిత్యకి. మెల్లిగా సాహితిని కుదిపాడు.

ఒక్కసారిగా ఉలికిపడి లేచి ఆమెకి తననే చూస్తూ కూర్చున్న భర్త కనబడ్డాడు.

"వద్దని చెప్పానా!" అంటూ విసురుగా ఏదో అనబోయిన సాహితి ఆదిత్య కళ్ళలోనుంచి జాలువారుతున్న అనురాగధారలని గమనించి విస్తుపోయింది.

ఇన్ని సంవత్సరాల కాపురంలో ఏనాడూ ఆ కళ్ళలో అలాంటి భావాన్ని చూడలేదు తను.

అసలు అతడి కన్నులు తనని చూస్తేకదా! భావాలు కనబడడానికి! ఈరోజు ఆదిత్య కొత్తగా ఎందుకు కనబడుతున్నాడూ!

తననితానే తరచితరచి ప్రశ్నించుకున్నా దొరకని సమాధానం!

"నన్ను క్షమించు సాహీ..."ఆదిత్య స్వరం వింతగా ధ్వనిస్తోంది. విస్మయంగా చూసింది సాహితి. 'కొత్తగా ఇదేంటి?'అనుకుంది సంభ్రమంగా.

తన మనసులో మాట తేటతెల్లమయ్యేవరకు, కిక్కిరిసిన హృదయ భాండం పొంగిపొరలేవరకూ అలా... అలా... చెప్తూనే ఉన్నాడు ఆదిత్య.

వీనులు విప్పార్చివినడం సాహితి వంతయింది.

"ఏవేవో అనవసరమయిన భయాలు, ఊహలతో ఒకటి కాదు... రెండు కాదు... ఏకంగా ముప్పైసంవత్సరాలు నిన్ను బాధపెట్టాను. దేనికైనా సమయం రావాలంటారు. ఆ సమయం మన జీవితాల్లో ఇప్పటికి వచ్చింది కాబోలు! ఇప్పుడొచ్చి లాభం ఏమిటి అని నువ్వనుకోవచ్చు. ఇప్పటికైనా వచ్చింది అని నేను సంతోషిస్తున్నా.

గడిచిపోయిన కాలాన్ని వెనక్కి తీసుకొచ్చే శక్తి నాకు లేకపోవచ్చు.

కాని, ఇక ముందు కాలాన్ని ఒక మధుర స్మృతిగా మలచే నైపుణ్యం నాకుందనే అనుకుంటున్నాను. నన్ను నమ్ముతావా!" ఆర్ద్రత నిండిన ఆదిత్య స్వరం ఆ నీరవనిశీథిలో పెళ్ళి మంత్రాల్లా ధ్వనిస్తున్నాయి. విభ్రమ నిండిన దృక్కులతో అతడినే చూస్తూ ఉండిపోయింది సాహితి.

చాలు... అతడికి తనమీద అంతులేని అనురాగముంది. ఆ సంగతి తెలిశాక అతడు తనని, తన అందాన్ని కీర్తించే పనేముంది!

అతడిగుండెల్లో కొలువైన రూపం తనదేనని నిరూపితమైన ఆ క్షణంలో మౌనంకూడా మధురాగాలాపనలు కావిస్తున్న అనుభూతి కలుగుతుంది. ఈ అనుభూతి కోసమే తానిన్ని రోజులూ వెర్రిదానిలా ఎదురుచూసింది.

ఇక తనకా శ్రమ అక్కరలేదు. ఇప్పుడతడి కళ్ళలోనుంచి ధారగా కురిసే ప్రేమ... తనని సంజీవనిలా బతికిస్తూనేఉంటుంది.

ప్రతి ఒక్కరి జీవితాలలో ఏదో ఒక సందర్భంలో కొత్త అధ్యాయం మొదలవుతుంది. ఆ కొత్తకథ ఈనాటికి మొదలైంది తమ బతుకులో.

"సాహీ... నువ్వీరోజెలా ఉన్నావో తెలుసా! కొత్త పెళ్ళికూతురులా... లేతకొబ్బరిముక్కలా..." ఇంకా ఏదేదో అనబోతున్న ఆదిత్య పెదవులని తన పెదవులతో మూసేస్తూ అనుకుంది సాహితి 'ఇక మా మధ్య మాటల అవసరం ఏముంది! అతడి మనసులో నేనే ఉన్నానని ఋజువైనాక'

ఆదిత్య గుండెచప్పుడులో తన అస్తిత్వాన్ని వెదుక్కుంటూ, కాలం తమ మధ్యన ఘనీభవిస్తూఉంటే రసాంబుధిలో ఓలలాడుతూ మైమరచిపోయింది సాహితి.

అర్ధాంగి అంతరంగం తెరచిన పుస్తకంలా ఆవిష్కృతమైన ఆ సమయాన సరససామ్రాజ్యపు చక్రవర్తిలా నిలిచాడు ఆదిత్య.

వచ్చేనాలుగేళ్ళలో ఏ.టి.ఎమ్‌లు, క్రెడిట్, డెబిట్ కార్డుల అవసరం వుండదు. అన్ని లావాదేవీలు స్మార్ట్‌ఫోన్ ద్వారానే.

-అమితాబ్ కాంత్, సి.ఇ.ఓ. నీతి ఆయోగ్



## హృదయాన్ని తాకింది

**బా**లీవుడ్‌లో సొట్టబుగ్గల తాప్సీ కెరీర్ సంతృప్తికరంగానే సాగుతున్నది. 'ముల్క్' సినిమా అవకాశాన్ని అందిపుచ్చుకుని ఆనందపడుతున్నది.

"ఇది రీల్ స్టోరీ కాదు. రియల్ కథ. హృదయాన్ని తాకే చిత్రాలు కొన్నే వుంటాయి.

అటువంటివాటిలో 'ముల్క్' ఒకటి. సినిమా పూర్తయింది. లక్నోలో షూటింగ్ అనుభవాలు బావున్నాయి. మాకు సహకరించిన ఉత్తరప్రదేశ్ పోలీసులకు మనస్ఫూర్తిగా ధన్యవాదాలు చెప్తున్నా" అంటున్నది పింక్ బేబీ తాప్సీ.



Courtesy : LIFE POSITIVE

# ఒక చిన్నమాట

ఏడెనిమిది దశాబ్దాలక్రితమే, ప్రపంచం పర్యావరణ పరిరక్షణగురించి తీవ్రంగా ఆలోచించి, సమావేశాలు జరిపి, తీర్మానాలు చేయకముందే మహాత్మాగాంధీ మన దేశ ప్రజలకు మంచి సలహా ఇచ్చారు. "భూమి, గాలి, నేల, నీరు మనం మన పూర్వీకులనుండి వారసత్వంగా పొందిన సంపద కాదు. మన పిల్లలనుండి మనం తీసుకున్న ఋణమది.

మనం దానిని పొందిన తీరులోనైనా కనీసం అది ఉండేటట్లుచూసి పిల్లలకు అందించవలసివుంటుంది" అలా చేయగలుగుతున్నామా? నిన్నటి స్థితి ఈనాడు లేనంతగా క్రమక్రమంగా క్షీణిస్తున్న మనపర్యావరణం, సహజ సంపదలతో ముందు తరాలకు ఏమి వదిలిపెడతాము? ప్రస్తుతం మన మనుగడే ప్రశ్నార్థకం కావటంలేదా? కొన్నేళ్ళక్రితం నోస్ట్రడామస్ చెప్పిన భవిష్యవాణి చర్చనీయాంశమయింది.

ప్రపంచ పతనాన్ని గురించి భయంకర విషయాలు చెప్పాడు. ఆ మాత్రం భవిష్యవాణి మన పోతులూరి వీరబ్రహ్మం చెప్పలేదా అని అనుకున్న సందర్భాలూ లేకపోలేదు.అదే నోస్ట్రడామస్ భవిష్యవాణిని ఇప్పుడు మళ్ళీ మననంచేసుకునే తరుణం వచ్చింది.

ఈయన పదహారవ శతాబ్దానికి చెందిన ఫ్రెంచి జ్యోతిష్కుడు.వృత్తిపరంగా వైద్యుడు."మనుషులు మనుషుల్ని చంపుకుంటారు. ఆకాశంనుండి అగ్నిగోళాలు పడతా"యని చెప్పిన ఈయన తీరులోనే వీరబ్రహ్మం గారు కూడా రాబోయే అనర్థాలు వివరించాడు.

అడవులు, పర్వతాలు ఉండవని సూర్యతాపానికి ప్రజలు అట్టుడికిపోతారని చెప్పిన విషయాలు, భూగోళం వేడెక్కటం, వాతావరణంలోని మార్పులు ఇప్పటికే సూచిస్తున్నాయి. ఇదివరకు కూడా ఏదో ఒక గ్రహం భూమిని ఢీకొట్టే ప్రమాదం వున్నా అది కొంతలో తప్పిపోయిందని ఉపశమనంతో ప్రజలు నిట్టూర్చారు. దాని గతిని మార్చటానికిసిద్ధంగా ఉన్నట్టు అమెరికా శాస్త్రజ్ఞులూ ప్రకటించారు.

ఇప్పుడు వారికి మరో సవాలుగా 2018లో మరో గ్రహం ఢీకొనే ప్రమాదముందని, భూగోళం తల్లడిల్లి, సునామీలకు, భూకంపాలకు, అగ్నిపర్వతాల లావాలకు గురవుతుందని మరో శాస్త్రవేత్త చెపుతున్నాడు.

గొప్ప భౌతిక శాస్త్రవేత్తగా ప్రపంచం గుర్తించిన స్టీఫెన్ హాకింగ్ మానవ జాతి మనుగడ మరో ఆరు వందల సంవత్సరాలని అంచనా వేస్తున్నారు.

భూగోళం అగ్నిగోళమవుతుందంటున్నాడు. ఇవన్నీ ప్రస్తుత పరిస్థితుల



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

దృష్ట్యా భవిష్యత్‌ను చూచాయగా తెల్పటమే. విశ్వాన్ని, సృష్టిని, శక్తిని, ప్రకృతిని ఎవరు అర్థం చేసుకోగలరు? వీటన్నిటిముందు ఎంత అధ్యయనం చేసి అభివృద్ధి చెందిన విజ్ఞానశాస్త్రంకూడా తలవంచాల్సిందేకదా!

ఇంత విపత్తు వస్తుందా, అంత ప్రమాదం పొంచి ఉందా అని మనం ఆశ్చర్యపడనక్కరలేదు. దీనికి జ్యోతిష్కులు, శాస్త్రవేత్తల వ్యాఖ్యలు అవసరంలేదు. సంకేతాలు మనముందే ఉన్నాయికదా!

దేశ రాజధాని ఢిల్లీ. దేశవ్యాప్తంగా బహుశా ప్రపంచ వ్యాప్తంగాకూడా వార్తల్లో ఉన్న ఢిల్లీ కాలుష్యంగురించి, పర్యావరణం గురించి, మానవ మనుగడ గురించి, ఆరోగ్యము గురించి మనకు ఎన్ని డేంజర్ సిగ్నల్స్ పంపిస్తోందో ఎవరికి తెలియని విషయం!

తక్కిన నగరాలు మాత్రం ఏమి మెరుగు? విష వాయువుల నిలయంగా (గ్యాస్ చాంబర్) సుప్రీమ్ కోర్టు నిరుడే దీనిని పేర్కొంది. ఇప్పుడు అంతకంటే పెద్దపదమే వెతుక్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. శ్వాసకోశ సంబంధిత వ్యాధులు, క్యాన్సర్లు వచ్చే ప్రమాదం ఎక్కువవుతుండగా సగటున మనిషి ఆయుష్షు పదేళ్ళు తగ్గుతున్నదని కూడా తెలియవస్తోంది.

హడావుడిగా పాఠశాలలు మూసేశారు.ఇతరరాష్ట్రాల ట్రక్కులు నిలిపివేశారు. పరిశ్రమలను విశ్రాంతి తీసుకోమన్నారు. ఇంకా ఏమి చెయ్యాలా అని చురుగ్గా ఆలోచించి ముఖ్యమంత్రి కేజ్రీవాల్ సరి, బేసిసంఖ్యల కార్లు సరి, బేసిసంఖ్య తేదీలలోనే రోడ్లమీదకు వచ్చేటట్లు నియమం మళ్ళీ పెట్టాలనుకున్నారు.

గడచిన సంవత్సరం కొన్నాళ్ళు ఇలా చేశారుకాని దానివల్ల రోడ్లమీద రద్దీ తగ్గిందే కాని కాలుష్యంలో పెద్ద మార్పు రాలేదు. ఏ సింగపూర్‌లోనో, ఏ బీజింగ్‌లోనో ఎవరో అమలుజరిపారు కాబట్టి అదే మంత్రం ఇక్కడ పనిచేస్తుందనుకోవటం దురాశే.

ఏదీకూడా కాపీ క్యాట్‌లాగా అనుకరించకూడదు. మన స్థానిక సమస్యలు, వాతావరణం, ప్రజలు దృష్టిలో పెట్టుకుని పరిష్కారాలు చూడాలి.

సరి, బేసి సంఖ్యల పద్ధతి కేవలం కార్లకు, ప్రైవేటు వాహనాలకు అన్వయించి, బస్సులు, ఆటోలు, ద్విచక్ర వాహనాలను వదిలేసే పద్ధతిని నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ అంగీకరించలేదు. దీనితో ఈసారి ఈ పద్ధతి అమలులోకి రాలేదు.

పబ్లిక్ ట్రాన్స్‌పోర్టు పరిస్థితి ఏమాత్రం సంతృప్తికరంగా ఉండదు. దూరాలు ఎక్కువ. సమయానికి పనికి వెళ్ళాలనుకునేవారికి ఇటువంటి నిబంధనలు పెద్ద ప్రతిబంధకాలవుతాయి.

ట్రక్కులు డీజిల్ వాడుతాయి. అవి ఇతర రాష్ట్రాలకు చెందినందున ఢిల్లీలోని సి.ఎన్.జి. వాటికి వర్తించదు. పరిశ్రమలు సరేసరి.

ఎంత దూరం తరలించినా అక్కడ జననివాసాలు తయారవుతాయి. పంజాబ్, హర్యానా, పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో రైతులు పంట కోతలవగానే పొలాల్లో గడ్డిని పెద్ద ఎత్తున తగలబెడతారు. గాలులకు రాష్ట్ర సరిహద్దులుండవు కదా! పశ్చిమ ఆసియాలోని ఎడారుల నుండి కూడా ధూళి వచ్చే అవకాశముంది.

ఇక నగరాభివృద్ధిలో నిర్మాణాలకు కొరత లేదు. దానివల్ల, రోడ్లమీది దుమ్మువల్ల గాలిలో అణువులు విపరీతంగా చేరిపోతాయి. చలికాలం పొగమంచు ఈ ధూళిని, ఈ కాలుష్యాన్ని పైకి పోనివ్వదు.

ఈ సమస్య ఈనాటిది కాదు. ఎంత దానిని పరిష్కరించాలని చూస్తే అంతగా పెరిగిపోతోంది. ఒకసారి ఆలోచించండి. అభివృద్ధి కావాలి. త్వరితంగా కావాలి. దానివలన వచ్చే కాలుష్యాలు వద్దు.

ప్రగతి గురించి ఆలోచించేముందే కాలుష్యాల గురించి ఆలోచించాలి కదా!

దాహం వేసినప్పుడు బావి తవ్వుతారా? పర్యావరణ పరిరక్షకులు అభివృద్ధి నిరోధకులా?



# బాకీ వసూలు

ఒక ఊళ్ళో ధర్మయ్య అనే ధనికుడు ఉండేవాడు.ఆయన ధర్మబుద్ధిగలవాడు; ఊళ్ళో చాలామందికి ఆయన అవసరానికి స్వల్పవడ్డీల మీద అప్పులిచ్చి ఆదుకుంటూ ఉండేవాడు.

బాకీ వసూలు చేసుకోవడానికి ధర్మయ్యకు అనేక పద్ధతులు ఉండేవి.

ధర్మయ్యకు పొరుగున సుబ్బయ్య అనే తెలివిలేని ధనికుడు ఉన్నాడు. సుబ్బయ్యకు ధనాశమెండు. వడ్డీవ్యాపారంచేస్తే బాగా సంపాదించవచ్చునని ఆయనకు తెలుసును. కాని బాకీలు వసూలు చేసుకునే చాకచక్యం ఆయనకు లేదు. ధర్మయ్య దగ్గర ఆ విద్య నేర్చుకోవాలని ఉండేది ఆయనకు. కాని ధర్మయ్య తనకా రహస్యం చెబుతాడని ఆయనకు నమ్మకం లేదు. అది వ్యాపార రహస్యం గద!

కొంతకాలం పోయాక సుబ్బయ్యకు ఒక ఆలోచన వచ్చింది. ధర్మయ్య బాకీ వసూలు చేసుకునే పద్ధతి తెలుసుకోవాలంటే, తానే ఆయన దగ్గర బాకీ చెయ్యాలి! ఇంత చిన్న ఆలోచన తనకు ఇంతకాలమూ తట్టనందుకు సుబ్బయ్య ఎంతో విచారించి, ఆ రోజే ధర్మయ్య వద్దకు వెళ్ళి, వంద వరహాలు అప్పుగా అడిగాడు.

ధర్మయ్య ఆశ్చర్యపోతూ, "నేను మీకు అప్పివ్వడమా?" అన్నాడు.

"సమయానికి చేతిలో రొక్కం లేని సమయంలో అనుకోకుండా ఈ ఖర్చు నా నెత్తిమీదపడింది. మీరు తప్ప మరెవరూ ఈ సమయంలో ఆదుకునే వాళ్ళు లేరు.పై నెలలో మీ సొమ్ము మీకు తిరిగిఇచ్చేస్తాను" అన్నాడు సుబ్బయ్య.

ధర్మయ్య ఒక్క క్షణం ఆలోచించి, "సరే, అలాగే ఇస్తాను" అని లోపలికి వెళ్ళి, నూరువరహాల రొక్కంతోపాటు ఒక రాయికూడా తెచ్చి "ఒక్కసారి దీన్ని తాకండి" అన్నాడు. సుబ్బయ్య ఆశ్చర్యపోతూ "ఎందుకు?" అన్నాడు.

"ఊరికేనే! మరేం లేదు" అన్నాడు ధర్మయ్య నవ్వుతూ. సుబ్బయ్య ఆ రాయిని తాకి వంద వరహాలు తీసుకుంటూండగా "వడ్డీ నెలకు రెండు వరహాలవుతుంది" అని ధర్మయ్య అన్నాడు.

తనకు హెచ్చు వడ్డీ చెబుతున్న సంగతిసుబ్బయ్య గ్రహించాడు. ఐనా తన ఉద్దేశం ధర్మయ్య వ్యాపార రహస్యం తెలుసుకోవటంగనక ఆయన మాట్లాడకుండా ఆ డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

నెలలుగడిచినా వారిద్దరిమధ్యా ఆ డబ్బుప్రసక్తిరాలేదు. సుబ్బయ్య ఓపికగా అయిదునెలలు చూశాడు, ఇంక ఆగలేక తానే ధర్మయ్య దగ్గరికి స్వయంగా వెళ్ళి, "ఇంత కాలమైనా, మళ్ళీ నన్ను బాకీ గురించి అడగనే లేదు, మరిచిపోయారా?" అని అడిగాడు.

"నేనెందుకు మరిచిపోతాను? ఆలస్యమైనకొద్దీ నాకే లాభం కదా! మీరు తీసుకున్న డబ్బునుంచి



వడ్డీ ఎక్కువ వస్తుంది" అన్నాడు ధర్మయ్య.

"ఒకవేళ నేను బాకీ ఎగవేస్తేనో?" అన్నాడు.

"అలా చేయలేరు. డబ్బు తీసుకునేటప్పుడు నా దగ్గర ఉన్నరాయినిముట్టుకున్నారుగదా! అదిమహిమ గల రాయి. దాన్ని ముట్టుకున్న వాడెవడూ నాదగ్గర బాకీ ఎగవేయలేడు" అన్నాడు ధర్మయ్య.

ఆ రహస్యం తెలియగానే సుబ్బయ్య "అదా సంగతి!" అనుకుని క్షణంపాటు తీవ్రంగా ఆలోచించి "అయ్యా, ధర్మయ్యగారూ!కొన్నిబాకీలు వసూలుకాక నానా ఇబ్బందీపడుతున్నాను. దయవుంచి మీరాయిని కొంతకాలం నా దగ్గర ఉంచితే, నా బాకీలు వసూలు చేసుకుని మళ్ళా మీకు ఇచ్చేస్తాను"అన్నాడు.

"దానికేముందీ? నా దగ్గర రెండు రాళ్ళున్నాయి. ఒకటి మీకు అమ్ముతాను.ఒక ఏడాది పాటు మీ దగ్గర ఉంచుకోండి. పనిచెయ్యకపోతే మీకు డబ్బు తిరిగిఇచ్చేసి, నా రాయి నేను తీసుకుంటాను" అన్నాడు ధర్మయ్య.



సుబ్బయ్య పరమానందంతో, "రాయి ఖరీదెంత?" అని అడిగాడు. ఆ రాయి కొనటంవల్ల తనకేమీ నష్టంఉండదని తెలుస్తూనే ఉన్నదాయనకు.

"నూటపదివరహాలు" అన్నాడు ధర్మయ్య.

సుబ్బయ్య చప్పున ఇంటికి వెళ్ళి, ఒక సంచీతో తిరిగి వచ్చాడు. ఆయన ముఖం దీనంగా ఉన్నది. ఆయన ధర్మయ్యతో "ధర్మయ్యగారూ, ఇంట్లో రొక్కం అనుకున్నంత లేదు. నూటపది వరహాలు తెచ్చాను. ఇది తీసుకుని ప్రస్తుతానికి రాయి ఇప్పించండి. మీ బాకీతరువాత తీరుస్తాను" అన్నాడు.

"దానికేం లెండి? ఆలస్యమైనకొద్దీ వడ్డీకూడా పెరుగుతుంది గద!" అంటూ ధర్మయ్య డబ్బుతీసుకుని, సుబ్బయ్యకు ఆ రాయి ఇచ్చి పంపేశాడు.

రాయి తీసుకున్నాక సుబ్బయ్య ధైర్యంగా ఊళ్ళో చాలామందిని పిలిచి మరీ హెచ్చువడ్డీలకు అప్పులిచ్చాడు. పత్రమూ, సాక్ష్యమూ లేకుండా సుబ్బయ్య అందరికీ అప్పులిస్తూ ఉండటం చూసి చాలామంది, ఎంత హెచ్చు వడ్డీ అయినా లక్ష్యపెట్టకుండా అప్పుకోసంఎగబడ్డారు.రాయి తాకినవారందరికీ సుబ్బయ్య అప్పులిచ్చాడు.

నెలలు గడుస్తున్నాయి.సుబ్బయ్య దగ్గరడబ్బులు తీసుకునేవాళ్ళేగాని ఇచ్చేవాళ్ళు కనిపించలేదు. ఏడెనిమిది నెలలు చూసి, ఉండబట్టలేక సుబ్బయ్య, ధర్మయ్యను అడిగేశాడు. పూర్తిగా ఏడాది అయ్యేవరకూ చూడమన్నాడు ధర్మయ్య. ఏడాది గడిచిపోయింది.అప్పులిచ్చి సుబ్బయ్యచాలా డబ్బు పోగొట్టుకున్నాడు.ఒక్కడూడబ్బుసరిగా తిరిగిఇవ్వలేదు.

సుబ్బయ్య రాయిపుచ్చుకుని కోపంగా ధర్మయ్య వద్దకు వెళ్ళి, రాయిని ధర్మయ్య ముందు విసిరికొట్టి "అంతా పచ్చిమోసం! మీ మాటలు నమ్మి బోలెడు డబ్బు నష్టపోయాను" అన్నాడు.

"నా దగ్గర బాగానే పనిచేస్తోందే ఆ రాయి!" అన్నాడు ధర్మయ్య.

"నా మొహం పనిచేసింది! ఏడాది దాటిపోయింది. నా బాకీయే మీరింకా వసూలు చెయ్యలేదు. మీ రాళ్ళలో ఏ మహిమాలేదు" అన్నాడు సుబ్బయ్య.

"నా బాకీ వసూలు కాకపోవటమేమిటి? వడ్డీతో సహావసూలైంది. నేనా రాయిని మీకు ఊరికేనే ఇచ్చాను. మీరిచ్చిన డబ్బుబాకీకింద జమ వేసుకున్నాను" అన్నాడు ధర్మయ్య నవ్వుతూ.

# అనిల్

# This is me!



When I grow up, I want to be an **artist**





Hi! I'm **Joe.**
This is me on my box.





I love **reading**
Do you?

Mum says I should be a **monkey**





Sometimes, I'm a scaredy-cat.

I'm even scared of broccoli!





I like my rock collection, too.



Most of all, I like **pretending.**



# మనిషిలో మనిషి

"అందుకని...? బయటి ప్రపంచంలో కూడా ఇలాగే ఉంటావా?నువ్వు మారాలి కార్తి" అంది సంజన. "మారిపోయాగా..! గతంలో నేను అమ్మాయిలతో మాట్లాడేవాడినేకాదు.నాకు సంకోచం,బిడియం ఎక్కువ. కాని ఇప్పుడు నీతో ప్రయాణం చేస్తున్నాను. ఆశ్చర్యంకదూ!"అన్నాడు కార్తికేయ.

"ఇదీ ఒక ఆశ్చర్యమేనా?" "కాదా? నువ్వు నా వద్ద జాబ్‌లో చేరకముందు చాలా ఇబ్బందిపడేవాడ్ని. నువ్వు నా అసిస్టెంట్‌వి, సెక్రటరీవి, అడ్వయిజర్‌వి, ల్యాబ్ ఇన్‌ఛార్జివి, స్టాఫ్ పదిమందికీ మార్గదర్శకురాలివి.

నాకు వర్క్‌లోడ్ చాలా తగ్గించావు. అమోఘమైన నీ తెలివితేటల్ని చూసి అప్పుడప్పుడూ నేనే ఆశ్చర్యపోతూంటాను తెలుసా!"

"తెలీదులే" అంటూ నవ్వేసింది సంజన. "ఎందుకా నవ్వు?" ఉడుక్కున్నాడు. "అవును యు.కె.లో ఉండగా సైన్స్ జర్నల్స్‌లో తొలి సారిగా నీ ప్రయోగం గురించి, నీ గురించి తెలుసుకున్నాను.ఆ ప్రయోగాల్లో నేనూ భాగం పంచుకోవాలనిపించింది. ఇండియా వచ్చాక నిన్ను గుర్తించి, నీవద్ద జాబ్‌లో చేరడానికి ఎన్ని తంటాలుపడ్డానో తలుచుకుంటే నవ్వొస్తోంది" అంది సంజన.

"ఏం చేయను సంజూ!ఒక మంచి పనికి ప్రోత్సాహకాలతోబాటు శత్రుత్వాలూ ఉంటాయి. అందుకే ఇన్ని జాగ్రత్తలు. బయటి ప్రపంచంలో కార్తికేయ వేరు, నీ పక్కనున్న కార్తి వేరు"

"అంటే ఏమిటి? మనిద్దరం ఎప్పటికీ వేరు వేరేనా?" అంది సంజన.



"అంటే?" అన్నాడు కార్తి.

"ఇదే... ఈ అమాయకత్వం చూస్తేనే ఒళ్ళు మండుద్ది. ఏమీ తెలీనట్టు అడగకు. నా మనసు నీకు తెలుసు. నీ మనసు నాకు తెలుసు"

"తెలుసు కాని...!"

"చెప్పకు బాబూ. వినీ వినీ బోర్ కొడుతోంది. ఏం చెప్తావ్. ఎన్నిమార్లు చెప్తావ్. నీ జీవితం ల్యాబ్‌కే అంకితం. లవ్ చేసే తీరిక లేదంటావ్ అంతేగా? లోకాన్ని ఉద్ధరించటానికి... ఓ సంతోషం లేదు, సరదా లేదు, ఆనందం లేదు.

నాకు తెలీకడుగుతాను కార్తి... లోకంలో సైంటిస్టలు ఎవరూ పెళ్ళిళ్ళు చేసుకోడంలేదా,పిల్లల్ని కనడం లేదా? అంతా నీలాగే బ్రహ్మచారులుగా ఉండిపోతున్నారా?"కాస్త కోపంగానే దబాయించిందిసంజన.

"బ్రహ్మచారులూ ఉన్నారు" గొణిగాడు.

"ఉంటే... నువ్వూ ఉండిపోతావా? నేను ఉండనిస్తానా? అసలు ఇంత అందాన్ని పక్కనుంచుకొని యోగిలా ఎలా ఉండగలుగుతున్నావ్?"

# సూర్యదేవర రామ్మోహనరావు

"ఉండనులే... మీ మమ్మీ డాడీ యు.కె. నుంచి రానీ అప్పుడు మాట్లాడదాం"

"అంతవరకు లవ్ చేయవా? ఓరి దేవుడా... నీ మగసిరిని కొల్లగొట్టే సుదినం ఎప్పటికి!"

ఉన్నట్టుండి సంజనా వాగ్ధాటి ఆగిపోయింది.

కార్తికేయ కూడా ఏదో చెప్పబోతూ ఆగిపోయాడు. ఎందుకంటే - పొదల వెనక ఎటునుంచో ఒకబరిసె రాకెట్‌లా దూసుకొచ్చి బాటకి సరిగ్గా మధ్యలో జెండా కొయ్యలా నిలబడింది నాటుకొని. దాన్ని చూడగానే జీప్ సడెన్ బ్రేక్ వేశాడు కార్తికేయ.

బరిసెకు బారెడు దూరంలోకొచ్చి ఆగింది జీప్. ఇద్దరూ బరిసెను విచిత్రంగా చూస్తున్నారు.

"కార్తీ! గిరిజనుడెవడో లేడికోసం విసిరిన బరిసె అది. గురితప్పి బాట మీదకొచ్చింది. జీప్‌ని పోనీ" అంది సంజన.

"లేదు సంజూ...!" అన్నాడు పరిసరాలపై దృష్టి సారిస్తూ కార్తికేయ.

"నిజంగానే అది గిరిజనుడి బరిసె అయితే మన కొచ్చిన ప్రమాదం ఏమీలేదు. మనం వెళ్ళిపోవచ్చు. కాని ఇది శత్రువు విసిరిన సవాలయితేనే ప్రమాదం. మనం ముందుకెళ్ళినా వాళ్ళు వదలరు.ఏమవుతుందో కాస్సేపు ఆగిచూద్దాం" అన్నాడు స్థిరంగా కార్తికేయ.

ఇంతలో ఎక్కడినుంచో జీప్ ఇంజన్ శబ్దం విన్పించింది. కన్నుమూసి తెరిచేలోపు అది శరవేగంతో బాట మీదకు దూసుకొచ్చింది.

ఎరుపురంగు ఓపెన్ జీప్. అది బరిసెకు పాతిక అడుగుల దూరంలోకొచ్చి సడెన్ బ్రేక్‌తో ఆగింది. దాని వేగానికి లేచిన ఎరుపు ధూళి అరనిమిషంవరకు కంటిముందు ఏముందీ కనబడకుండా చేసింది.

జీప్‌లోంచి బిలబిలా కిందకు దూకారు ఆరుగురు ఆగంతకులు. వాళ్ళంతా ముఖాలు తెలీకుండా మాస్కులు ధరించారు. చేతుల్లో వేటకత్తులు, బరిసెలు ఆయుధాలు కలిగివున్నారు.

ఒకడి చేతిలోమాత్రం రివాల్వరుంది. బహుశా వాళ్ళందరికీ లీడర్ కావచ్చు.

"వీళ్ళు శత్రువులేనా?" వాళ్ళనేగమనిస్తున్నసంజనా కార్తికేయను అడిగింది.

"కాదనుకుంటాను. ముఖాలు తెలీకుండా మాస్కులు ధరించారంటే బహుశా బందిపోటు దొంగ లయివుంటారు. ఈమధ్య వీళ్ళసంచారం గురించి తరచుగా వింటున్నాం. నువ్వు జీప్ దిగకు. వాళ్ళతో నేను మాట్లాడి వస్తాను" అన్నాడు కార్తికేయ.

"మాట్లాడివస్తావా...!" తెల్లబోతూ అడిగింది సంజన.

"ఎస్! ఏ సమస్య అయినా ఎవరితోనైనా చర్చల ద్వారా పరిష్కరించుకోవచ్చు. ఒక్క పాకిస్తాన్‌తోతప్ప" అంటూ డోర్ తెరిచి దిగుతున్న కార్తికేయను చూస్తూ నుదురు కొట్టుకుంది సంజన.

'ఓ మైగాడ్! వాళ్ళేమన్నా నక్సలైట్లా చర్చలకు రావటానికి. బందిపోట్లు. దొరికింది దోచుకుపోతార్రా మగడా!' అనుకుంది మనసులో. జీప్ దిగిన కార్తికేయ పొడిగా దగ్గుతూ- నాలుగడుగులు ముందుకేసి బాటమీద దిగబడిన ఈటెను లాగి దాన్ని చేత్తో పట్టుకుంటూ వాళ్ళవంక చూశాడు. "మీలో ఈ బరిసె విసిరినవాడు ఎవడ్రా?" అనడిగాడు.



E-mail: Suryadevaranovelist@gmail.com

"నేనే అయితే ఏంటి?" గుంపులో ఒకడు ముందుకొచ్చి గద్దించాడు.

"గుడ్‌షాట్.... చాలా నేర్పుగా బరిసె విసిరావు. నిన్నభినందించాలి" అన్నాడు నవ్వుతూ కార్తికేయ.

అతడి మాటలకు విచిత్రంగా ముఖముఖాలు చూసుకున్నారు వాళ్ళంతా. ఈసారి వాళ్ళ లీడరు రివాల్వర్ గురిపెడుతూ మాట్లాడాడు-

"ఏరా... అభినందిస్తావా! నీ అభినందనలు ఎవడిక్కావాలి. విలువైన వస్తువులు కావాలి. డబ్బు కావాలి. మమ్మల్నిచూస్తే అర్థంగావటంలేదూ? మేమంతా బందిపోటుదొంగలం.

దయాదాక్షిణ్యాలంటే అస్సలు తెలీదు మాకు.

## జరిగిన కథ (2)

జ్యోతిషశాస్త్ర పండితుడు మున్నలూరి కృష్ణశాస్త్రిని, అతని మేనల్లుడు వేదాచారిని పర్లాకిమిడి సంస్థానాధిపతి అయిన రాజా విష్ణు చంద్ర గజపతి మహదేవ్ వారి బావమరిది సూర్యప్రకాశవర్మ సంస్థానంలోకి సాదరంగా ఆహ్వానిస్తాడు.

పాబ్లోఎస్‌కోబార్ కొలంబియాలో మాఫియా కింగ్.అక్కడి ఓ అడవిలో స్మగ్లర్స్‌మీదకూబింగ్ ఆపరేషన్ చేస్తాయి పోలీసు బృందాలు. పోలీసు వారిని స్మగ్లర్స్ తరిమికొట్టి చంపేస్తారు.

కార్తికేయ అనే సైంటిస్ట్ పంచభూతాలను శుద్ధిచేసి భూగోళాన్ని రక్షించే ప్రయత్నంలో వున్నాడని, అతనివల్ల మన వ్యాపార సామ్రాజ్యం దెబ్బతినే అవకాశముందని పాబ్లో ఎస్‌కోబార్ సమావేశమైన మిగతా డాన్స్‌కు చెబుతాడు.

కార్తికేయని మట్టుబెట్టమని ఆర్డరేస్తాడు సాధూభాయ్‌కి.

కార్తికేయ, సంజనా ఇద్దరూ అడవిబాట మీద ఓ జీపులో ప్రయాణిస్తుంటారు. ఆ తర్వాత జరిగేది చదవండి.

## ఎంతో నేర్చుకున్నాను

'తకిట తకిట', 'అబ్బాయి క్లాస్ అమ్మాయి మాస్', పిల్ల జమీందార్' వంటి సినిమాలు చేశాక బెంగళూరు మకాం మార్చేసి, కన్నడంలో మంచి ఇమేజ్ సాధించిన కన్నడ బ్యూటీ హరిప్రియ 'జై సింహా'లో బాలకృష్ణకు జోడీకట్టింది.

"ఎంతో పరిజ్ఞానం కలిగిన బాలకృష్ణగారితో నటించడం చాలా ఆనందంగా వుంది. దర్శకుడి వద్దనుంచి కూడా ఎంతో నేర్చుకున్నాను.

నా షూటింగ్ పూర్తవడంతో సినీబృందాన్ని మిస్సవుతున్నా" అంటున్న హరిప్రియ చేతిలో ఇప్పుడు అరడజనుకుపైగా సినిమాలున్నాయి. మరో నాలుగు అంగీకరించాల్సివుంది.



వెళ్ళిపో, నీ చేతివాచీ, మనీ పర్సు, బంగారం ఇంకా ఏమున్నాయో అన్నీ అక్కడపెట్టి నీ దారిన నడిచిపో. నీ జీప్‌తోసహా అన్నీ ఇక మా సొంతం" హెచ్చరించాడు. అప్పుడు కూడా కంగారు పడలేదు, భయం అంతకన్నా పడలేదు కార్తికేయ. ముఖంలో చిరునవ్వు అలాగే ఉంది.

"ఏరా! ఈ మధ్య పర్లాకిమిడి అడవుల్లో బందిపోట్ల సంచారం గురించి విన్నాను. అది మీరేనా? ఇలా చేయటం తప్పు కదూ" అన్నాడు.

"తప్పా...!" అంటూ గొల్లున నవ్వారు వాళ్ళు.

"ఇది మా వృత్తి. డబ్బుకోసం ఏంచేసినా తప్పు లేదు. కానీ... త్వరగా చెప్పింది చేసి నీ దారిన పో" హెచ్చరించాడు లీడరు.

"చేయకపోతే?"

"అన్యాయంగా చస్తావ్" ఈ రివాల్వర్‌లో పన్నెండు బుల్లెట్లూ గురితప్పితే... నేను తప్పించుకుంటే... అప్పుడేం చేస్తావ్?" అన్నాడు కార్తికేయ.

"ఛాన్సేలేదురా. తప్పించుకోలేవు. ఎందుకంటే బుల్లెట్లతో బాటుగా మావాళ్ళ మారణాయుధాలు కూడా రాకెట్ వేగంతో నీమీదికి దూసుకొస్తాయి" ఇంతలో పక్కనున్న వాడు కల్పించుకొంటూ -

"వీడితో మనకు మాటలేంటన్నా! చాలా సుకుమారంగా ఉన్నాడు. ఒక్క బుల్లెట్‌కే చస్తాడు. కాని..." అంటూ ఆగిపోయాడు వాడు.వాడి చూపులు జీప్‌మీదే ఉన్నాయి. "ఊ! కాని..." విసుక్కున్నాడు లీడరు.

"అటు చూడన్నా. జీపులో ఎవరో ఉన్నారు" వేలెత్తి చూపించాడు. అప్పుడు గమనించాడు లీడరు.

"అవున్రా. వీడి బలుపు లోనవున్నట్టుంది. అందుకే ఇంత ధీమా. పోరా... లోన ఎవరున్నా లాక్కురా. అప్పుడు యుద్ధంలేని విజయం మనదవుతుంది. పోయి లాక్కురా" అంటూ హుంకరించాడు. ఆ మాటలకి ఉలికి పడ్డాడు కార్తికేయ.

"మీ దుంపతెగ! అటు వెళ్ళకండిరా. లోన ఉన్నది అమ్మాయి కాదు, ఆడపులి. అనవసరంగా చస్తారు" అంటూ హెచ్చరించాడు.

గొల్లున నవ్వారు వాళ్ళంతా.

"అర్థమైందిగా... లోన వున్నది అమ్మాయట. తనే చెప్పాడు. ఆడపులితో సర్కస్ ఆడించటం మనకి కొత్తకాదు. పోరా... త్వరగా లాక్కురా" అంటూ ఆర్డర్ వేశాడు లీడరు.

బరిసె ఊపుకుంటూ పరుగున జీప్ వద్దకెళ్ళాడు అనుచరుడు. లోనకు చూస్తూనే నిర్ఘాంతపోయాడు. మెరుపుతీగలావున్న సంజన అందం వాడి కళ్ళకు షాకిచ్చి మతిపోగొట్టుకున్నాడు. వెంటనే లీడర్ వంక చూసి "అన్నా..." అనరిచాడు.

"ఏమైందిరా?" హుంకరించాడు లీడర్.

"ఇంకా ఏంకావాలన్నా! స్టన్నింగ్ బ్యూటీ అన్నా... ఇంత అందం దొరికితే ఇక మనకి డబ్బెందుకు, బంగారం ఎందుకు,రాజభోగాలెందుకు. ఈ అందాన్ని చూస్తూ బతికేయొచ్చన్నా! నువ్వే చూడు" అంటూ సంజనను బయటికి లాగేందుకు జీప్‌లోకి చేయి పోనిచ్చాడు. అంతే - ముఖంమీద పిడుగు పడినట్టు కెవ్వున అరిచాడు. వెంటనే చేయి విరిగి వెర్రికేకలు పెడుతూ వెనక్కు విరుచుకు పడ్డాడు. వెనకే వాడి బరిసె పుచ్చుకుని జీపులోంచి అమాంతంగా బయటకు దూకింది సంజన.

ఏం జరుగుతోందో అర్థమయ్యేలోపలే ఆమె చేతిలో బరిసె రాకెట్ వేగంలో దూసుకెళ్ళి దొంగల లీడర్ చేతిని తాకింది. వాడి రివాల్వర్ గాల్లోకి ఎగిరి వచ్చి కార్తికేయ చేతిలో పడింది. కన్నుమూసి తెరిచేలోపు జరిగిపోయిందంతా.

దొంగలు షాక్‌నుంచి తేరుకునేలోపలే సుడిగాలిలా విజృంభించింది. అరుపులు, ఆర్తనాదాలు, కేకలతో ఒక్కసారిగా చెలరేగింది గందరగోళం అక్కడ.

అవతలివాళ్ళకు ఊపిరితీసుకునే అవకాశం కూడా దొరకలేదు. ఆడపులి అంటే ఏమిటో అప్పటిగ్గాని అర్థంకాలేదు వాళ్ళకు. ఆమె వేగం వాళ్ళని చావుదెబ్బ తీసింది. మూడే మూడు నిమిషాలు -

బీరాలు పలికిన బందిపోట్లు ఆరుగురూ మట్టి కరిచారు. అయినా కోపం తీరలేదు. కార్తికేయవైపు దూసుకెళ్ళి "ఏంటి కార్తీ! తమాషా చూస్తున్నావా? వాళ్ళు నన్ను చండాలంగా కామెంట్ చేశారు. వినలేదా? కోపం రాలేదా? నువ్వు తలుచుకుంటే వీళ్ళని బతకనిస్తావా?" అరిచింది.

"సంజూ ప్లీజ్ కూల్‌డౌన్. నువ్వు ఫైర్ బ్రాండ్‌వని వాళ్ళకి తెలీదు పాపం. అయినా కోపం రావటానికి వాడి కామెంట్ అబద్ధమైతే గదా. ఎస్! నువ్వు గొప్ప అందగత్తెవే... కరెక్టే గదా" అన్నాడు కార్తికేయ.

"ఆహా! సంతోషించాలే. రివాల్వరివ్వు.... కాల్చిపారేస్తాను వెధవల్ని" అంటూ మీద పడి కార్తి చేతిలోంచి రివాల్వర్ లాక్కుంది.

"వామ్మో! శాంతించు సంజూ. మనం క్రిమినల్స్ కాదు. పోలీసులకు ఫోన్ చేస్తాను. వాళ్ళే చూసుకుంటారు" వారించాడు కార్తికేయ.

"మనం బొబ్బిలి వెళ్ళి రాత్రికి పర్లాకిమిడి తిరిగి రావాలి మర్చిపోయావా? ఈ వెధవల కోసం పోలీస్ స్టేషన్‌కి, కోర్టుకి మనం తిరగాలా! కాల్చిపారేసి మన దారిన పోదాం" అంటూ రివాల్వర్‌ని దొంగలవైపు తిప్పింది సంజన. అంతే -

గాయాల బాధను కూడా మర్చిపోయి ప్రాణ భయంతో ఆమె ముందు సాగిలబడిపోయారంతా.

"వద్దు తల్లో! మమ్మల్ని చంపొద్దు. శాంతించి ప్రాణభిక్ష పెట్టు. వదిలితే జీవితంలో మా ముఖం మీకు చూపించం" అనరిచారు.

"వదలాలా... నెవ్వర్! మీరు చావాల్సిందే" అంటూ రివాల్వర్‌ని గాల్లోకి పేల్చింది సంజనా. గొల్లుమన్నారు బందిపోటు దొంగలంతా. కార్తికేయ కల్పించుకుంటూ సంజనను వారించాడు.

"పర్లాకిమిడి అడవుల్లో మీరు కనబడకూడదు. ఇంకోసారి మీ గురించి వింటే వెదికి వెదికి మరీ మీ అందర్నీ చంపేస్తాను. పోండి..." అంటూ హెచ్చరించి వదిలేశాడు.

వదిలిందే చాలని ఒకరికొకరు సాయం చేసుకుంటూ బందిపోట్లు అంతా జీప్ ఎక్కేశారు. కళ్ళు మూసి తెరిచేలోపు అక్కడ్నుంచి వెళ్ళిపోయిందా జీప్.



**పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్ పాకిస్తాన్‌దే... ఎన్ని యుద్ధాలు జరిగినా అందులో మార్పువుండదు.**
-ఫరూక్ అబ్దుల్లా, కాశ్మీర్ మాజీ సి.ఎమ్.

"ఇక పోదాం పద" అంటూ జీప్ స్టార్ట్ చేశాడు కార్తికేయ. సంజనకు కోపం తగ్గలేదు. రుసరుస లాడుతూనే వచ్చి అతడి సరసన కూచుంది.

తిరిగి పరుగు ఆరంభించింది జీప్. చాలాసేపు ఇరువురి మధ్యన మౌనం రాజ్యమేలింది.

"సంజా! ఇంకా కోపమేనా? మాట్లాడవా? ప్లీజ్" మౌనాన్ని భగ్నం చేస్తూ అర్థించాడు కార్తికేయ.

"ఏం మాట్లాడను? నాకొస్తున్న కోపానికి ఏం చేయాలో తెలీటంలేదు. నా కోసం నువ్వు ఏమీ చేయవా? నువ్వు వాళ్ళతో ఫైట్ చేసుంటే సంతోషించే దాన్ని. కాని నువ్వేం చేశావ్?

స్టయిల్‌గా నిలబడి నాతో ఫైట్ చేయించావ్. పైగా వాళ్ళ చెత్త కామెంట్లు వేరే. నా అందాన్ని నువ్వు పొగిడితే అందం, ఆనందం. వేరెవరన్నా పొగిడితే చంపేయాలనిపిస్తుంది. ఒకవేళ నేను వాళ్ళ చేతుల్లో చస్తున్నా అలాగే చూస్తూంటావా?" నిలదీసింది.

ఆమె చాలా హర్టయిందని - కార్తికేయ గ్రహించాడు.జీప్‌ఆపి సంజనను దగ్గరకు తీసుకున్నాడు.

"ఏయ్! నువ్వు నా ప్రాణమని నీకు తెలీదా? ఆ పరిస్థితేవస్తే చూస్తుంటానా? నా ప్రాణమిచ్చయినా నిన్ను కాపాడు కోనా?" అన్నాడు ప్రేమగా. కొద్ది సేపు అతడికళ్ళలోకి చూస్తూండిపోయింది సంజన. అతడి ఛాతీని చుట్టుకుపోతూ వలపుమీరా అధరాలు ముద్దాడింది.



**ప్రార్థనలు జరుగుతున్నప్పుడు ప్రార్థనమీద దృష్టిపెట్టకుండా బిషప్‌లు కూడా సెల్‌ఫోన్‌తో ఫోటోలు తీస్తుండటం బాధాకరం.**

*-పోప్ ఫ్రాన్సిస్, క్రైస్తవ మత గురువు*

"కార్తీ! నిన్ను నమ్మొచ్చా?" అంది.

"నమ్మకం లేదా?" కళ్ళలోకిచూస్తూ అడిగాడు.

"సక్సెసయిన ప్రతి మగాడి వెనకా ఒక ఆడది వుంటుందంటారు. ఎస్... నా వెనక నువ్వున్నావన్న నమ్మకమే నన్నిలానడిపిస్తోంది సంజా. నువ్వు నా జీవితంలో అడుగుపెట్టాకే మొదటి విజయం లభించింది. భూమిని ప్రక్షాళనం చేసే ప్రయోగం విజయవంతమైంది.

తర్వాత నీటిని ప్రక్షాళనం చేసే ప్రయోగమూ సక్సెసయింది. త్వరలోనే గాలిని శుద్ధిచేసే ప్రయోగం కూడా సక్సెస్ అవుతుంది. దాంతో నా లక్ష్యం నెర వేరుతుంది. నా విజయపరంపరల వెనక నువ్వే వుంటావు. ఇంకేం కావాలి!

లక్ష్యం నెరవేరగానే యు.కె. నుంచి నీ తల్లిదండ్రుల్ని పిలిపించి మాట్లాడతాను. మనం పెళ్ళి చేసుకుందాం. ఓకేనా?" లాలనగా కార్తికేయ వివరిస్తుంటే సంజన పులకించిపోతూ మరింతగా అతడి కౌగిట ఒదిగిపోయింది. తిరిగి వారి ప్రయాణం ముందుకు సాగింది. క్రమంగా వ్యాన్ అడవి దాటి కొంతసేపటికి పర్లాకిమిడి వీధుల్లోకి ప్రవేశించింది. బొబ్బిలి వరకు వెళ్ళి రావాలి గాబట్టి ఎక్కడా ఆగదలుచుకోలేదు. అయితే హైవేలోకి ప్రవేశించాక ఎగువనుంచి వస్తున్న కాన్వాయ్ ఒకటి కార్తికేయ కంటబడింది.

ముందు రెండు స్కార్పియో వ్యాన్లు,వెనక రెండు స్కార్పియోల మధ్య అత్యంత ఖరీదైన రోల్స్‌రాయిస్ కారు వస్తోంది. ఆ రోల్స్‌రాయిస్ వీధుల్లోకి ఎప్పుడొస్తుందో కార్తికేయకు తెలుసు. అందుకే ఉలిక్కిపడి సడెన్‌బ్రేక్‌తో వ్యాన్ ఆపేశాడు.

"కార్తీ! ఏమైంది?" అడిగింది సంజన.

"వన్ మినిట్ సంజా. మై గాడ్! రాజావారు వచ్చిన సంగతే తెలీదు నాకు" అంటూ వ్యాన్ దిగాడు.

"రాజావారు ఎవరు?" వెనక నుంచి అడిగింది సంజన.

"రాజా విష్ణుచంద్రగజపతి మహదేవ్‌వారు. పర్లాకిమిడి సంస్థానాధీశులు. నాకు గురువు, దైవం, మై బ్యాక్‌బోన్ అండ్ మై గాడ్‌ఫాదర్ అన్నీ వారే. జస్ట్ వెయిట్" అన్నాడు కార్తికేయ.

అప్పటికే కాన్వాయ్ వ్యాన్‌ని సమీపించింది.రెండు చేతులు జోడించి రోల్స్‌రాయిస్ కారు వంక చూస్తూ తలవంచి సవినయంగా నమస్కరించాడు కార్తికేయ.

కాస్తదూరం ముందు కెళ్ళి నిలిచింది కాన్వాయ్. స్కార్పియోల్లోవుంది రాజావారి అంగరక్షక బృందం.వెనక వ్యాన్‌లోంచి వ్యక్తి ఒకడు దిగి రోల్స్‌రాయిస్ వద్దకు పరుగెత్తాడు. లోపలున్న రాజా వారి నుంచి ఏదో సందేశం తీసుకుని వెనుతిరిగాడు.

కాన్వాయ్ ముందుకుసాగింది. ఆ వ్యక్తి రోడ్డుదాటి వేగంగా కార్తికేయ ముందుకొచ్చినమస్కరించాడు.

"సార్! రేపు ఉదయం పది గంటలకి తమను దేవిడీలోకొచ్చి కలవమని రాజావారి ఆజ్ఞ!" సందేశం విన్పించాడతను. "అవశ్యం. వారి దర్శనానికి రేపు వస్తానని చెప్పు. ఇంతకీ లండన్ నుంచి రాజావారు ఎప్పుడొచ్చారు?" అడిగాడు కార్తికేయ.

"నాలుగు రోజులయింది సార్. వస్తాను" అంటూ నమస్కరించి వెనుతిరిగాడతను.

ఇంతలో అటు వచ్చిన బైక్ ఒకటి అతడ్ని పికప్ చేసుకుంది. కార్తికేయ జీప్‌లోకొచ్చి స్టార్ట్ చేశాడు.

"ఏంటి కార్తీ! రాజావారు అంత కావలసినవారా! వారితో ఏం పని నీకు?" ఆశ్చర్యపోతూ అడిగింది.

"నీకు తెలీదు సంజా! నా చర్మం ఒలిచి చెప్పులు కుట్టించి ఇచ్చినా రాజావారి ఋణం తీర్చుకోలేను. అనాథనయిన నాకు ఇదంతా రాజావారు పెట్టిన భిక్ష" అన్నాడు కార్తికేయ.

"వద్దు కార్తీ! ఇంకెప్పుడూ అనాథననకు, నేను భరించలేను"అంటూ భుజంమీద తలాన్చుకుంది.



## బాధ్యతగా చేశా

'కుమారి 21 ఎఫ్' సినిమా తర్వాత మరోమారు ఏంజిల్ టైటిల్ రోల్ పోషించిన హెబ్బాపటేల్ భలే హ్యాపీగా ఉందంటున్నది.

"ఇంతకుముందు నా సినిమాలకంటే ఈ సినిమా చాలా ఆసక్తిగా అనిపించింది. భయంగానూ ఫీలయ్యా.చాలా బాధ్యతగా ఫీలవుతూ నటించా. ఏడాదిన్నరగా తీరికలేని షూటింగ్‌లతో బిజీగా వున్నాను. కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోవాలన్నది నా కోరిక. ముంబయిలో కొత్తగా కొనుక్కున్న ఇంట్లో తీరిగ్గా గడపాలన్నది నా కోరిక.

అందుకే కొద్దికాలం సినిమాలు అంగీకరించడం లేదు" అని తెలిపింది హెబ్బాపటేల్.

"ఎంత రాత్రయినా ల్యాబ్‌కి వెళ్ళిపోదామనుకున్నాను. ఇప్పుడు వీలుకాదు. రాత్రికి పర్లాకిమిడిలో స్టేచేసి ఉదయం రాజావారి దర్శనం చేశాకే వెళ్ళగలం" అంటూ జీప్ వేగం పెంచాడు.

శ్రీశ్రీశ్రీ రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. ఎత్తుగా, లావుగా మనిషి కూడా పేరుకు తగ్గట్టే గంభీరమైన రూపం. తరతరాల తమ రాజవంశ ఠీవి హుందాతనం రాజావారిలో ప్రతిబింబిస్తుంటాయి. తాకితే డాగుపడుతుందనిపించే పసిమి ఛాయవర్ణం మేని, తెలుపు నలుపు కలగలిగిన జుత్తు-

గుబురుమీసం, చూడగానే నమస్కరించాలనిపించే ముఖవర్చస్సు, ఎదుటివారిని చిటికెలో చదవటమే కాదు, శాసించగల చురుకైన చూపులు. వైట్ ప్యాంటు, షర్టులో చాలా సింపుల్‌గానూ, ప్రత్యేకంగానూ ఆకర్షించే పర్సనాలిటీ రాజావారిది.

ఒక్క గజపతి జిల్లాలోనే కాదు, సరిహద్దులోని ఆంధ్రాకి చెందిన శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో

## వెరీ 'లవ్లీ' గాళ్

'లవ్లీ'లో క్యూట్‌గా చిత్రసీమలోకి అడుగుపెట్టిన ఉత్తరాది భామ శాన్వి శ్రీవాత్సవ కన్నడంలోకి కదిలి పోయింది. తెలుగులో రాని రాణింపు కన్నడంలో దక్కింది. అయితే సామాజిక మాధ్యమంలో చురుగ్గా కనపడుతూ తెలుగు ప్రేక్షకులకు కను మరుగు అవకుండా జాగ్రత్తపడుతున్నది.

పండుగలు, ప్రత్యేక సందర్భాలు ఏవి వచ్చినా వీలున్నప్పుడల్లా తెలుగు ప్రేక్షకులకు హాయ్‌చెప్పానే వుంది. పెద్దగా ఎక్స్‌పోజింగ్ లేకుండా,వెరైటీగా, స్టయిలిష్‌గా వుండే హాటెస్ట్ దుస్తులతో వీలయి నంతగా ఆకర్షించే ప్రయత్నాలు చేస్తున్నది.

సంప్రదాయానికి స్టయిల్స్ అద్దేసి, ఆమె చేస్తున్న ప్రయత్నాలు, చూపుతున్న సోయగాలు వీక్షించిన వారంతా 'ఔరా' అంటున్నారు.



పాటు ఒరిస్సాలో అయిదారు జిల్లాల వరకు పర్లా కిమిడి సంస్థానం ప్రజలకోసం ఎంతో చేసింది.

అందుకే రాజావారి కాన్వాయ్ వస్తోందంటే తెలిసిన ప్రజలు దారిపొడవునా వంగివంగి నమస్కరిస్తుంటారు. అది రాజావారి మీద గౌరవమేగాని భయం ఎంతమాత్రం కాదు.

అటువంటి రాజావారి కాన్వాయ్ ప్యాలెస్‌కు చేరుకునేసరికి ఉదయం పదిగంటలు దాటింది సమయం. కారు దిగుతూనే దేవిడీలోని సమావేశ మందిరానికి చేరుకున్నారు రాజావారు. వారి రాకను ముందుగానే పరిచారకుడొకడు పెద్దగా అరుస్తూ హెచ్చరించటంతో వచ్చి వెయిట్ చేస్తున్నవాళ్ళంతా సగౌరవంగా లేచి నిలబడి వందనాలర్పించారు.

రాజావారు అందరినీ పరామర్శించి చర్చలు జరిపి సూచనలు, సలహాలు ఇచ్చి పంపించే సరికి సమయం ఒంటిగంట కావచ్చింది.

అప్పుడు ఒక సేవకుడు వీల్‌ఛైర్‌ను తోసుకొస్తుండగా అక్కడికొచ్చిన రాజావారి బావమరిది సూర్య ప్రకాశవర్మ రాజగురువు మున్నలూరు కృష్ణశాస్త్రిగారు ఉదయమే ప్యాలెస్‌కి చేరుకుని వెయిట్ చేస్తున్న విషయం చెప్పాడు. "మంచిది. సమయానికి గురు దేవులరాక ఆనందం కలిగించింది. వారిని భోంచేసి విశ్రాంతి గైకొమ్మని మా మాటగా చెప్పండి.

సాయంత్రం నాలుగు గంటలకు మా అంతరంగిక మందిరంలో ప్రత్యేక సమావేశానికి ఏర్పాటు చేయండి" అంటూ ఆర్డర్‌వేసి తన రాజమందిరం వైపు సాగిపోయారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్.

చెప్పినట్టుగానే సరిగ్గా నాలుగు గంటలకి రాజావారి ఆంతరంగిక మందిరంలో ప్రవేశించాడు రాజ గురువు మున్నలూరు శివన్నారాయణ కృష్ణశాస్త్రి. అప్పటికే అక్కడికి చేరిన రాజా విష్ణుచంద్ర గజపతిమహదేవ్ వారు ఎదురువచ్చి స్వాగతం పలుకుతూ ప్రణామం చేశారు.

"ఆయుష్మాన్‌భవ" అంటూ ఆశీర్వదించాడు కృష్ణశాస్త్రి.మందిరంలో నిశ్శబ్దంగా పనిచేస్తున్న ఎ.సి. గాలులు చల్లదనాలు కురిపిస్తున్నాయి. మందిరం ఖరీదైన ఫర్నిచర్‌తో అతిసుందరంగా ఉంది. గ్లాస్ డోర్ నుంచి బయట అందమైన ఉద్యానవనం దర్శన మిస్తోంది. పరస్పర పరామర్శలనంతరం ఇరువురూ సోఫాల్లో అభిముఖంగా ఆసీనులయ్యారు.

నిజానికి రాజగురువు మున్నలూరు కృష్ణశాస్త్రి వెంట ఆయన బావమరిది వేదాచారి కూడా వున్నాడు. కాని ఇది ఇరువురి ప్రత్యేక ఆంతరంగిక సమావేశం గావటంచేత వేదాచారికి ప్రవేశంలభించలేదు.బయట హాల్లోనే ఆగిపోయాడు.

ఆఖరికి రాజావారి బావమరిది సూర్యప్రకాశవర్మ కూడా బయటే వుండిపోయాడు.

రాజావారు, కృష్ణశాస్త్రికి మధ్యలో చిన్న టీపాయ్ వుంది. దానిమీద కొన్ని బుక్స్ వుంచబడ్డాయి.

వాటిలో ఒకటి రాజావారి కుమార్తె యువరాణి సౌందర్యానంద సహనాదేవి జాతక పుస్తకం ఒకటి.

"గురుదేవా! ఈసారి రెండు మాసాల వరకు మేం ఇక్కడే ఉంటాం.

రాగానే ఎస్టేట్ వ్యవహారాలు, అకౌంటెంట్లతో ఆడిటింగ్ పనులు ఇతరత్రా కారణాల వలన మీకు ఫోన్ చేయటం నాలుగు రోజులుఆలస్యమైంది" అన్నారు ప్రస్తావనకు నాందిగా రాజావారు.

"ఈసారికూడా చిరంజీవి యువరాణీ వారినివెంట తీసుకురాలేదా ప్రభూ?" అడిగాడు కృష్ణశాస్త్రి.

"లేదు. సర్వం మీకు తెలుసుగదా. నాడు జాతక చక్రం చూసి మీరు చెప్పిన ప్రకారం మా తనూజకు ఇరవై అయిదో ఏట నుండి ప్రాణగండముంది.

ఇప్పుడు సహనాదేవికి ఇరవై నాలుగు నిండబోతున్నాయి. దోష పరిహారార్థం మనం ఏదోటి చేయాలి. ఈ తూరి పర్లాకిమిడిలో వసంతోత్సవాలు ఘనంగా నిర్వహించబోతున్నాం.

మా ఇలవేలుపునకు కొలుపులు జరపాలి. సహనా దేవి పేరిట ఆమె క్షేమంకోరి శివాలయంలో ఆ దేవ దేవునికి విశేష పూజలు, హోమాలు చేయాలి.

ఇవన్నీ మీరే స్వయంగా దగ్గరుండి పర్యవేక్షించాలి. అలాగే ఇప్పుడు మరొక్కసారి మా ఏకైకపుత్రిక జాతకాన్ని పరీక్షించి పరిస్థితి చెప్పాలి"

"అవశ్యం ప్రభూ! కాని యువరాణీ వారి దర్శన భాగ్యం ఇంతవరకు కలుగలేదు. ఈసారైనా వెంట తీసుకురావలసింది. జాతకచక్రంతోబాటు వారి హస్త రేఖలు కూడా పరిశీలించి ఖచ్చితమైన ఫలితాలను తెలుసుకునేఅవకాశంవుండేది" అన్నాడు రాజగురువు మున్నలూరుశివన్నారాయణ కృష్ణశాస్త్రి.

భారంగా నిట్టూర్చాడు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. "మాకు మాత్రం తీసుకురావాలని లేదనుకుంటున్నారా గురూజీ. ఈ సంస్థానానికి, వేలకువేల కోట్ల ఆస్తులకు వారసురాలు. ఇవన్నీ చూసుకోవలసింది భవిష్యత్తులో తనే గదా! కాని అవకాశంలేదు.

కంటిముందు శత్రువుతోనయితే పోరాడి గెలవచ్చు. అజ్ఞాతశత్రువు వెన్నుపోటు నుండి తప్పించుకోలేం. కనిపించని ఆ శత్రువు ఎవరో తెలీదు.

ఎందుకు యువరాణీని చంపాలనుకుంటున్నాడో తెలీదు. అసలీ గండం ఏ రూపంలో యువరాణిని సమీపిస్తుందో తెలీదు. అందుకే వివాహం జరిపించే వరకు సహనాదేవి ఎవరో, ఎలా వుంటుందో ఎవరికీ తెలీకూడదని ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నాం.

ఆమె లండన్ నుంచి వచ్చేందుకు ఇంకా కొంత కాలం పడుతుంది. మీరు జాతకాన్ని పరిశీలించి ప్రస్తుత పరిస్థితిని చెప్పండి" అన్నాడు.

రాజావారి మాటలు సమంజసంగానే తోచాయి మున్నలూరు కృష్ణశాస్త్రికి. యువరాణి సౌందర్యానంద సహనాదేవి జాతకపుస్తకాన్ని అందుకున్నాడు. టీపాయ్ మీదివేగాక తన భుజంసంచి నుంచి మరికొన్నిజ్యోతిష గ్రంథాలను తీశాడు.యువరాణి జన్మ నక్షత్రంతో కూడిన జాతకచక్రాన్ని, లగ్నాది వీక్షణాల్ని అర్థగంటపైగా క్షుణ్ణంగా పరిశీలించాడు కృష్ణశాస్త్రి.

**ఇంకా ఉంది**



**సినిమా ఇండస్ట్రీ నిలబడాలంటే దానిలోని చెడ్డవారిగురించి బయటకు చెప్పకుండావుండటం చాలా అవసరం.**

-కరణ్ జోహార్, దర్శకుడు

పర్సనల్ ఎజెండా

# జాక్వెలిన్ ఫెర్నాండెజ్

గత మూడేళ్ళకాలంలో శ్రీలంక బ్యూటీ జాక్వెలిన్ ఫెర్నాండెజ్ బాలీవుడ్‌లో తనకంటూ ఓ స్థానాన్ని ఏర్పరచుకోగలిగింది. పదిహేనుకు పైబడి సినిమాల్లో నటించింది. మరెన్నో బ్రాండ్ ఎండార్స్‌మెంట్లు చేస్తున్నది. గత నాలుగు నెలలుగా తాను చేసే సినిమాల కోసం ఎడతెరపిలేకుండా ప్రయాణాలు చేస్తున్నది. ఆమె వ్యక్తిగత విషయాలు:

▸ ***గత రెండు నెలలుగా:*** చాలా హెక్టిక్‌గా ఉన్నాను. ఇంతకుముందెన్నడూ తెలియనివాటిని అభ్యసిస్తున్నాను.ఓ సినిమాకోసం పోల్‌డ్యాన్సింగ్ నేర్చుకున్నా

▸ **ఇన్ని ప్రయాణాలు చేస్తున్నప్పుడు :** రోజంతా తాజాగా ఉండడం సాధ్యపడదు. ఈ వయస్సులోనూ మొటిమలు వస్తున్నాయి. ఈ మధ్య జ్యూస్‌లతో మాస్టర్‌క్లెన్స్ చేశా. చర్మ సౌందర్యాన్ని కాపాడుకునేందుకు వ్యాయామాలూ చేస్తుంటా!

▸ **తొలిసారి నన్ను నేను స్క్రీన్‌పై చూసుకుని :** ఎంతో ఆనందించాను. అదే సమయంలో పనిచేయాల్సిన అవసరం ఉందనుకుని నవ్వుకున్నాను

▸ **పరిశ్రమలో ఎదుర్కొన్న సవాళ్ళు :** సినిమా బాక్సాఫీసువద్ద ఎలా వుంటుందోనన్న అనిశ్చితి వృత్తిపరంగా వుంటుంది. ప్రేక్షకుల స్పందనగురించి ఆత్రుతపడుతుంటా. వ్యక్తిగతంగా ఉన్న సవాల్ నాకున్న సమయాన్ని మేనేజ్ చేసుకోగలగాలి

▸ **నాకు నచ్చే విషయం:** నేను ఫ్యామిలీ ఓరియంటెడ్. నా కుటుంబసభ్యులు, స్నేహితులతో ఎక్కువ సమయాన్ని గడపడాన్ని ఇష్టపడుతుంటా. ఐతే ఇప్పుడు కెరీర్‌కోసం ఇంటికి దూరంగా వుండాల్సివస్తోంది

▸ ***ఓ నటిగా :*** ఎనిమిది సంవత్సరాల తర్వాతకూడా నేనింకా ఎంతో నేర్చుకోవాల్సింది వుందని, ఎన్నో నైపుణ్యాలు అలవరచుకోవాలని భావిస్తాను. నేనింకా అభ్యాసదశలోనే వున్నా

▸ **ముంబయిలో ఇల్లు ఏర్పరచుకోవడం :** చాలా ఎగ్జయిటింగ్‌గా వుంది. ముంబయిలో చోర్ బజార్‌కు ఫర్నీచర్ కొనుక్కోవడానికి బురఖాలో వెళ్ళాను

▸ **నా డెకార్ స్టైల్:** ఆధునిక, సంప్రదాయాల మేళవింపు నాకు ఇష్టం. ఏదైనా సరే అతిగా కాకుండా, కనీస మాత్రంగా వుండాలి.సోనమ్‌కపూర్ ఇల్లు నాకు బాగా నచ్చుతుంది

▸ **ప్రస్తుతం నేను :** సింగిల్. కెరీర్‌పైనే దృష్టంతా

▸ **నేను మెచ్చేవి:** చిన్నచిన్న గెట్‌టుగెదర్‌లు, పార్టీలు నాకు బాగా ఇష్టం



# పొడుగైన చేతివేళ్ళ కథ




మనిషి ఆలోచించటం మొదలుపెట్టినప్పటి నుంచి తనను తాను తెలుపుకోవటానికీ, చుట్టూ వున్న వ్యక్తులను పరిసరాలను అర్థంచేసుకోవటానికీ నిరంతర ప్రయత్నంచేస్తూనే ఉన్నాడు.

అటువంటి ప్రయత్నాలలో భాగంగా ఇటీవల మానవుల చేతివేళ్ళపై కొన్ని పరిశోధనలు జరిగాయి. చేతివేళ్ళ పొడుగునుబట్టి వ్యక్తిత్వాన్ని తెలుపవచ్చని ఆ పరిశోధనలు నిరూపించాయి.

ఒక్కసారి మీ కుడిచేతి వంకపరిశీలనగాచూడండి. ఏ వేలు పొడుగు ఎక్కువఉంది?

చూపుడువేలు పొడుగుగా ఉందా? ఉంగరంవేలు పొడుగుగా ఉందా? పై రెండువేళ్ళ పొడుగులో ఎంత తేడా వుందో గమనించండి. వేలికొలతను అరచేతి అంచున ఆ వేలు మొదలయ్యే స్థానంనుండి మొదలు పెట్టి ఆ వేలి కొసవరకు లెక్కిస్తాం.

వేళ్ళ పొడుగుల మధ్య ఉన్న తేడానుబట్టి ఒకవ్యక్తి ఆరోగ్యం, క్రీడలు ఆడేశక్తి, లేదా ఇతర ఏ లక్షణాల గురించి అయినాచెప్పొచ్చుఅంటే కొద్దికాలం ముందు వరకు శాస్త్రవేత్తలు చెత్తకింద కొట్టిపడేసేవారు. కానీ, ఇటీవల జరిగిన శాస్త్రీయ పరిశోధనలప్రకారం వేళ్ళ కొలతలు, వాటి కొలతల మధ్యఉన్న తేడాలను బట్టి వ్యక్తిలో ఉండే క్రీడానైపుణ్యాన్ని, ఆరోగ్యాన్ని, వ్యక్తిత్వ లక్షణాలను తెలుసుకోవచ్చని తేలింది.

గర్భంధరించిన ఆరవవారంలో వేలు చిన్నగాఏర్పడటం కనిపిస్తుంది. ఆ తర్వాత కొద్దిరోజులలోనేపాదాల వేళ్ళుకూడా ఏర్పడటం మొదలవుతుంది. వేళ్ళ పొడుగులు ఒకదానిని ఒకటి పోల్చిచూస్తే జీవితాంతం ఒకే నిష్పత్తిలో ఉంటాయి.

ఆ నిష్పత్తి గర్భం ధరించిన 3 నెలలలోపు నిర్ణయమైపోతుంది. ఇలా వేళ్ళ మధ్య ఉండే కొలతల నిష్పత్తులు, పురుష హార్మోను అయిన టెస్టోస్టిరాన్ నియంత్రణలో ఉంటాయి.

## భవిష్యత్తు అంచనా

సాధారణంగా స్త్రీలలో చూపుడువేలు, ఉంగరం వేలు ఒకే పొడుగు ఉంటాయి. పురుషులలో ఉంగరం వేలుకంటే చూపుడువేలు పొడవు తక్కువగా ఉంటుంది. పై రెండు వేళ్ళ పొడుగుల నిష్పత్తి, స్త్రీ పురుషుల తేడానుబట్టీ, వయస్సునుబట్టీ అస్సలు మారదు.జీవితమంతా ఒకేవిధంగా ఉంటుంది. కానీ, పై కారణాలవల్ల వాటి పొడుగులలో తేడారావచ్చు.

రెండువేళ్ళు సమానంగా ఉంటే వాటి నిష్పత్తి 1. ఉంగరంవేలు పొడుగుగా ఉంటే వాటి నిష్పత్తి ఒకటికంటే తక్కువ. చూపుడువేలు పొడుగుగా ఉంటే నిష్పత్తి ఒకటికంటే ఎక్కువ.

ఈ నిష్పత్తి 0.8 నుండి 1.1 మధ్య మారుతూ ఉంటుంది. స్త్రీలలో ఈ నిష్పత్తి సాధారణంగా ఒకటి ఉంటే, పురుషులలో ఈ నిష్పత్తి ఒకటికంటే తక్కువగా ఉంటుంది.గర్భంలో పిండంపెరుగుతున్నప్పుడు ఆ పిండం ఎక్కువ టెస్టోస్టిరాన్ హార్మోన్లను విడుదల చేస్తే ఉంగరంవేలు పొడుగుగా ఉంటుంది.

టెస్టోస్టిరాన్ పురుష హార్మోను. ఈ హార్మోను లింగనిర్ధారణకు పునరుత్పత్తి అవయవాల అభివృద్ధికి ఎంతో ముఖ్యం. ఈ హార్మోను యాండ్రోజన్స్ అని పిలువబడే జాతికి సంబందించినది. కొన్ని సందర్భాలలో వీటిని స్టెరాయిడ్స్ అని లేదా, ఎనబాలిక్ స్టెరాయిడ్స్ అని అంటుంటారు.

స్త్రీలలో కూడా టెస్టోస్టిరాన్ ఉత్పత్తి అవుతుంది. కానీ, పురుషులతో పోల్చుకుంటే అది చాలా తక్కువ స్థాయిలలో ఉంటుంది.

అమెరికాలోని నార్త్ డకోటా విశ్వవిద్యాలయంలో పనిచేసే ప్రొఫెసర్ డాక్టర్ గ్రాంట్ టామ్‌కిన్‌సన్ చేసిన పరిశోధనల ప్రకారం మగవారిలో నిష్పత్తి ఒకటి కంటే తక్కువ ఉన్నప్పుడు వారి వయస్సుతో నిమిత్తం లేకుండా చేతికి పట్టుకునే శక్తి ఎక్కువ ఉంటుంది. ఇక్కడ శరీర కొలతలతోకూడా సంబంధంలేదు.

వ్యాయామ క్రీడలు, ఆటలలో పాలుపంచుకునే వారికి కండరాల శక్తి ఎంతో ముఖ్యం.

పై పరిశోధనలద్వారా ఆటగాళ్ళ బలాబలాలను, వారి ప్రదర్శనా తీరును, వారి చేతివేళ్ళనుబట్టి భవిష్యత్తులో అంచనా కట్టవచ్చు. కండరాల బలం, మన ఆరోగ్యం ఏస్థాయిలోఉంటుందో చెప్తుంది. ఒకటికంటే చూపుడు వేలు, ఉంగరంవేలు నిష్పత్తి తక్కువయితే ఆరోగ్యం బావుంటుందని చెప్పవచ్చు.

డాక్టర్ పామ్‌కిన్‌సన్ ఆడవాళ్ళలో ఉంగరం వేలు

పొడుగుగా ఉంటే వారు మంచి బాస్కెట్‌బాల్ ఆట గాళ్ళు అవుతారని గమనించారు.

1950 నుంచి కూడా శాస్త్రవేత్తలు స్త్రీ, పురుషుల వేళ్ళ పొడుగుల మధ్య తేడాను గమనించారు. 1990 దశకంనుండి మాత్రమే అలా ఉండటానికి గల కారణాలను పరిశోధించటం మొదలయింది.

స్త్రీ, పురుషుల మధ్య ఉన్న తేడాలను, వ్యక్తిత్వ లక్షణాలకు, వేళ్ళ పొడుగుకు మధ్య ఉన్న సంబంధంపై పరిశోధించటం మొదలుపెట్టారు. ఈ విషయంపై లండన్ కింగ్స్ కాలేజీకి చెందిన డాక్టర్ గ్లెన్ విల్సన్ ఈ పొడుగుల మధ్యకు తేడాకు కారణం లింగ నిర్ధారణచేసిన హార్మోనని ప్రతిపాదన చేసారు.

1998లో డాక్టర్ జోన్ మేనిన్ దీనిపై ఒక పత్రాన్ని విడుదల చేసారు. 2011లో చాలా సంవత్సరాల పరిశోధన తర్వాత, టెస్టోస్టిరాన్ హార్మోన్ వేళ్ళ పొడుగుకు కారణమని తేల్చారు.

ఈ నిష్పత్తి తక్కువగా ఉన్నవారు ఎక్కువగా ఉన్నవారికంటే బాగా దూసుకుపోయే స్వభావం కలిగి ఉంటున్నారు. పురుషహార్మోను అయిన టెస్టోస్టిరాన్ పిండంగా ఉన్నప్పుడు ఎక్కువగా విడుదల అవ్వటమే దీనికి కారణం.



## వ్యక్తిత్వ విశ్లేషణ

ఇటీవల జరిగిన పరిశోధనలో ఈ నిష్పత్తి తక్కువున్న పురుషులు (ఉంగరంవేలు బాగా పొడుగుగా ఉన్నవారు) ఎక్కువ వున్న పురుషులకంటే స్త్రీలతో చక్కగా వ్యవహరిస్తున్నారని తేలింది. అంతేకాక డాక్టర్ డెబిమోస్కోవిజ్ చేసిన పరిశోధల ప్రకారం చూపుడువేలి పొడవు తక్కువవున్న మగవారు చెప్పింది శ్రద్ధగా వింటారు.

చిరునవ్వులు చిందిస్తారు. మనసారా నవ్వుతారు. సర్దుబాట్లకు సరే అంటారు. ఇతరులను మెచ్చుకుంటారు. చూపుడు వేలు, ఉంగరం వేలు నిష్పత్తి ఎక్కువవున్న మగవారు స్త్రీలతో సరిగా వ్యవహరించలేరు. తక్కువ నిష్పత్తి వున్నవారు స్త్రీలను ఆకట్టుకోవటానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తారు.

అంతేకాక వారు అందంకోసం చూపులకు ఆకట్టుకునే విధంగా ఉండే రూపంకోసం ఎక్కువ సమయం, డబ్బు ఖర్చుపెడతారు. స్త్రీలలో, ఒకటికంటే ఎక్కువ నిష్పత్తి ఉంటే వారు పురుషులను ఆకట్టుకోవటానికి, శరీర ఆకృతిని సరిగా మలుచుకుంటే, స్టైల్‌గా ఉండే దుస్తులు ధరిస్తారు. మేకప్‌లు వేసుకుంటారు.

అదే తక్కువ నిష్పత్తి ఉన్న స్త్రీలు పురుషులను ఆకట్టుకునే ప్రయతాలు పెద్దగా ఏమీ చేయరు. ఇంకో పరిశోధన ప్రకారం మగవారిలో నిష్పత్తి ఎక్కువగాఉంటే ప్రొస్టేట్ క్యాన్సర్‌వచ్చే అవకాశాలు తక్కువని తేలింది. ఇదే విధంగా, వేళ్ళ పొడుగునుబట్టి మగవారిలో స్కిజోఫ్రేనియా వచ్చే అవకాశాలను కూడా పరిశీలించటం జరిగింది.

మన భారతదేశంలోవున్న అనేక జాతుల, వ్యక్తులపై, పై పరిశోధనా ఫలితాలను అన్వయించి చూస్తే ఈ ఉపకరణాన్ని రోగనిర్ధారణకు వ్యక్తిత్వ విశ్లేషణకు, క్రీడాసామర్థ్యాన్ని అంచనావేయటానికి ప్రాథమిక పనిముట్టుగా ఎంతవరకు వాడుకోవచ్చో మరింత స్పష్టత లభిస్తుంది.

పాలపర్తి శ్రీకాంత్

## సుబ్రహ్మణ్య షష్ఠి

**(తేది : 24.11.2017)**

బ్రహ్మణ్యుడు అంటే ఏ విధమైన అనాచారమూ లేకుండా అతిపవిత్రంగా ఉండేవాడు అని అర్థం.

సుబ్రహ్మణ్యుడంటే అలా పాటించే ఆచార విధానాన్ని ఎవరో చెప్పగా, ఎవరినో చూడగా నేర్చుకున్నదికాక శాస్త్రాలని స్వయంగా చదివి ఆచరించుతూ, అందరి మెప్పునీ, ఆచారాన్ని పాటించడంలో పొందినవాడు అని అర్థం.

అంతేకాదు, అనాచారపరులు పొరపాటునగాని తనని తాకినా వారి అనాచారం తనని అపవిత్రం చేయలేనంత ఆచారపరుడని అర్థం. 'షష్ఠి' అంటే షష్ఠీ తిథినాడు పుట్టినవాడు అనీ, ఆరు ముఖాలు కల్గినవాడనీ దీని అర్థం. ❐

## మోక్షదా ఏకాదశి

**(తేది : 30.11.2017)**

మోక్ష-మోక్షాన్ని, దా-ఇచ్చే లక్షణమున్న ఏకాదశి - అమావాస్య వెళ్ళిన 11వ రోజు అని అర్థం. దీన్ని విన్నవెంటనే ఈ ఒక్కరోజునా ఉపవాసం ఉండి ఆ మరురోజైన ద్వాదశినాడు శ్రీహరికి పూజచేసి, పారణాన్ని (పవిత్రంగా ఉండే భోజనం) చేస్తే మోక్షం వచ్చేస్తుందన్న మాట అని భావించకూడదు.

ఈ రోజున నిష్ఠతో ఉన్నట్లయితే- భార్య, పుత్రులు, ఆదాయం, జీవిత గమనం...- అనే ఈ తీరు చక్రంలో తిరుగుతున్న సంసారంనుండి 'మోక్ష= విడివడుదాం, భగవంతునిమీదే దృష్టిని సారిద్దాం' అనే ఆలోచన కల్గుతుందని దీని భావంతప్ప ఈ రోజునే మోక్షం వచ్చేస్తుందని కాదు. అలా ప్రతి సంవత్సరం చేస్తూంటే క్రమంగా దృష్టిలో మార్పువస్తుందని కూడా భావం. ❐

## భగవత్సందేశం

అందరితో ప్రేమగా ఉండు (లౌ ఎవర్) ఎవరినీ నొప్పించకు (హర్ట్‌నెవర్). ఇదెంతటి గొప్ప జీవనసాఫల్య సూక్తి!

తల్లిదండ్రులకి పాదాభివందనం చేయడం ప్రతి వ్యక్తి కర్తవ్యమూ. వర్షపు చినుకు ఆకాశంనుండీ, ధాన్యపుగింజ భూమినుండీ, పుష్పమనేది కొమ్మనుండీ వచ్చినట్టుగా మనం ఆ తల్లిదండ్రుల నుండి వచ్చి ఫలానివారి సంతానం అనే ఓ ఉనికినీ, గుర్తింపునీ పొందాం! తప్పక వారిని గౌరవించాలి.

మాధవునికి సేవని ఏదో ఓ కోరిక తీరాలనే ఉద్దేశ్యంతో ఎవరైనా చేస్తారు. అలాగని అది తక్కువ కాదు. అయితే మాధవునికే సేవ చేస్తున్నామనే భావనతో కష్టంలో ఉన్న మానవునికి సేవ చేయడం అనేది మరేదో కాదు- భగవంతుడు మెచ్చే పని అది!

శ్రీహరి రక్షిస్తున్నాడు అంటే దానికి అర్థం- మానవులయిన మనని సేవిస్తూ ఆయన ఆ రక్షించడాన్ని తనని తాను రక్షించుకోడంతో సమానంగా (మాధవ సేవ) భావిస్తున్నాడన్నమాట!

మరి ఈ ప్రేమ-తల్లిదండ్రుల్ని గౌరవించడం మానవసేవా ధర్మం అన్నీ ఎలా వస్తాయి? అనుకోనక్కరలేదు.

ఇలాటి సత్సంగాలకి వచ్చి చూస్తూ ఉంటేచాలు- మీరే దీనికి అలవాటుపడిపోతారు. మౌనం ద్వారా భగవత్సందేశం అందుతుంది. చేష్టల ద్వారా భగవంతుని అనుగ్రహం సిద్ధిస్తుంది.

- శ్రీ సత్యసాయిబాబా



# సత్యాన్వేషణ

## శ్రీ సుబ్రహ్మణ్య స్తుతి

**హే స్వామినాథ కరుణాకర దీనబంధో**
**శ్రీ పార్వతీశ ముఖపంకజ పద్మబంధో**
**శ్రీశాది దేవగణ పూజిత పాదపద్మ**
**వల్లీసనాథ మమ దేహి కరావలంబమ్**

ఓ స్వామీ! కరుణాకరా, దీనబంధూ, పార్వతీశ్వరుని ముఖపద్మాన్ని వికసింపజేసే సూర్యభగవానుడవు నీవు. దేవగణాలచేత పూజింపబడే పాదపద్మాలు కలిగిన ఓ వల్లీపతీ, సుబ్రహ్మణ్యా, నాకు చేయూతనివ్వు. నన్ను రక్షించు. నా బాధలను, కష్టాలను తొలగించు స్వామీ. ❐

## గీతా జయంతి

**(తేది : 30.11.2017)**

మనగురించి ఎవరైనా చెప్తే కొంత ఎక్కువ ఉండచ్చు- కొంత తక్కువ కావచ్చు లేదా చెప్పిన దాంట్లో కొంత లోపం ఉండచ్చు. అదే మరి మన గురించి మనమే చెప్పుకున్నట్లైతేనో- ఉన్నది ఉన్నట్టుగానే చెప్పుకుంటాం.

భగవంతుడి గురించి పదిమందీ పదివిధాలుగా వర్ణిస్తూంటే భగవంతుడే తనకితాను తనగురించిన అపోహలని తొలగించుకునేందుకూ, తన స్పష్టమయిన రూపాన్నీ, గుణాలనీ గురించిన అవగాహనని కలిగించాలనీ తనకి తాను ఓ వంకని కల్పించుకుని యుద్ధరంగంలో భగవద్గీతని చెప్పాడు.

చెప్పినప్పుడు దాని పేరు 'భగవద్గీత' కాదు. అంతా విన్న పిమ్మట వ్యాసాది ఋషులందరూ పెట్టిన పేరది. ❐

## దర్శనజ్ఞానం

లక్ష్మి అనగానే అంతమాత్రం తెలియదా? ధనం అనేస్తారు అందరూ.

'లక్షదర్శనాంకనయోః' అనే ధాతువు మీద ఏర్పడిన పదం లక్ష్మి అనేది. లక్ష్మి అంటే దర్శనమూ తద్ద్వారా అంకనమూ కలిగించేది అని భావం. దర్శనమంటే 'చూడగలిగిన జ్ఞానం' అని అర్థం.

అంకనమంటే ఎదురుగా కన్పించడమని భావం. రెంటినీ కలిపితే దేన్నయితే మనం సాధించదలుచుకుని ఉన్నామో దాన్ని సాధించేందుకుగాను కావలసిన జ్ఞానాన్ని కలిగించేదని అర్థమన్నమాట. అందుచేతనే లక్ష్మి అంటే ధనం అనేది మాత్రమే అర్థంకాదని గ్రహించాలి.

అదే నిజమయ్యుంటే 'ధనలక్ష్మి' అనే మాటే ఉండదు కదా! మోక్షాన్ని సాధించగల దృష్టినిచ్చేది మోక్షలక్ష్మి. జయాన్ని సాధించగల దృష్టినిచ్చేది జయలక్ష్మి. ఇలా ఆలోచించుకోవాలి.

{సత్కార్యాలకు ధనాన్ని వినియోగించడంవల్ల ధనంపై వ్యామోహం నశిస్తుంది.}

# ఫర్ U

We are created for unique destinations- materialistically and spiritually



Courtesy : MOTHER AND BABY

## చేసితీరాలి

అన్ని పనులూ కానిచ్చేస్తూ, వ్యాయామాలకు మాత్రం తీరిక లేదని పదే పదే చెప్పుకునేవాళ్ళు అనేకమంది తరచూ తారసపడుతుంటారు.కాని బిజీ షెడ్యూల్‌లో చక్కగా ప్లాన్‌చేసుకుంటే వ్యాయామాలకు కావాల్సినంత సమయం చిక్కుతుంది.

ఎవరైనా తోడుంటే బద్ధకించకుండా వాకింగ్‌కు వెళ్ళొచ్చు. కాబట్టి, ఆ విధంగా ప్లాన్ చేసుకోవాలి. ఖాళీగా కూర్చుని టీ.వీ. చూడకుండా ఏవో ఒక వీలైన వ్యాయామాలు చేస్తూ, చూడొచ్చు.

ఎక్సర్‌బైస్కిల్ ఉంచుకుంటే కొద్దిగా సమయం చిక్కినప్పుడల్లా చేసుకోవడానికి చాలా అనువుగా వుంటుంది. కొంచెం కొంచెంగా మొదలుపెడితే వ్యాయామాలకు అలవాటుపడిపోతారు. తర్వాత మానేయాలన్న ఆలోచనే రాదు.

ఉదయం, సాయంత్రం వేళల్లో ఇంట్లో అయినా ఆఫీసులో అయినా లిఫ్టు వాడకుండా మెట్లు ఎక్కి దిగుతున్నట్లయితే గుండెకు చక్కగా రక్తసరఫరా జరుగుతుంది. ◆

## నిర్లక్ష్యం వద్దు

నిద్రకు, మోకాలినొప్పులకు సంబంధముంటుందా? అంటే ఉందనే అంటున్నారు పరిశోధకులు. నిద్ర చాలినంత పోకపోతే మోకాలినొప్పులు ఎక్కువైపోతాయని పరిశోధనల్లో నిర్ధారించారు.

ఎక్కువసేపు నిద్ర లేకుండా మెలుకువగా వుంటుంటే మోకాలిదగ్గర ఎక్కువ కణజాలం చేరుతుంది. నిద్రించే సమయంలో ఉత్పత్తి అయ్యే కొన్ని హార్మోన్లు వాటిని కరిగిస్తాయి.

నిద్రలేమివల్ల ఇటువంటి అవకాశం వుండదు. బరువులు ఎక్కువగా ఎత్తడంవలన, అలా బరువులు ఎత్తే సమయం ఎక్కువగా వుండడంవలన మోకాలినొప్పులు వచ్చే అవకాశం వుంటుంది. దీనిని నిర్లక్ష్యం చెయ్యకూడదు.

అధిక బరువు ఉన్నప్పుడు కూడా ప్రభావం మోకాలి జాయింట్లపై పడుతుంది.

ఇటువంటివాళ్ళు వ్యాయామాలు ఎక్కువగా చెయ్యడంవల్ల సమస్య ఎక్కువ కావచ్చు.

అధిక బరువు పడే వ్యాయామాలు కాకుండా యోగా, నడక, సైక్లింగ్ వంటివి ఎంపికచేసుకోవాలని నిపుణులు సిఫార్సు చేస్తున్నారు. ◆

## మందుల వేళలు

ఏదయినా అనారోగ్యం తలెత్తి వైద్యునివద్దకు వెళ్ళినప్పుడు రాసి ఇచ్చిన మందుల వాడకంలో ఒక్కోటి ఒక్కో సమయానికి వాడాలంటారు.

కొన్నింటిని ఆహారానికి ముందు, ఇంకొన్నింటిని ఆహారం తర్వాత సూచిస్తారు. ఇలా ఎందుకంటే మనం తీసుకునే మందులు శరీరంలో కలవడంలో ఆహారానిదే కీలకపాత్ర.

మందులు రక్తంలోకి ప్రవేశించి,కావాల్సిన ప్రదేశానికి చేరుకోవడానికి విభిన్న ప్రక్రియలు ఉంటాయి. కొన్నిరకాల మందులను తీసుకున్న తర్వాత అవి కడుపులో ఆమ్లాలను ఉత్పత్తిచేస్తాయి. దీనివల్ల కడుపులో మంట, నొప్పిరావడం, వాంతులవడంవంటి సమస్యలు వస్తాయి.

కాబట్టి ఇటువంటి మందులను భోజనం తరువాత తీసుకుంటే వాటి ప్రభావం తక్కువగా వుంటుంది. అవి ఆహారంతోపాటు జీర్ణమై రక్తంలో కలిసిపోతాయి. వెంటనే రక్తంలో కలిసిపోవాలనుకున్నప్పుడు, ఉదరంపై ప్రతికూల ప్రభావం ఉండదనుకున్నప్పుడు భోజనానికి ముందు వేసుకోమంటారు. అలాగే కొన్ని మందులను కాఫీ, టీలతో వేసుకోవద్దంటారు. ◆

## ప్రొటీన్ ఫుడ్

ఉదయాన్నే తినే బ్రేక్‌ఫాస్ట్‌లో అధిక ప్రొటీన్‌లు ఉండేవిధంగా జాగ్రత్తవహిస్తుంటే ఎక్కువసేపు కడుపు నిండినట్లుగా వుంటుంది. రోజంతా శక్తి లభిస్తుంది. 25 నుంచి 30 గ్రాముల ప్రొటీన్లు ఉండాలి.

గుడ్లకు ఓ గ్లాసు పాలు జత చేసినా, ఓట్స్ కలిపిన ఫేవరెట్ పండ్లు తిన్నా ఈ శక్తి లభిస్తుంది.

ఉదాహరణకు ఒక కప్పు పాలలో ఎనిమిది గ్రాముల ప్రొటీన్లు, తొమ్మిది ఇతర అత్యవసర పోషకాలు లభిస్తాయి. బాదంపప్పు, పిస్తా పప్పుల్లో ప్రొటీన్లు, ఆరోగ్యవంతమైన ఫ్యాట్స్, పీచు పదార్థాలు లభిస్తాయి. అలాగే గుడ్లలో లూటిన్, కోలైన్, కొన్ని 'బి' విటమిన్లు లభిస్తాయి. ◆

## ఎంత అయోడిన్ అవసరం

అయోడిన్ అన్న పదం చాలాసార్లు చెవినపడుతుంది కాని, దాని ఉపయోగం ఏమిటనేది చాలా మందికి తెలియకపోవచ్చు. సరైన థైరాయిడ్ పనితీరుకు శరీరానికి అయోడిన్ కావాలి.

దీని లోపం ఏర్పడితే గాయిటర్ లేదా హైపోథైరాయిడిజం సమస్య వస్తుంది. పెద్దవాళ్ళందరికీ రోజుకు 150 మైక్రోగ్రామ్స్ అయోడిన్ అవసరమవుతుంది. పావు టీస్పూన్ అయోడైజ్డ్ సాల్ట్‌లో సుమారుగా 95 మైక్రోగ్రామ్స్ లభిస్తుంది.

అయోడిన్ గురించి ఆలోచిస్తున్నా సముద్రం ఉప్పుకే ప్రాధాన్యం ఇవ్వడం మంచిది. ◆

## భలే జామపండు

అన్ని పండ్లకంటే చౌకగా లభించే జామపండ్లలో ప్రయోజనాలు అనేకం వుంటాయి. ముఖ్యంగా గుండె సంబంధిత వ్యాధులుగలవారు ప్రతిరోజూ భోజనంతోపాటు ఒక జామపండును క్రమంతప్పకుండా మూడునెలలపాటు తీసుకుంటే మంచి ఫలితం వుంటుంది. దీనివలన శరీరంలో రక్తసరఫరా సక్రమంగా వుంటుంది.

ఉదయం, రాత్రి భోజనంతర్వాత బాగాపండిన జామపండు తింటుంటే జీర్ణప్రక్రియ సాఫీగా వుంటుంది. మానసిక ఒత్తిడికూడా తగ్గుతుంది.

పచ్చిజామ తినడంవల్ల చాలినంత 'సి' విటమిన్ లభించి చిగుళ్ళు, దంతాలు గట్టిపడతాయి. విటమిన్ 'ఎ' కూడా సమృద్ధిగా లభిస్తుంది కాబట్టి కళ్ళకు ప్రయోజనకరంగా ఉంటుంది.

# సెక్స్ & సైకాలజీ

## Traditionally men initiate sex



**డా॥జి. సమరం**

ఆర్.కె. — రాజోలు

**వ్యాక్యూమ్ పంపువల్ల పురుషాంగం పరిమాణం పెంచడం కుదురుతుందా?**

వ్యాక్యూమ్ పంపువల్ల పురుషాంగ పరిమాణాన్ని పెంచడం కుదరదు.

జె.వి.ఆర్. — కరీంనగర్

**స్త్రీకి సెక్స్‌లో సుఖం అనేది పురుషాంగం పరిమాణాన్నిబట్టి ఉంటుందా?**

పురుషాంగం పరిమాణాన్నిబట్టి స్త్రీకి సెక్స్‌లో సుఖం కలగడం, కలగకపోవడం అనేది ఉండదు. స్తంభించిన పురుషాంగం మూడున్నర అంగుళాలు ఉంటే చాలు, స్త్రీకి సెక్స్‌లో పరిపూర్ణమైన తృప్తి కలుగుతుంది. స్తంభించిన పురుషాంగం పెద్దదిగా ఉన్నంతమాత్రాన స్త్రీకి సెక్స్‌లో తృప్తి అదనంగా కలగడం ఉండదు.

ఎస్.ఎల్. — భీమిలి

**నా వయస్సు 28 సంవత్సరాలు. పెళ్ళి అయ్యి 13 సంవత్సరాలు అయింది. ఇద్దరు పిల్లలు ఉన్నారు. ఇంతవరకు సెక్స్‌లో చాలా చురుకుగా పాల్గొంటూ వచ్చాను. ఇటీవల కాలంలో నెలసరి వచ్చినప్పుడు రక్తస్రావం విపరీతంగా అవుతోంది.**

**నెలసరి వచ్చిన తర్వాత వారం పది రోజులు చాలా నీరసంగా అనిపిస్తోంది. సెక్స్‌లో కూడా పాల్గొనాలనిపించడంలేదు. నాకు ఏమైంది? నాలో చెడు రక్తం ఎక్కువ తయారవుతోందా? చెడు రక్తం అంతా పోయి మంచిరక్తం తయారవ్వాలంటే ఏంచేయాలి?**

మెన్సస్‌లో కారే రక్తం మంచి రక్తమే గాని, చెడు రక్తం కాదు. చెడు రక్తం అనేది ఉండనే ఉండదు. మెన్సస్ సమయంలో రక్తం ఎక్కువ పోతూఉంటే అలా పోవడం ఒక వ్యాధి. ఆ వ్యాధికి కారణం ఏమిటో పరీక్షించాలి. దాని ప్రకారం చికిత్స చేయాలి.

అంతేకాని చెడు రక్తం పోతోందని సంతోషించ కూడదు. రక్తం ఎక్కువ పోతే నీరసపడతారు. మీరు వెంటనే డాక్టరుకి చూపించుకుని చికిత్స పొందండి.

జె.కె. — హైదరాబాద్

**నాకు కొత్తగా పెళ్ళి అయింది. ఇంతవరకు అంగప్రవేశం జరగలేదు. పురుషాంగం అయితే స్ట్రాంగ్‌గా తయారవుతోంది. కాని సెక్స్ కుదరడం లేదు. మొదటిరాత్రిగాని, ఆ తర్వాత రాత్రుళ్ళు గాని సెక్స్ సక్సెస్ కాకపోవడానికి అమ్మాయిలో కన్నె పొర అడ్డంగా ఉండటమే కారణమా? తెలుపగలరు. ఇలా ఉన్నప్పుడు ఏం చేయాలి?**

కన్నెపొర దళసరిగా ఉండటమో, అడ్డంగా ఉండటమో సెక్స్ సక్సెస్ కాకపోవడానికి కారణం కాదు. ఎక్కడో కొన్ని సందర్భాల్లోనే కన్నెపొర యోని మార్గాన్ని బాగా మూసిఉంచడంతో అంగప్రవేశం జరగకపోవడం ఉంటుంది. రాత్రిళ్ళు సెక్స్ వైఫల్యానికి ప్రధానంగా అమ్మాయిలో సెక్స్ అంటే అంతర్లీనంగా భయం ఉండటం వల్ల అంగప్రవేశం జరగదు.

అటువంటి భయం ఉన్నట్లు అమ్మాయికి కూడా తెలియదు. మొదటిరాత్రి తగినంత ముద్దూ, ముచ్చట్లు, ఫోర్ ప్లేలు ఉన్నట్లయితే అమ్మాయిలో అంతగా భయం ఉండదు.

నేరుగా సెక్స్‌కి ప్రయత్నిస్తే ఏదో తెలియని భయం కలిగే అవకాశం ఉంది.

ముద్దూ, ముచ్చట కొంతసేపు జరిగిన తర్వాత వేజలైన్ గాని, లిగ్నోకైన్ జెల్లీగాని చూపుడు వేలిమీద తీసుకుని యోనిదగ్గర రాసి ఆపైన యోనిలోకి వేలు పోనిచ్చి యోనిద్వారాన్ని వెడల్పు చేస్తే అంగప్రవేశం సులువుగా జరుగుతుంది.

దీంతోపాటు అమ్మాయి కూడా స్తంభించిన పురుషాంగాన్ని చేతితో యోని ప్రవేశానికి సహకరించినట్లయితే అంతా సజావుగా జరిగిపోతుంది. కాని చాలామంది నూతన దంపతులు సిగ్గువల్ల, జంకు వల్ల చేయవలసిన రీతిలో చేయరు. దాంతో అంగ ప్రవేశం కుదరకుండా అవుతుంది.

ఇలా ప్రయత్నించినప్పటికీ సెక్స్ సక్సెస్ కాకపోతే మరుసటి రోజు దంపతులిద్దరూ డాక్టరుని సంప్రదించడం ఉత్తమమైన పద్ధతి.

జి.కె.ఆర్. — కర్నూలు

**మాకు పెళ్ళి అయ్యి రెండు సంవత్సరాలైంది. ఇంత వరకు నా భార్యకి సెక్స్‌లో సుఖం అంటే**

డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370
E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

Courtesy : THE MAN



ఏమిటో తెలియడం లేదు అంటుంది. ఈ రెండు సంవత్సరాల్లో ఏ ఐదారు సార్లో తనకి సెక్స్‌లో హాయి అనిపించిందని చెప్పింది.

*అసలు మా ఆవిడలో నాలాగా స్ఖలనం ఉన్నట్లా, లేనట్లా? ఒకవేళ ఉన్నట్లయితే ఇద్దరిలోనూ స్ఖలనం ఒకే సమయంలో అవ్వాలా? అలాకాకుండా ఒకరికి ఒకసారి, రెండవవారికి మరొక సారి స్ఖలనం అయిన ట్లయితే సుఖం అనిపించదా?*

సెక్స్‌లో దంపతులకి సుఖప్రాప్తి లభించాలంటే కాస్త ముందూ వెనుక సుఖప్రాప్తి కలగవచ్చు.

పురుషులలోలాగా స్త్రీలల్లో స్ఖలనం ఉండదు. కాని వాళ్ళల్లో సెక్స్ క్లైమాక్స్‌లో యోనిలో చెప్పలేనన్ని వైబ్రేషన్స్ కలుగుతాయి. ఆ వైబ్రేషన్స్‌తో కామ నాడులు స్పందించి చెప్పలేనంత మధురానుభూతిని అందిస్తాయి. దంపతులిద్దరూ శృంగారంలో పాల్గొన్నప్పుడు ఫోర్ ప్లేని తప్పక పాటించాలి.

ఫోర్ ప్లే ద్వారా ఇద్దరూ సమానంగా, రొమాంటిక్‌గా స్పందించడం ఉంటుంది. క్లైమాక్స్‌కి చేరడం ఉంటుంది. అలా జరిగినప్పుడు దాదాపు ఇద్దరూ కాస్త ముందూ వెనక భావప్రాప్తిని పొందడం ఉంటుంది. పురుషునికి వీర్యస్ఖలనంతో మధురమైన భావప్రాప్తి లభించగా స్త్రీలో కలిగే వైబ్రేషన్స్‌తో అంతులేనంత ఆనందప్రాప్తి కలుగుతుంది.

*ఎల్.డి.* *గుంటూరు*

*కొన్ని రోజుల క్రితం నేనొక వేశ్యను కలిశాను. సెక్స్‌ని బాగా ఎంజాయ్ చేశాను. కాని ఇప్పుడు నాకు ఎయిడ్స్ భయం పట్టుకుంది.*

*అనుక్షణం ఆ భయంతో వణికిపోతున్నాను. నిద్ర పట్టడంలేదు. అన్నం ఎక్కడంలేదు. నాకు ఎయిడ్స్ గాని, సుఖవ్యాధులు గాని సంక్రమించిందీ లేనిదీ తెలుసుకోవడం సాధ్యమేనా?*

*సుఖవ్యాధులు రక రకాలు ఉంటాయంటారు. సుఖవ్యాధులు అన్నింటికీ ఒకటే పరీక్ష ఉంటుందా? ఇక జన్మలో వేశ్య దగ్గరకు వెళ్ళను.*

*మీరే నన్ను రక్షించాలి.*

సాధారణంగా ఒక్కసారికే ఎయిడ్స్ వచ్చే అవకాశం చాలా తక్కువ. ఎయిడ్స్‌వ్యాధి వచ్చిందీ లేనిదీ మామూలు టెస్టుల్లో తెలుసుకోవాలంటే మూడు నెలలు ఆగాలి. అలాకాకుండా వేశ్యతో కలిసిన వారం పదిరోజుల్లోనే హెచ్.ఐ.వి. ఆర్.ఎన్.ఎ. పి.సి.ఆర్. టెస్ట్ ద్వారా చాలావరకు హెచ్.ఐ.వి సోకిందీ లేనిదీ తెలుసుకోవచ్చు.

సుఖవ్యాధులు అన్నింటికీ ఒకే పరీక్ష అంటూ ఉండదు. దేనికది వేరుపరీక్షల ద్వారానే తెలుసుకోవడం ఉంటుంది. సాధారణంగా సుఖవ్యాధులు సంక్రమించినట్లయితే వారం పదిరోజుల్లోనే వ్యాధి లక్షణాలు కలుగుతాయి.

పరీక్షల్లో వ్యాధి సోకిందీ, లేనిదీ తెలుస్తుంది. మీరు డాక్టరు దగ్గరకు వెళ్ళి చూపించుకోండి. కొన్ని పరీక్షలుచేస్తారు.దాంతో మీకు ఎయిడ్స్‌సోకిందీలేనిదీ, సుఖవ్యాధులుకలిగిందీ, లేనిదీ తేల్చి వేస్తారు.

# వారఫలం

**నవంబరు 23 నుండి 29, 2017 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం**

**అశ్వని, భరణి, కృత్తిక 1వ పా.** అంతా సజావుగా సాగుతుంది. ప్రయత్నికులకు మేలైన సమయం. పెద్దల ఆశీస్సులు, సహకారములు ఉంటాయి. బంధుమిత్రుల చాటు విమర్శలు కొన్ని ఉంటాయి. ఆరోగ్యం, ఆర్థికం హుషారుగా ఉంటాయి. సంతానమునకు ఊహించుకొన్న వివాహ యత్నములందు కదలికలు నిరుత్సాహంగా సాగగలవు. వృత్తి, ఉద్యోగాలందు తగిన గుర్తింపులు, లోన్స్‌వంటి అవకాశాలు ఏర్పడుట ఉంటాయి. శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**వృషభం**

**కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2పా.** ముందు ఊహల్ని అమలుచేయాలి. శ్రమ, బడలిక, వృత్తి, ఉద్యోగాలందు ఒత్తిడులుంటాయి. ఆర్థికంగా మంచి కదలికలు ఉంటాయి. భాగస్వామి ఆరోగ్యమందు స్వల్ప జాగ్రత్తలు అవసరం. వివాహ, ఉద్యోగ యత్నములందు ఇతరుల సహకారములుండేటట్లు చూసుకోండి. ఇతరులపై ఆధిపత్య ధోరణిచే ఇబ్బందులెదుర్కోవలసిరావచ్చును. ఖర్చులకు ప్రయారిటీ విధానాలు ఉపకరిస్తాయి. ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.



**మిథునం**

**మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా.** ఈ వారంలో అన్నిటా బాధ్యతాయుతంగా వ్యవహరించుకోగలరు. కొన్ని సమస్యల్ని అధిగమించగలుగుతారు. బంధుమిత్రులనుండి ఆహ్వానాలు పొందుతారు. వాయిదాల వ్యవహారాలకు స్వస్తి చెప్పగల్గుతారు. పనులతో బిజీగా ఉంటారు. వృత్తి, వ్యాపారములందు ఇతోధిక లాభములు పొందుతారు. పలుకుబడిగల వ్యక్తులతో పరిచయాలు ఉంటాయి. కుటుంబ వ్యక్తుల నుండి ఉత్సాహాలు పొందగలరు. భ్రాతృవర్గంతో తగుమాత్రంగా సాగండి. శుక్ర, శని వారములందు అన్నిటా జాగ్రత్తలు అవసరం.



**కర్కాటకం**

**పునర్వసు 4వపా, పుష్యమి, ఆశ్లేష.** వృత్తి, ఉద్యోగాలందు సమస్యల్ని మౌనంతో ఒక కొలిక్కి తేగలుగుతారు. ఆదాయ, వ్యయాలు సంతృప్తికరం. సహోద్యోగులతో వ్యవహారములందు సంయమనం అవసరం. అభిప్రాయ వ్యక్తీకరణలలో లౌక్యం అవసరము. చేపట్టినవి పూర్తిచేసుకోగలుగుతారు. ఏజెంట్లు, రిప్రజెంటేటివ్‌లు టార్గెట్ విధానాలు పాటించుకోవాలి. మానసికంగా ధైర్యంగా ఉండుటకు దుర్గారాధనలు చేసుకోండి. ఆది, సోమ వారములలో అన్నిటా జాగ్రత్తలు అవసరం.



**సింహం**

**మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా.** నిరుత్సాహములు ఏర్పరచుకొనక చిరునవ్వుతో వ్యవహరించుకోవాలి. అవకాశాలకై ఎదురు చూడవలసిరావచ్చును. మీ ప్రయత్నాలకు పట్టుదలలు అవసరం. ఊహించుకొన్నట్లుగా వ్యవహరించుకోలేకపోతారు. ప్రాధాన్యతను అనుసరించి చెల్లింపులకు జాగ్రత్తలు పాటించుకోండి. వ్యాపారాలు సాదాసీదాగా సాగుతాయి. అధికారులు, కుటుంబ పెద్దలువంటివారిచే సహకారాలు పొందుతారు. నిరుద్యోగులు, విద్యార్థులు ఏకాగ్రతలతో సాగాలి. ఈ రాశివారికి శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**కన్య**

**ఉత్తరఫల్గుని 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.** కుటుంబమున పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి. అన్ని విషయాలందు అప్రమత్తతలకు ప్రాధాన్యతనీయవలసివుంటుంది. నూతన పెట్టుబడులు,వ్యాపార విస్తరణలకు ఆలోచనలు అవసరం. ఆరోగ్యం ఒకింత అనుకూలంగా ఉంటుంది. గృహమార్పు యత్నములు అనుకూలిస్తాయి. అధికారుల ప్రాపకం సంపాదించగలరు. రాయితీలు వంటివి పొందగలరు. కోరికలను తగ్గించుకొని వ్యవహరించుకోవలసివుంటుంది. ముఖ్యమైన పనులు చేపట్టుటకు ఆది, సోమ, బుధ వారములు అనువైనవి.



**తుల**

**చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1, 2, 3 పా.** మానసికంగా ఉత్సాహంగా ఉంటారు. వేడుకలలో పాల్గొంటారు. రుణములు ఒక కొలిక్కి రాగలవు. ఇతరులను అతిగా నమ్మక వ్యవహరించుకోవాలి. చేయవలసిన పనులను సకాలంలో పూర్తిచేసుకోగలుగుతారు. మనోధైర్యములు ఉంటాయి. పరిచయం లేనివారితో వాగ్వాదాలకు దిగకండి. విద్యార్థులు ఒత్తిడి, ఆందోళనలకు ఎక్కువ గురికాగలరు. నూతన వ్యాపార వ్యవహారాలపట్ల ఆసక్తి ఏర్పడినా ప్రస్తుత వ్యాపారాలే శ్రేయోదాయకం. గురు, బుధ వారములందు ముఖ్యమైన పనులను చేపట్టుకోండి.



**వృశ్చికం**

**విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ.** కుటుంబ వ్యవహారాలను చక్కదిద్దుకోగలరు. రాబోయే ఖర్చులకు తగిన ఏర్పాట్లుచేసుకోగల్గుతారు. ప్రభుత్వ తరహా పనులను అనుకూలంగా పూర్తిచేసుకోగలుగుతారు. షార్ట్ జర్నీస్ చేయవలసిరావచ్చును. ఉద్యోగస్థులకు అదనపు బాధ్యతలు, అదనపు సౌకర్యాలు ఉంటాయి. నిరుద్యోగులకు చిన్నతరహా ఉద్యోగాలు ఏర్పడగలవు. సంతాన విషయాలందు శుభపరిణామాలుంటాయి. ఎవరికీ హామీలువంటివి ఇవ్వకండి. విలువైన వస్తువులు కొనుగోలు చేయగలరు. వీరికి శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.



**ధనుస్సు**

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా.** ఇంటా-బయటా అనుకూల స్థితులుంటాయి. ఆదాయ, వ్యయాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధుమిత్రుల రాకపోకలు ఇబ్బందికరంగా ఉంటాయి. నూతన పరిచయాలు, తద్‌రీత్యా ప్రయోజనాలు ఉంటాయి. సోదరవర్గంతో మైత్రీ భావములు పెరుగుతాయి. సంతానార్థులకు తీపి కబుర్లు వుంటాయి. చేపట్టుకొన్న పనులను పూర్తిచేసుకోగల్గుతారు. విద్యార్థులకు వ్యాసంగాలు అనుకూలంగా సాగుతాయి. గత సమస్యలకు కొన్ని పరిష్కారములు పొందగలరు. గురు, ఆది, సోమ వారములు అనుకూలం.



**మకరం**

**ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా.** మీ పనులను అనుకొన్నట్లుగా పూర్తిచేసుకోగల్గుతారు. ఆర్థికంగా ఉత్తమ ఫలితాలు ఉంటాయి. ఖర్చులు కొన్ని అదనంగా ఉంటాయి. పెట్టుబడుల విషయంలో పునరాలోచనలు అవసరం. ఆరోగ్యం విషయంలో కొద్దిపాటి మెలకువలు పాటించుకోండి. ఉత్సాహంగా నూతన బాధ్యతలను స్వీకరించగలుగుతారు. ఇతరులకు ఉపకరించగలుగుతారు. మీ మీ రంగాల్లో పురోభివృద్ధి ఉంటుంది. కుటుంబ వ్యక్తులకు బహుమతులు ఏర్పరచగలరు. వీరికి శుక్ర, శని, బుధ వారములు అనువైనవి.



**కుంభం**

**ధనిష్ఠ 3, 4 పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3 పా.** అష్టమ కుజునికై సుబ్రహ్మణ్యారాధనలు అన్నిటా మేలుచేస్తాయి. లాభదాయకంగా వ్యవహారాల్ని సలుపుతారు. సంకల్పములు నెరవేరతాయి. అనుకొన్న పనులను సకాలంలో పూర్తిచేసుకుంటారు. మెలకువలు అవసరం. గత తప్పిదాలను, సమస్యలను పరిష్కరించుకోవడంలో కృతకృత్యులవుతారు. విద్యార్థులకు,నిరుద్యోగులకు శుభకాలం. స్థిరాస్తుల వ్యవహారాలను కదపకుండుట ఉపకరించగలరు. గురు, ఆది, సోమ వారాలు అనువైనవి.



**మీనం**

**పూర్వాభాద్ర 4వపా, ఉత్తరాభాద్ర, రేవతి.** అన్నిటా అప్రమత్తతలు అవసరం. ఆర్థికావసరాలను గుర్తెరిగి సాగాలి. ప్రణాళికాయుతంగా సాగాలి. మానసికంగా ఉత్సాహాలుంటాయి.ఇతరుల సలహాలు యథాతథంగా స్వీకరించక ఆలోచనలతో వ్యవహరించాలి. ఉద్యోగులు అదనపు ఆదాయ అర్జనలకోసం యత్నించుకోకూడదు. మీ వ్యక్తిగత విషయాల్లో ఇతరుల ప్రమేయాలుండకుండా జాగ్రత్తలు అవసరం. వాగ్దానాల్లో జాగ్రత్తలు అవసరం.వారమంతా సామాన్యానుకూలతలతో సాగగలదు.

ఇది చదివినవారికి డబ్బు వశమవుతుంది



సురేష్ పద్మనాభన్
Cell : 81860 00039 www.themoneyworkshop.com

# ఐ లవ్ మనీ



మీ డబ్బు ఇతరులదగ్గర ఇరుక్కుని ఇబ్బందిపడకూడదనుకుంటే మీరు నిత్యజాగరూకులై, పట్టుదలతో వ్యవహరించేవారిగా ఉండాలి. కాబట్టి భవిష్యత్తులో మీ డబ్బును రక్షించుకునే మార్గాలను గమనించండి. మీకు తెలిసినవారు మీ దగ్గరకి అప్పు అడగటానికి వచ్చారనుకోండి.

మీరు వెనువెంటనే జాగరూకులై జాగృతమనే కళ్ళద్దాలు ధరించి, వచ్చిన వ్యక్తి డబ్బు అవసరం ఏమిటో అడగాలి. ఆ వ్యక్తి అప్పు అడగటం వెనక వున్న వాస్తవికతను ధృవీకరించుకున్నాక కూడా మీరు రెండురకాల పనులు చేయవచ్చు.

ఒకటి సరేనని డబ్బు ఇవ్వటం లేదా నేను ఇవ్వనని నేరుగా చెప్పటం. డబ్బు అడుగుతున్న వ్యక్తికి ఆ అప్పుని తిరిగి తీర్చగలిగిన సామర్థ్యం లేదని మీకు అనిపించినా, లేదా అప్పుచేయుటం వెనకున్న అంశం ఆర్థిక సూత్రాలకు అనువుగా లేనిదనిపించినా మొహమాటపడకుండా 'ఇవ్వను' అని గట్టిగా చెప్పండి

అయితే 'ఇవ్వను' అని చెప్పటానికి చాలామంది ఇబ్బందిపడతారు. ఇవ్వనని చెప్పటానికి నూటొక్క మార్గాలు ఉన్నాయి. అందులో మీకు నచ్చినదానిని ఉపయోగించండి. కొన్ని ఉదాహరణలు ఇస్తున్నాను చూడండి. "నా దగ్గర డబ్బుంది. కాని దానిని మరో ప్రత్యేక పనికోసం కేటాయించాను"

"ఇంతకుముందే మరొకరికి డబ్బు సర్దాను" వంటి కారణాలు చెప్పవచ్చు. ఇవ్వను అని చెప్పటం ఇబ్బందిగా, బాధాకరంగా ఉండవచ్చు. ఐతే డబ్బు అప్పుగా ఇచ్చాక ఇబ్బందిపడేకన్నా ముందుగానే జాగ్రత్తపడటం మంచిది. ఒకవేళ మీరు డబ్బును అప్పుగా ఇవ్వటానికి నిర్ణయించుకుంటే మీ డబ్బు భద్రతకోసం కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.అందులో మొదటిది అడగ్గానే అప్పు ఇవ్వక, ఒకటికి రెండుసార్లు తిప్పుకోవటం.



అప్పుకోసం వచ్చిన మొదటిసారి మీరు వేసిన తీవ్రమైన ప్రశ్నలు, వెంటనే డబ్బు ఇవ్వకపోవటం, ఒకటికి రెండుసార్లు తిప్పుకోవటంతో మీరు అప్పు ఇచ్చే బాపతుకాదని మీ దగ్గరికి వారు రాకపోవచ్చు. అయితే అప్పు అడిగిన వ్యక్తిని వెతుక్కుంటూ వెళ్ళి అప్పు ఇచ్చే అమాయకులుగా మారకూడదు.

మీరు రెండు మూడుసార్లు తిప్పినా అవతలి వ్యక్తి మీ దగ్గరకు అప్పుకోసం వస్తున్నాడనుకోండి. అప్పుడు మరోసారి జాగృతమనే కళ్ళద్దాలను ధరించండి.

డబ్బును అప్పుగా ఇవ్వటంద్వారా కాక మరేదైనా పద్ధతిలో వారిని ఆదుకోగలమా అనేది ఆలోచించండి. వారిని ఇబ్బందుల్లోనుండి బయటపడేసేందుకు మరెవరిదగ్గరికన్నా పంపటం లేదా వారికి సహాయపడే కొత్త ఆలోచన వారికి అందించటం చేయుండి.

'అడిగాడు... డబ్బు ఇచ్చి ఆదుకుందాం. అంతకన్నా మనం చేయుగలిగే సహాయంమాత్రం ఏముంటుంది' అన్నది సాధారణంగా అందరూ చేసే ఆలోచన. కాని ఆ ఆలోచన సరైనది కాదు.

మీరు చేసే సహాయం వారిని ఎక్కువ ఇబ్బందుల్లోకి నెట్టవచ్చు. డబ్బు సులభంగా అప్పు రూపంలో లభిస్తుండటంతో వారు ఇతరులమీద ఆధారపడే పరాన్నజీవిగా మారవచ్చు. ఇన్నిరకాల యత్నాలతరువాత కూడా ఇంకా అప్పు ఇవ్వాలనుకుంటే చిట్టచివరిగా తీసుకోవాల్సిన భద్రతా చర్య మరొకటుంది.

మీరు ఇచ్చే డబ్బును అతగాడు ఎప్పుడు, ఎలా వెనక్కితిరిగి ఇవ్వబోతున్నాడనేది అడగండి.అవతలి వారు చెప్పే సమాధానం వాస్తవమైనదేనని, కట్టుకథ కాదనీ ధృవీకరించుకోవాలి. చివరిగా అప్పుగా అడిగినంత ఇవ్వకండి.అందులో కొంతతగ్గించి ఇవ్వండి.

తక్కువ అంటే అవతలివారు అడిగినదానిలో సగం లేదా అంతకన్నా ఇంకా తక్కువ ఇవ్వండి. ఇది అందరూ అనుసరించదగిన సులభమైన మార్గం. ఎటువంటి సమయంలోనయినా ప్రయోగించవచ్చు. దీనివలన మీ డబ్బు ఎక్కడా ఇరుక్కుపోదు.

మీ డబ్బును మీరుమాత్రమే రక్షించుకోగలరు. మరెవరూ రక్షించలేరు అన్న నిజాన్ని ఎల్లప్పుడూ గుర్తుంచుకోండి.

(వచ్చేవారం వస్తా)

మిమ్మల్ని ఎవరైనా అప్పు అడిగితే ఇవ్వను అని చెప్పడం ఇబ్బందిగా వుండవచ్చు. అయితే డబ్బు అప్పుగా ఇచ్చినతర్వాత ఇబ్బందిపడేకన్నా ముందుగానే జాగ్రత్తపడటం మంచిది. ఒకవేళ మీరు డబ్బును అప్పుగా ఇవ్వటానికి నిర్ణయించుకుంటే మీ డబ్బు భద్రతకోసం కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

Let's love our occupation

# ఆ ఆలోచన అనవసరం

Courtesy : VANITHA

**నే**డున్న జీవనవిధానంలో, నిర్వహించే బాధ్యతల్లో ఒత్తిడినుండి తప్పించుకోవటం చాలా కష్టం. ఒత్తిడిలేని ఉద్యోగం అనుకోవటం అర్థంలేని విషయం. ప్రతిబాధ్యతలోనూ పనితీరు మరింత మెరుగుపరుచుకోవాలి,

ఫలితాలను మెరుగ్గా చూపించాలి. కాబట్టి మనం ఎదుర్కొంటున్న ఒత్తిడిని అంగీకరించి దానికి తగిన పరిష్కారాన్ని చూసుకోవాల్సిందే.

ఆఫీసుల్లో, సంసారజీవితంలో, ఆర్థికపరంగా ఒత్తిడికి అంతులేదు. ఇలా ఒత్తిడికి గురవగానే జీవన విధానం మారిపోతుంది.

ఇదివరలో వున్నట్టుగా పద్ధతి వుండదు. ఎన్నడూ చెయ్యని పిచ్చిపనులు చేస్తుంటారు. ఆలోచనల మీద అదుపుపోతుంది. ఆలోచనలను అదుపు చెయ్యలేరు. ఆదుర్దా, భయం పెరుగుతుంది.

ఆలోచనలు, భయం ఆదుర్దాలనుండి బయటపడేందుకు వారుచేసే పని ఆహారం విషయంలో గాడితప్పటం.ఒత్తిడికి స్పందనగా అతిగాతినటం లేదా అసలు తినకపోవటం జరుగుతుంది.

ఆహారంమీద నియంత్రణ కోల్పోతారు. ఒత్తిడికి గురవుతున్నవారు జంక్‌ఫుడ్‌ని ఇష్టంగా తినటం కనిపిస్తుంది. ఆ జంక్ పదార్థాలలో వాడే కృత్రిమ రసాయనాలు మెదడులోని తృప్తి కేంద్రాలమీద ప్రభావం చూపుతాయి. ఎంత తింటున్నా పరిమితి తెలియదు. అది క్రమంగా ఒక అలవాటుగా మారి అవసరానికి మించిన ఆహారం శరీరరూపాన్ని మారుస్తుంది.

## ఉద్యోగంలో ఒత్తిడి

**ఒ**త్తిడితో వచ్చే భయం, ఆదుర్దావల్ల నలుగురిలో కలవటం తగ్గుతుంది.

ఫలితంగా వ్యాయామం చెయ్యక, ఇంటికి పరిమితమవుతారు. మరికొందరు తాము కూర్చునే చోటునుండి కదలటానికే ఇష్టపడరు. దీనివలన లావెక్కుతారు.

తమ గురించి తాము ఆలోచించుకోలేనంతగా ఒత్తిడి వారిని మింగేస్తుంది. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తలు పాటించరు.

ఇవన్నీ కలిపి శరీరరూపం మారటం, బరువు అతిగా పెరగటం అనేదానిలోకి దారితీస్తాయి. బరువు విషయంలో జాగ్రత్తలు తీసుకోకుంటే పలురకాల సమస్యలను కొనితెచ్చుకుంటారు.

అందుకే ఒత్తిడికి గురవుతున్న వారు తమ ఆరోగ్యం, శరీర రూపం, బరువు విషయంలో జాగ్రత్త వహించాలి. ఇందుకోసం మానసికపరమైన చికిత్సా సూచనలు మేలుచేస్తాయి అన్నది తాజాపరిశోధకుల సూచన.

## మైండ్‌ఫుల్‌నెస్

**అం**దుకోసంవారు ఒక ప్రత్యేక ప్రక్రియను రూపొందించారు. తాము ఏమిచేస్తున్నది అర్థం చేసుకోగలిగితే సమస్యనుపరిష్కరించుకోవటం సులభం అన్నది ఆ ప్రక్రియలోని ప్రాథమిక అంశం.

దీనికి వారుపెట్టిన పేరు 'మైండ్ ఫుల్‌నెస్'. ఇది ఒత్తిడి నుండి సరిగా బయటకు తెస్తుందని చాలా మంది సర్టిఫికెట్ ఇస్తున్నారు.

మనసులో ఏం జరుగుతున్నది అనేది తెలుసుకునే ప్రయత్నం చెయ్యాలి. 'ఎందుకు' అనే ప్రశ్న ఆ దశలో అనవసరం. ఆ సమయంలో తలెత్తుతున్న ఆలోచనలు, మనసు లోనిభావాలు, అనుభవాలను గుర్తించి, నమోదు చెయ్యగలగాలి. ఎందుకు అలా ప్రవర్తిస్తున్నామనే విషయం చెప్పటంలో ఒక రకమైన ఇబ్బంది వుంటుంది.

అందుకని ఆ ప్రశ్ననునేరుగా అడగరు ఈప్రక్రియలో. భారీకాయంతో బాధపడుతున్నవారిని ఆ బరువుగురించి పదేపదే ప్రశ్నించటంలో అర్థం లేదు. పైగావారు అప్పటికి తమ శరీరరూపాన్ని నలుగురికి నవ్వుతెప్పించే అంశంగా మనసులో కష్టపడు

- **ఆ**లోచనలను ఒకేఒక్క దానిమీద కేంద్రీకరించు. ఇది కూడా భారతంలో అర్జునుడికి ద్రోణాచార్యుడు విలువిద్య నేర్పే సమయంలో చెప్పినదే. అలా దృష్టిని కేంద్రీకరించిన అర్జునుడికి చెట్టుమీదున్న పక్షి కనుగుడ్డు మాత్రమే కనిపించింది.

  **ఇ**దే సూత్రాన్ని మరోలా వివరించారు మైండ్‌ఫుల్‌నెస్ రూపొందించినవారు. ఒక పనిచేస్తున్నప్పుడు రెండవ దాని గురించి ఆలోచించవద్దు. అలా చేస్తే ఒత్తిడి ఏర్పడుతుంది.కాబట్టి ఒత్తిడినుండి బయటపడాలంటే ఆలోచనలను అదుపుచెయ్యాలి.
- గతం మరచిపోవాలన్నది చెప్పినంత సులభం

🅤 **భా**వోద్వేగాలను సహజమైనవిగా అంగీకరించాలి. నా ఆలోచనలు తప్పు, నా చేతలు తప్పు, నేనేదో కొత్తరకం అనే భావన మన మనసులో నుండి తొలగించాలి. ఏ ఇద్దరు మనుషులు ఒకలాంటి వారు కాదు. ఒకేలా ప్రవర్తించరు. ఒకేలా ఆలోచించరు. ఎవరి ప్రత్యేకతలు వారివి. ఎవరి భావోద్వేగాలు వారివి. అందులో మంచి, చెడు అనేవి వుండవు.

**భా**వోద్వేగాలు ఒకస్థాయిని దాటినప్పుడేమంచి, చెడు ప్రస్తావనవస్తుంది.కాబట్టి ముందు గానే మంచి, చెడు ముద్రవేసుకుని భావోద్వేగాలను అదుపుచేసే యత్నంచేసి, అదుపు చేసుకోలేక ఒత్తిడి కొనితెచ్చుకోవద్దు.

**ఆ**లోచనా పరంపరని బయటకు చెప్పండి. దానిమీద తీర్పు చెప్పే అవకాశం మిమ్మల్ని గైడ్ చేసే నిపుణుడికి వదిలేయండి.

సమస్యను మీనుండి దించుకుని, దానిని మోయ టానికి సిద్ధంగా వున్న నిపుణుడికి అందించి నప్పుడు ఎంతగా రిలాక్స్ అవుతారో అనుభవిస్తేనే అర్థమవుతుంది. అటువంటి సహాయకుడి సహాయం అందుకోండి.

తుంటారు. కాబట్టి అటువంటి ప్రశ్నలు వెయ్యరు. అంటే గతంగురించి ప్రశ్నలు అనవసరం. భవిష్యత్తు మీద అతిగా ఆశలు రేపరు.

వర్తమానం మీద దృష్టిపెట్టినప్పుడు సమస్యనుండి త్వరగా బయటకురాగలుగుతారు. ఈ ప్రక్రియలో బరువుతగ్గించే కార్యక్రమానికి మార్గదర్శకులుగా పనిచేసేవారు ఒత్తిడికి గురవుతున్నవారికి మానసికంగా సహాయపడతారు.

## ఆలోచనలనుండే

**మ**నసుమీద ప్రభావం చూపే మాటలు, చేతలతో సమస్యను భూతద్దంలో చూపించక, అందుకునే ఫలితాలమీదకు మనసును మళ్ళిస్తారు.

మరుక్షణం ఏం జరుగుతుందోనన్న ఆసక్తిని కలిగించటంద్వారా భారీకాయులను ఆకట్టుకుంటారు. ఒత్తిడి భావం స్థానంలో ఆసక్తికరంగా వుండేలా సమస్యాత్మక అంశాలను చూపిస్తారు.

ప్రతిరోజూ తీసుకునేబరువు, శరీరకొలత, రక్తంలో గ్లూకోజ్ అంశాలను వ్యక్తిగత సమస్యాత్మక విషయాలుగాకాకఅదిఒక'డేటా'గా అధ్యయనంచేయిస్తారు.

అది ఒక సమాచారం. అందులో కనిపించే చిన్నపాటి మార్పులను ఒకగణాంక శాస్త్ర విద్యార్థి పరిశీలించినట్టుగా పరిశీలించేలా ప్రోత్సహిస్తారు.

ఫలితంగా మార్పు అనేది సాధ్యమే అనే నమ్మకం ఏర్పరచగలుగుతారు.

మార్పు సాధ్యమేనన్న భావన ఆలోచనలమీద పడుతుంది. ఒత్తిడి అనేది ఆలోచనలనుండే వస్తుంది.

నేను చెయ్య గలనా లేదా ఈపని అనేది ఒక రకపు ఒత్తిడి. నేనుచేసినా అందరినీ మెప్పించ గలనా లేదా అనేది మరో రకం ఒత్తిడి.

నేను విఫలమవుతానేమోనన్న భయం మరో రకపు ఇబ్బంది. ఇటువంటి భావాలే శరీర రూపం, శరీర బరువు విషయంలోనూ చాలామంది ఏర్పరుచుకుని ఇబ్బందిని పెంచుకుంటారు.

ఆ స్థాయినుండి తమ ఆలోచనలు, తాముతినే తిండి, దానిలోనిలోటుపాట్లు అంశాలన్నింటినీ కొత్త కోణంలో చూసేస్థాయికి తీసుకువస్తారు.

మరెవరికో సూచనలు ఇస్తున్న నిపుణుడిగా భావించుకుని, తమ సమస్యకు తామే పరిష్కారం చూసుకోగలుగుతారు.

నిర్ణయించుకున్న కొత్తమార్గంలో ప్రయాణంచేసే పట్టుదల వారిలో వచ్చేలా చేస్తారు.

ఈ కొత్త ప్రక్రియ ఒత్తిడివల్లబరువు పెరిగిన వారికే కాదు, ఇతర కారణాలవల్ల బరువు పెరిగి, ఆ పెరిగిన శరీర బరువు అనే సమస్యతో ఒత్తిడికి గురవుతున్న వారికీ పనికొస్తుంది.

శారీరక బరువు పెరిగి ఒత్తిడికి గురవుతున్న వారి మీద ఈ 'మైండ్‌ఫుల్‌నెస్' అనే కొత్త ప్రక్రియను ప్రయోగించారు.

ఆ ప్రయోగంలో పాల్గొన్న ఇరవై ఎనిమిది మంది భారీకాయుల్లో శరీరబరువువల్ల వస్తున్న ఒత్తిడి దాదా పుగా 42శాతం తగ్గిపోయింది. ఒత్తిడికి గురవుతున్న ప్పుడు మనసులోనిభావాలు అదుపు తప్పుతాయి అనేది అందరూ అంగీకరించే విషయం.

ఆ ఆలోచనలను, భావోద్వేగాలను అదుపు చేయగలిగితే సమస్యనుండి బయటపడగలుగుతారు. కాబట్టి సమస్యగురించి ఆలోచించే తీరును మార్చటంమీద ప్రధానంగా దృష్టిపెట్టాలి.

'మైండ్‌ఫుల్‌నెస్' ప్రక్రియలో కీలకం నిన్ను నీవు తెలుసుకోవటం. ఎవరి సమస్యను వారు అర్థంచేసుకోవటం. తమ భావోద్వేగాల పరిస్థితిని మరొకరి కోణంలో పరిశీలించగలగటం. ఒక పరిస్థితిలో ఎలా ప్రవర్తిస్తున్నామనేదికాక ఆ ప్రవర్తనకు ముందు కలిగే ఆలోచనలను అర్థం చేసుకోవాలి.

ఇలా తెలుసుకోవటమే మైండ్‌ఫుల్‌నెస్. నిన్ను నీవు తెలుసుకుంటే సాధించలేనిది ఏదీ లేదు. ఒత్తిడితోసహా దేనినైనా ఇట్టేఅధిగమించగలవు.

ఎవరిని వారు అర్థంచేసుకున్నప్పుడు తొందరపడి నిర్ణయాలకురారు.అనవసరపు ఒత్తిడిని పెంచుకోరు. దానివల్ల ప్రయోజనం ఏమిటంటే ఫలితాన్ని అంగీకరించే మానసికస్థితి కలిగి వుంటారు. ఇటువంటి స్థితికిచేరితే ఇక ఒత్తిడి ఏముంటుంది! ఒత్తిడి లేకుండా అడ్డగోలు ఆహారపు అలవాట్లుండవు.

బరువు పెరగరు. శరీర రూపం మారదు. ఉత్సాహం సన్నగిల్లదు. కాబట్టి ఒత్తిడిని మూలంలో ఎదుర్కోమన్నదే 'మైండ్‌ఫుల్‌నెస్' ప్రక్రియ.

పేరే కొత్తది. ఫిలాసఫీ పాతది. మనం మరచిపోయినది. పాశ్చాత్యులు కొత్తదిగా మనకు అందిస్తున్నది.

**టి.ప్రణవ్**



Courtesy : CHITRALEKHA

🅤 **జీ**వితంలో మనకు తెలియకుండానే ఒక గాడిలో పడి ప్రవర్తిస్తుంటారు. అందులో అనవసరంగా కోపగించుకునే అంశాలు, అర్థంలేని ఏడుపులు, అతిగా నవ్వులు వంటివి వుంటాయి. అనుకున్నవి సాధించలేకపోయినప్పుడు కలిగే కోపతాపాలు, నీరసాలు, అనుకున్నది అందుకోవటం, అతిగా ఎగిరి గెంతటాలు రెండూ సరైనవి కావు. అటువంటి స్పందనలు ప్రదర్శిస్తున్నామనే విషయం ఎంతచెప్పినా అర్థం కాదు. అది ఒక నిపుణుడు మాత్రమే సరిదిద్దగలిగినది.

కాకపోయినా గతం మరచిపోక తప్పదు. 'జరిగిందేదో జరిగిపోయింది... జరగాల్సిందేదో చూడండి' అనేది మన దేశంలో పెద్దలు చెప్పేమాట.

**ఇం**తకన్నా గొప్ప ఫిలాసఫీ మరొకటి లేదంటున్నారు, సరికొత్త ప్రక్రియ కనుగొన్నవారు.

'**గ**తం గతః' అనేది 'భవిష్యత్తు నీ చేతిలో లేదు' అని భారతీయ ఫిలాసఫీని అర్థంచేసుకున్నవారు వర్తమానంమీద దృష్టిపెట్టి సత్ఫలితాలను సాధించగలరు. గతాన్ని మర్చిపోయి వర్తమానంమీద స్థిరమైన పాదం మోపగలిగితే సమస్య పరిష్కారం మరింత సులభమవుతుంది.

# జై భారత్





## చిత్ర వెంకటేష్



"నీ బాధ నాకు అర్థమైంది ప్రద్యుమన్. నీలాంటి గొప్ప దేశభక్తుడిని పోగొట్టుకున్నదని మన డిపార్ట్‌మెంట్ ఎంతో విచారిస్తోంది.నిన్నుమళ్ళీ ఉద్యోగంలోకి తీసుకోవాలని నేను ఎంతో ప్రయత్నించాను. నీకోసం వెతకని చోటులేదు. కాని నువ్వుకానీ, నీ ఆచూకీ కాని నాకు తెలియలేదు.

నిజం తెలుసుకున్న డిపార్ట్‌మెంట్ బ్రిగేడియర్ కల్నల్‌గురించి రిపోర్ట్‌ను ప్రభుత్వానికి పంపించింది. ఆ రిపోర్ట్ ఆధారంగా ప్రభుత్వం కల్నల్‌ను, బ్రిగేడియర్‌ను సస్పెండ్ చేసింది. వాళ్ళు సిగ్గుతో తమ ఉద్యోగానికి రాజీనామా చేసి వెళ్ళిపోయారు. ఈ విషయం నువ్వు పేపర్‌లో చదివేవుంటావు"

"అఫ్‌కోర్స్ చదివాను.కాని నాకు పెద్దగా సంతోషం కలగలేదు. వాళ్ళు తప్పుచేశారు కనుక శిక్ష అనుభవించారు.కాని ఏ తప్పు చెయ్యని నేను కూడా శిక్ష అనుభవించాను. అది తలుచుకుంటే గుండెలు మండిపోతున్నాయి. డిపార్ట్‌మెంట్‌కోసం, దేశంకోసం ఎంతో నిజాయితీగా పనిచేశాను.

నా ప్రాణాలకు తెగించి ఎన్నోసార్లు శత్రువులను పట్టుకుని ప్రభుత్వానికి అప్పగించాను. కాని అటు ప్రభుత్వంకాని, ఇటు డిపార్ట్‌మెంట్‌కాని నా నిజాయితీని గుర్తించలేదు. ఒక మామూలు సైనికుడికి శిక్షవేసినట్టు నాకు కూడా వేసింది. అందుకే ఉద్యోగానికి రాజీనామాచేసి బయటకు వచ్చేశాను.

ఇప్పుడు మీతోకాని, డిపార్ట్‌మెంట్‌తో కాని నాకు ఎలాంటి సంబంధం లేదు. దయచేసి మీరు ఇక్కడ నుంచి వెళ్ళిపోండి" అన్నాడు ప్రద్యుమన్.

"పాత విషయాలు మరచిపో. చెప్పటం తేలిక కాని ఆచరించటం కష్టమని నాకు తెలుసు. అయినా నువ్వు మరచిపోక తప్పదు.

ప్రస్తుతం దేశం పెద్ద ఆపదలో ఉంది. ఆ ఆపద నుంచి దేశాన్ని కాపాడే శక్తి నీకు ఒక్కడికిమాత్రమే ఉంది. ఊరికే చెయ్యనవసరంలేదు. నువ్వు కోరినంత డబ్బు ఇస్తాం. అదీ క్యాష్‌రూపంలో"

"అంటే నా గురించి మీకు తెలుసా" కంగారుగా అన్నాడు ప్రద్యుమన్.

"తెలుసు. నువ్వు పండరీనాథ్ దగ్గర ప్రొఫెషనల్ కిల్లర్‌గా పనిచేస్తున్నావని తెలిసి ముందు ఆశ్చర్యపోయాను. తరువాత సంతోషపడ్డాను. నువ్వు డబ్బు కోసం చంపినవాళ్ళంతా మంచివాళ్ళు కారు, దేశ



భక్తులు కారు, గాంధీమహాత్ములు కారు. అందరూ ఆరితేరిన క్రిమినల్స్. ఇటు దేశానికి అటు సమాజానికి చీడపురుగుల్లా దాపురించినవాళ్ళు.

అలాంటి రాక్షసులు ఈ సభ్యసమాజంలో ఉండటానికి అర్హత లేదు. ఇటు చట్టం నుంచి, అటు పోలీసులనుంచి వాళ్ళు చాలాకాలంనుంచి తప్పించుకున్నారు. కాని నీ నుంచి మాత్రం తప్పించుకోలేకపోయారు. వాళ్ళు చేసిన పాపాలకు తగిన శిక్ష అనుభవించారు. నా దృష్టిలో, నీ దృష్టిలో, ప్రజల దృష్టిలో నువ్వు చేసింది మంచిపని కావచ్చు.

కాని చట్టం దృష్టిలో మాత్రం నేరం. దానికి నువ్వు కూడా శిక్ష అనుభవించవలసిందే"

"అంటే నామీద ఇప్పుడు చట్టపరంగా చర్య తీసుకుంటారా" కంగారుగా అడిగాడు ప్రద్యుమన్.

"అవసరమైతే ఆ పని చెయ్యకతప్పదు. కాని ఆ శిక్షనుంచి తప్పించుకునే అవకాశం నీకు కల్పిస్తున్నాం. నువ్వు మా మాట వింటే నీకు శిక్ష తప్పుతుంది. అంతేకాదు, మళ్ళీ నిన్ను ఉద్యోగంలోకి తీసుకుంటాం" అన్నాడు సిన్హా తాపీగా.

ఊహించని ప్రపోజల్‌కు ఆశ్చర్యంగాచూశాడు ప్రద్యుమన్. తను విన్నది కలో నిజమో అర్థంకాని పరిస్థితిలో పడిపోయాడు. ఒక్క క్షణంపాటు అతను ఏం మాట్లాడలేకపోయాడు. హాలులో ఒక్కసారిగా నిశ్శబ్దం అలుముకుంది.

రెండు క్షణాలు భారంగా గడిచాయి.

"ఇంతకు నేనేం చెయ్యాలి" తేరుకుంటూ అడిగాడు ప్రద్యుమన్.

సిన్హా చెప్పటం మొదలుపెట్టాడు. అంతా విన్న తరువాత ప్రద్యుమన్ మొహం గంభీరంగా అయింది. ఏం మాట్లాడకుండా సిన్హావైపు ఆశ్చర్యంగా చూశాడు. "నువ్వు ఏం ఆలోచిస్తున్నావో నాకు తెల్సు ప్రద్యుమన్. ఈ పని నువ్వు ఊరికే చెయ్యవలసిన అవసరం లేదు. కావల్సినంత డబ్బు ఇస్తాం. నీకు ఎంతకావాలో చెప్పు. వెంటనే ఏర్పాటుచేస్తాను" అన్నాడు సిన్హా.

"డబ్బు విషయం నేను ఆలోచించటంలేదు. పైగా ఇది దేశానికి, దేశరక్షణకు సంబంధించిన విషయం. ఈ దేశంలో పుట్టిన ప్రతి పౌరుడు ఈ దేశం కోసం ప్రాణాలు అర్పించాలి. నాకు డబ్బు అవసరం లేదు. నేను పండరీనాథ్‌కు కమిట్ అయివున్నాను. అతనితో ముందు మీరు మాట్లాడండి. అసలు విషయం చెప్పి దీనికి ఒప్పించండి. ఆయన కాదనడు.

ఒకరకంగా ఆయన చేస్తుందికూడా దేశానికి సేవ కనుక తప్పకుండా ఒప్పుకుంటాడు. ఆయన సరే అంటే నాకు ఎలాంటి అభ్యంతరం లేదు. నా దేశం కోసం ఏమైనా చేస్తాను" అన్నాడు ప్రద్యుమన్.

సిన్హా అలాగే అన్నట్టు తలపంకించాడు.

"ఆ విషయం మాకు వదిలిపెట్టు. పండరీనాథ్‌ను ఎలా ఒప్పించాలో నాకు బాగా తెలుసు. ఈ అసైన్‌మెంట్‌కు ఏం కావాలో చెప్పు. అన్నీ సిద్ధం చేస్తాను" అన్నాడు సిన్హా.

"ఆ విషయం పక్కనపెట్టండి. నేను చైనాలో ఎలా ప్రవేశిస్తానో చెప్పలేదు. అదికదా చాలా ముఖ్యం"

"మాకు రెండు రోజులు గడువు ఇవ్వు. ఈలోగా నా పథకం ఏమిటో చెప్తాను. అంతవరకు ఈ విషయమెవరికీ తెలియకూడదు" అన్నాడు సిన్హా.

ఐదునిమిషాలు అసైన్‌మెంట్ గురించి మాట్లాడి సిన్హా వెళ్ళిపోయాడు. ప్రద్యుమన్ తలుపులు మూసి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు. మెల్లగా బీరువా తెరిచి చూశాడు. బీరువా స్టాండుకు అతని మిలిట్రీ డ్రస్సు తగిలించి ఉంది. రెండు సంవత్సరాలకు ముందు చివరిసారిగా ఆ డ్రస్సు వేసుకుని డ్యూటీ చేశాడు.

ఆ తరువాత ఆ డ్రస్సు విడిచిపెట్టవలసిన పరిస్థితి వచ్చింది. తరువాత ఆ డ్రస్సువైపు కన్నెత్తి కూడా చూడలేదు. ఇప్పుడు అనుకోకుండా మళ్ళీ డ్రస్సువేసుకునే అవకాశం వచ్చింది. నిజానికి ఈ అసైన్‌మెంట్‌కు అతను ఆ డ్రస్సు వేసుకోవలసిన అవసరం లేదు.

ఒక అండర్ కవర్ ఏజెంట్‌గా చైనాలోకి ప్రవేశించబోతున్నాడు అతను. కాని ఎలా అన్నది ఇంకా సిన్హా చెప్పలేదు. రెండు రోజులతరువాతకాని ఆ విషయం తెలియదు. అంతవరకు ప్రద్యుమన్ చెయ్యవలసింది ఏంలేదు, అసైన్‌మెంట్‌గురించి ఆలోచించటంతప్ప. తెరిచి వుంచిన బీరువాను యథాప్రకారం మూసి బాల్కనీలోకొచ్చాడు.

అక్కడనుంచి ఊటీ సిటీ చక్కగా కనిపిస్తుంది. లైట్ల వెలుగులో కొత్త పెళ్ళికూతురిలా మెరిసిపోతోంది. దూరంగా నేషనల్ హైవేమీద కార్లు, ఇతర వాహనాలు వేగంగా దూసుకుపోతున్నాయి.

సిగరెట్‌వెలిగించి చీకటిలోకి చూస్తూండిపోయాడు

## గత సంచికలో ప్రారంభమైన 'జై భారత్' జరిగిన కథ

ఫిఫ్త్ జనరేషన్ విమానం అయిన బ్లాక్ కోబ్రాను చైనాదేశంలో తయారుచేయడం మొదలుపెడతారు. అది గనుక సక్సెస్ అయితే చైనా, భారతదేశం మీద దండయాత్ర చేస్తుందేమోనని మిలట్రీ ఇంటెలిజెన్స్ డైరెక్టర్ సిన్హా భారతప్రధానికి తెలియజేస్తాడు.

ఆ ప్రాజెక్ట్ విజయవంతం కాకుండా చూడమని సిన్హాకు ఆర్డర్ పాస్ చేస్తాడు పి.ఎమ్.

చైనాలోని బ్లాక్ కోబ్రా విమానం తయారయ్యేచోటుకి వస్తాడు కెప్టెన్ మావో.

క్రిమినల్ అయిన యాదవ్‌ను ఓ చెట్టుమీద కూర్చుని తన టెలిస్కోప్ రైఫిల్‌తో మట్టుబెడతాడు ప్రద్యుమన్.

ప్రద్యుమన్ ఓ ప్రొఫెషనల్ కిల్లర్. గతంలో మిలట్రీ ఇంటలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసి రాజీనామా ఇచ్చివుంటాడు. మన దేశానికి నీతో పనిపడిందని ప్రద్యుమన్‌కు చెబుతాడు అతన్ని కలిసిన సిన్హా. ఇక జరిగేది చదవండి.



## ప్రేమానుభూతి

ప్రేమ, ఆప్యాయతలగురించి బాలీవుడ్ భామ యామీగౌతమ్ తన అభిప్రాయాలను ఆసాంతం మార్చుకున్నదట. ఒకప్పుడు ప్రేమంటే ఎటువంటి అభిప్రాయమూ ఉండేది కాదంటున్నది.

"నేనిప్పుడు ప్రేమకు సంబంధించిన అనుభూతి పొందగలుగుతున్నాను. ప్రేమకథా చిత్రాలు చూడడం నాకు ఎంతో ఇష్టం. కెరీర్‌లో కష్టాలన్నవి అతిసహజం" అంటున్న యామీగౌతమ్ బాలీవుడ్‌లో మంచి పేరే తెచ్చుకున్నది. పెద్ద చిత్రాల్లో నటిస్తూ బిజీగా ఉంది.



ప్రద్యుమన్. అప్రయత్నంగా గతం కళ్ళముందు కదలాడింది. సరిగ్గా రెండు సంవత్సరాలకుముందు అతను మేజర్‌గా మిలిట్రీ ఇంటెలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌లో పని చేస్తుండేవాడు. అంతకుముందు సంవత్సరమే భారత రాష్ట్రపతిదగ్గరనుంచి దేశసేవకుగాను మెడల్ అందుకున్నాడు.

అతని నీతీనిజాయితీ, డ్యూటీపట్ల అంకిత భావం చూసి డిపార్ట్‌మెంట్‌లో ఉన్నవాళ్ళందరూ ఎంతో గౌరవించేవారు. ముఖ్యంగా మిలిట్రీ ఇంటెలిజెన్స్ డైరెక్టర్ సిన్హాకు ప్రద్యుమన్ అంటే చాలా ఇష్టం.

ప్రతి ముఖ్యమైన అసైన్‌మెంట్ అతనికి అప్పగించేవాడు. ఇచ్చిన ప్రతి అసైన్‌మెంట్‌ని చాకచక్యంగా పూర్తిచేసి విజయవంతంగా తిరిగివచ్చేవాడు.

ఆ రోజు కూడా ప్రద్యుమన్‌కు ఒక ముఖ్యమైన పని అప్పగించబడింది. సరిగ్గా రెండు గంటలకు ముందు మిలిట్రీ ఇంటెలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌కు ఒక ముఖ్యమైన సమాచారం తెలిసింది.

ఆల్‌ఖైదా, కాశ్మీర్ లిబరేషన్‌ఫ్రంట్‌కు చెందిన రెండు ఉగ్రవాద సంస్థల నాయకులు బద్రక్ ప్రాంతంలో ఒక అడవిలో పాడుబడిన ఇంట్లో సమావేశం అవుతున్నారని తెలిసింది.

ఈ విషయం తెలుసుకున్న సిన్హా వెంటనే తన పై అధికారులతో సమావేశమయ్యాడు. రెండు ఉగ్రవాద సంస్థలు ఒకేచోట సమావేశం కావటం ఇంతవరకు జరగలేదు. పైగా నాయకులు ఒకేచోట కనిపించటం ఇంతవరకు జరగలేదు.

ఒక దెబ్బకు రెండు పిట్టలన్నట్టు ఇద్దరు నాయకులను కార్నర్ చెయ్యాలని సిన్హా నిర్ణయించాడు. వెంటనే మేజర్ ప్రద్యుమన్‌తో మాట్లాడాడు. గంట తర్వాత మిలిట్రీ డిపార్ట్‌మెంట్ రంగంలోకి దిగింది.

సిన్హా ఆధ్వర్యంలో రహస్యంగా మీటింగ్ జరిగింది. ఆ మీటింగ్‌కు కల్నల్, బ్రిగేడియర్ కూడా వచ్చారు. ఉగ్రవాదులను ఎలాగైనా ప్రాణాలతో పట్టుకోవాలని బ్రిగేడియర్, కల్నల్ ఆదేశించారు.

ఆ ఆపరేషన్‌కు ప్రద్యుమన్‌ను నాయకుడిగా నియమించారు. అతనికి సహాయంగా పదిమంది కమెండోలను పంపించారు.వెంటనే ప్రద్యుమన్ తన సహచరులను తీసుకుని కటక్ ప్రయాణమయ్యాడు. అందరూ విమానంలో భువనేశ్వర్ చేరుకున్నారు.

అక్కడనుంచి జీపులో బద్రక్ చేరుకున్నారు. అది పూర్తిగా అడవి ప్రాంతం. వాహనాలలో ప్రయాణం చెయ్యటం సాధ్యంకాదు. అందుకే వాహనాన్ని అక్కడే వదిలేసి కాలినడకన ప్రయాణం అయ్యారు.

దాదాపు పాతిక కిలోమీటర్లు నడిస్తేకాని వాళ్ళ గమ్యస్థానం రాదు. ఉగ్రవాదులు సమావేశం అవుతున్న చోటు చేరుకోలేరు. అది ఎండాకాలం. సూర్యుడు తన ప్రతాపాన్ని పూర్తిగా చూపిస్తున్నాడు. నడినెత్తిన ఎంత మండిపోతోంది. వేడిసెగలు చెంపల్ని అదరగొడుతున్నాయి. ఐనా లెక్కచెయ్యకుండా ప్రద్యుమన్ తన సహచరులతో ముందుకు సాగిపోయాడు. కాళ్ళు విపరీతంగా నొప్పి పుడుతున్నా పట్టించుకోలేదు. ఒక నిమిషం కూడా విశ్రాంతి తీసుకోకుండా టార్గెట్ స్పాట్‌కు చేరుకున్నారు.

అది ఒక కొండ ప్రాంతం. దానికింద విశాలమైన మైదానంలో ఒక పాడుబడిన ఇల్లు కనిపించింది. ఇంటిముందు ఇద్దరు ఉగ్రవాదులు తుపాకులతో కాపలా కాస్తున్నారు.

లోపల ఎంతమంది ఉన్నారో తెలియటంలేదు. తన సహచరులకు ఫైరింగ్ ఆర్డర్స్ ఇచ్చాడు.

ఒక కమెండో బజూకా గురిపెట్టి కాల్చాడు. అందులోంచి వెలువడిన బాంబు విద్యుత్ వేగంతో దూసుకుపోయి ఆ పాడుపడిన ఇంటిని ఢీకొట్టింది.

'ఢాం' అంటూ పెద్ద శబ్దంతో బిల్డింగ్ తునాతునకలైంది. ఆ బిల్డింగ్‌లో ఉగ్రవాదులతోపాటు వాళ్ళ పిల్లలు కూడా ఉన్నారు.జరిగింది తెలుసుకున్న ప్రద్యుమన్‌తోపాటు బ్రిగేడియర్, కల్నల్ నిర్ఘాంతపోయారు. జరిగింది జీర్ణంచేసుకోలేకపోయారు. ఒక్కసారిగా వాళ్ళ మైండ్ బ్లాంక్ అయిపోయింది.

నిజానికి ఆ పిల్లలు భారతదేశానికి సంబంధించిన పిల్లలు కారు.వాళ్ళు ఉగ్రవాదుల పిల్లలు. చిన్నతనం నుంచి వాళ్ళకు ఉగ్రవాద చర్యలు అలవాట్లు నేర్పటానికి వాళ్ళను తమవెంట తీసుకువచ్చారు.

చాలాసార్లు వాళ్ళను అడ్డంపెట్టుకుని సెక్యూరిటీ జవాన్లనుంచి తప్పించుకున్నారు. పిల్లలను ముందు పెట్టి స్పాట్‌నుంచి తప్పించుకున్నారు.

ప్రద్యుమన్‌మీద డిపార్ట్‌మెంట్‌పరంగా చర్య తీసుకోవాలని సిన్హా నిర్ణయించాడు. వెంటనే ఆ తతంగం మొదలైంది.విశాలమైన హాలులో బ్రిగేడియర్ కల్నల్ డైరెక్టర్ సిన్హా కూర్చున్నారు.

వాళ్ళకు ఎదురుగా ప్రద్యుమన్ నిలబడివున్నాడు. అతనికి రెండువైపులా మిలిట్రీ జవాన్లు ఉన్నారు. సిన్హాముందు ప్రద్యుమన్ పర్సనల్ ఫైలు ఉంది. అందులో అతను ఉద్యోగంలో చేరినప్పటినుంచి నిర్వహించిన ఆపరేషన్స్ వివరాలు న్నాయి.

అంతేకాకుండా, పోయిన సంవత్సరం అతను చేసిన దేశసేవకుగాను ప్రెసిడెంట్‌నుంచి మెడల్‌కూడా అందుకున్న విషయం కూడా ఆ ఫైలులో ఉంది.

ఐదునిమిషాలతరువాత విచారణ మొదలైంది.

"మేజర్ మీ పైఆఫీసర్స్ మిమ్మల్ని ఉగ్రవాదులను ప్రాణాలతో పట్టుకురావాలని చెప్పారు. కాని మీరు అలా చేయలేదు. సుపీరియర్ ఆర్డర్స్‌ను ధిక్కరించి మీకు తోచినట్టు ప్రవర్తించారు

నిన్ను పదిహేనురోజులు సస్పెండ్ చేస్తున్నాం. మామూలుగా అయితే ఈ నేరానికి మీకు చాలా పెద్ద శిక్షవేయాలి. కాని మీరు దేశానికి, డిపార్ట్‌మెంట్‌కు చేసిన సేవలను గుర్తించి ఈ చిన్న శిక్షతో సరిపెడుతున్నాం" అని తీర్పు చెప్పారు.

జడ్జిమెంట్ విని ప్రద్యుమన్ మొహం అవమానంతో ఎర్రబడింది. తను సస్పెండ్ కావటాన్ని ప్రద్యుమన్ ఎంతమాత్రం జీర్ణం చేసుకోలేకపోయాడు. కోపంతో వెంటనే ఉద్యోగానికి రాజీనామా చేశాడు. తరువాత పండరీనాథ్‌తోకలిసి పనిచెయ్యటం అదో పెద్దకథ.



**గాంధీజీ చెడుమార్గంలో వెళ్ళకుండా చెయ్యిపట్టుకుని సన్మార్గంలో నడిపించిందీ, అహింసను ఆయుధంగా అందించిందీ ఆయన భార్య కస్తూర్బా.** -తారాగాంధీ భట్టాచార్జీ, గాంధీజీ మనుమరాలు

ఆ గదిలో నిశ్శబ్దం ఘనీభవించిన మంచులా ఉంది. ఆ గదిలో ముగ్గురు మాత్రమే ఉన్నారు. వాళ్ళలో ఒకరు భారత ప్రధాని, రెండో వ్యక్తి మిలిట్రీ ఇంటెలిజెన్స్ డైరెక్టర్ సిన్హా, మూడో వ్యక్తి ప్రద్యుమన్. సిన్హా అంతా వివరంగా చెప్పినతరువాత ప్రద్యుమన్ బాగా ఆలోచించాడు.

మామూలు పరిస్థితిలో అయితే ప్రద్యుమన్ ఎంతమాత్రం రాజీపడేవాడు కాడు. కాని దేశానికి పెద్ద ముప్పు రాబోతోందని విన్నతరువాత అతను తన మనస్సు మార్చుకున్నాడు.

తన కోపాన్ని, ఈగోను పక్కనపెట్టాడు. అధికారులకోసం, డిపార్ట్‌మెంట్‌కోసం కాకపోయినా దేశం కోసం ఈ అసైన్‌మెంట్ తీసుకోవాలని నిర్ణయించుకున్నాడు. అందుకే వెంటనే తన నిర్ణయాన్ని సిన్హాకు చెప్పాడు. ఆ మాటలు వినగానే సిన్హా ఎంతో సంతోషపడ్డాడు. ఇంత తొందరగా ప్రద్యుమన్ కాంప్రమైజ్ అవుతాడని ఆయన అనుకోలేదు. అందుకే చాలా సంతోషపడ్డాడు. వెంటనే ప్రద్యుమన్ నిర్ణయాన్ని ప్రధానమంత్రికి తెలియచేశాడు.

సరిగ్గా రెండురోజులతరువాత ప్రధానమంత్రి అఫీషియల్‌రెసిడెన్స్‌లో ఆ రోజు రాత్రిముగ్గురూ సమావేశమయ్యారు. ప్రద్యుమన్ చైనా వెళ్ళటానికి ముమ్మరంగా ఏర్పాట్లు సాగుతున్నాయి.

"నీ పాస్‌పోర్ట్ వీసా అంతా సిద్ధంగా ఉంది. నీకు వర్క్‌పర్మిట్ వీసా తీసుకున్నాం" అన్నాడు సిన్హా.

"వర్క్ పర్మిట్ వీసానా"నేను అక్కడ ఏంఉద్యోగం చెయ్యబోతున్నాను" ఆశ్చర్యంగా అడిగాడు ప్రద్యుమన్. "ఇంకో రెండురోజులలో చైనీస్ ఎంబసీలో ఇంగ్లీష్ ట్యూటర్‌కోసం ఇంటర్వ్యూలు జరగబోతున్నాయి. అందరితోపాటు నువ్వు కూడా ఆ ఇంటర్వ్యూకు అటెండ్ అవుతున్నావు. నీకు ఇంగ్లీష్‌లో పోస్ట్ గ్రాడ్యుయేట్ డిగ్రీ ఉంది. పైగా నువ్వు చాలా బాగా ఇంగ్లీష్ మాట్లాడతావు. కనుక ఈ ఉద్యోగం నీకు తప్పకుండా వస్తుంది. ఒక ఇంగ్లీష్ ట్యూటర్‌గా నువ్వు చైనాలోకి లీగల్‌గా ప్రవేశిస్తావు.

నువ్వు పాఠాలు చెప్పే అధికారులతో మర్యాదగా ఉంటూ వాళ్ళదగ్గరనుంచి బ్లాక్ కోబ్రా గురించి రహస్యాలు తెలుసుకోవటానికి ప్రయత్నిస్తావు. ముందు వాళ్ళ నమ్మకాన్ని సంపాదించు, తరువాత నీ దర్యాప్తు మొదలుపెట్టు. అక్కడ సురజిత్ సింగ్ అనే మన ఏజెంట్ క్యాంటీన్ నడుపుతున్నాడు.

అతను నీకు అన్నివిధాలుగా సహాయం చేస్తాడు. ప్రతిరోజూ నాతో మాట్లాడటానికి నీకు ఒక ట్రాన్స్‌మీటర్ కూడా ఇస్తాడు. దాని వేవ్ లెన్త్ సెటప్ అతనికి తెలుసు. ఎవరూ లేనప్పుడు రహస్యంగా నాతో మాట్లాడు. ప్రస్తుతం నువ్వు చెయ్యవలసింది ఇంతే. సమయం వచ్చినప్పుడు ఏం చెయ్యాలో చెపుతాను" అన్నాడు సిన్హా.

"ఇంటర్వ్యూ ఎప్పుడు" అడిగాడు ప్రద్యుమన్.

"ఈ రోజు పేపర్‌లో ఆ ఉద్యోగం గురించి ప్రకటన పడింది. నీకోసం ఆ పేపర్ కటింగ్ కూడా తీసుకువచ్చాను. వెంటనే ఆ ఉద్యోగానికి నువ్వు అప్లయ్ చెయ్యి. తప్పకుండా సెలక్ట్ అవుతావు. అయ్యేలా నేను చూస్తాను" అన్నాడు సిన్హా. అలాగే అని తలూపాడు ప్రద్యుమన్. పదినిమిషాల తరువాత సమావేశం ముగిసింది.

పేపర్ కటింగ్ తీసుకునివెంటనే ఉద్యోగానికి అప్లయ్ చేశాడు. ఆ ఉద్యోగానికి కావల్సిన అర్హతలన్నీ ప్రద్యుమన్‌కు ఉన్నాయి. పైగా ఇంగ్లీష్‌లో అతనికి చాలా బాగా కమ్యూనికేషన్ స్కిల్స్ ఉన్నాయి. ఇంతకంటే మంచి అర్హతలు ఇంకేం కావాలి.

అనుకున్నట్టుగానే అతని ఈమెయిల్ ఐడికి ఇంటర్వ్యూ లెటర్ వచ్చింది. ఎల్లుండి పదిగంటలకు ఇంటర్వ్యూకు హాజరుకావాలని చైనీస్ ఎంబసీ అధికారులు రాశారు. ఆ రోజు పదినిమిషాలు ముందే ఎంబసీకి ఆటోలో చేరుకున్నాడు ప్రద్యుమన్.

ఆటోవాడికి ఫేర్ చెల్లించి లోపలికి వెళ్ళాడు. విశాలమైన హాలులో దాదాపు ఇరవైమంది కాండిడేట్స్ కూర్చునివున్నారు. వాళ్ళంతా ఇంటర్వ్యూకు వచ్చినవాళ్ళని ప్రద్యుమన్‌కు అర్థమైంది.

తను ఎక్కడ కూర్చోవాలో తెలియక అటూఇటూ చూశాడు. ఒక యువతి పక్కన సీటు ఖాళీగా కనిపిస్తే అక్కడికి వెళ్ళి కూర్చున్నాడు. సరిగ్గా పదిగంటలకు ఇంటర్వ్యూ మొదలైంది. ఒక్కొక్క అభ్యర్థీ లోపలికి వెళుతున్నాడు. అయిదు నిమిషాలు తరువాత విచారంతో తిరిగివస్తున్నాడు. లోపలికి వెళుతున్నప్పుడు ఉన్న ఆత్మవిశ్వాసం గదిలోంచి బయటకు వచ్చిన

## నేనైతే హ్యాపీ

'గరుడ వేగ' సినీ విజయం ఖాతాను తన కిట్టీలో వేసుకుని సంబరపడిపోతున్న శ్రద్ధాదాస్ హుషారుగా ప్రచారం సాగిస్తున్నది. ఈ సరదాల వరదా పక్కన ఇబ్బందికర ప్రశ్న తప్పలేదు.

ఈమధ్య క్యాస్టింగ్ కౌచ్ గురించి ఎవరో ఒకరు అదే పనిగా మాట్లాడేస్తున్నారు. ఇదే ప్రశ్న శ్రద్ధాదాస్‌కూ ఎదురైంది. "పరిశ్రమలో ఈ దురాచారం ఉన్నమాట వాస్తవమే కావచ్చు, కాని నాకైతే అటువంటి ఇబ్బంది కర పరిస్థితి రాలేదు. ప్రొఫెషనల్‌గా, ముక్కుసూటిగా వ్యవహరించినప్పుడు ఇటువంటివి దూరంగా ఉంటాయన్నది నా అభిప్రాయం.

నాకు పార్టీల్లో పాల్గొనే అలవాటుకూడా లేదు. షూటింగ్ పూర్తయిపోగానే ఇంటికి వెళ్ళిపోతా" అంటూ గోడమీద పిల్లివాటం మాదిరి వెరైటీగా సమాధానం చెప్పింది శ్రద్ధాదాస్.








నేటి భారతీయ యువత క్రీడలకంటే సామాజిక మాధ్యమాలలో ఎక్కువ కాలం వెళ్ళబుచ్చుతోంది.
-విరాట్ కోహ్లీ, క్రికెటర్

# 9 కథలకి 9 బహుమతులు












ఆగ్రహానుగ్రహ లక్షణం కలిగినవే నవగ్రహాలు. ఇవి జాతకరీత్యా అనుకూలత కలిగినప్పుడు ఉచ్ఛస్థితిలోకి తీసుకువెళ్ళగలవు. గ్రహస్థితి సరిగా లేకుంటే అధఃపాతాళానికి నెట్టివేయగలవు. అందుకే నవగ్రహాల అనుగ్రహానికి ప్రతిఒక్కరూ పాత్రులయ్యేందుకు వాటిని ఆరాధిస్తారు. నవగ్రహాల ముఖ్య లక్షణాలలో కొన్ని ఇవి: వాటిని దృష్టిలో వుంచుకుని కథల పోటీని ప్రకటిస్తున్నాం.

1. **రవి...** ఆరోగ్యాన్ని ప్రసాదించేవాడు
2. **చంద్రుడు...** మానసిక బాధలను తొలగించేవాడు
3. **కుజుడు...** అప్పులు తొలగించేవాడు
4. **బుధుడు...** వ్యాపారాభివృద్ధికి
5. **గురువు...** శుభాలనిచ్చేవాడు
6. **శుక్రుడు...** వివాహాలకు, దంపతుల అనుబంధాలకు
7. **శని...** అహంకారాన్ని తొలగించేవాడు
8. **రాహువు...** చంచల స్వభావాన్నిచ్చేవాడు
9. **కేతువు...** భక్తికి, ముక్తికి

పైన చెప్పిన నవగ్రహాల లక్షణాలను సబ్జెక్టులుగా చేసుకుని రచయిత(త్రు)లను కథలు రాయవలసిందిగా కోరుతున్నాం. రాయగలిగితే అన్ని సబ్జెక్టులపైనా రాయొచ్చు. పాఠకదేవుళ్ళకు అక్షర నైవేద్యంగా మీ కథలను అందించండి.

## ప్రతి కథకి ₹10,000 బహుమతిగా అందజేస్తాం

కథలను పంపవలసిన చిరునామా : ఎడిటర్, స్వాతి సపరివార పత్రిక, అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట, పోస్ట్ బాక్స్ 339, విజయవాడ 520 002

## రచనలు మాకు చేరవలసిన ఆఖరు తేది : 9.12.2017



తరువాత ఎవరి మొహంలోనూ కనిపించటంలేదు.

సరిగ్గా గంట తరువాత ప్రద్యుమన్ వంతు వచ్చింది. అతనే చివరి క్యాండిడేట్. తన ఫైల్స్ తీసుకుని లోపలికి వెళ్ళాడు. విశాలమైన మహాగని టేబుల్ వెనుక ఓ చైనీస్ అధికారి కూర్చునివున్నాడు. అతను పూర్తిగా మిలిట్రీ డ్రస్సు వేసుకున్నాడు.

అతని యూనిఫారమ్‌మీద ఉన్న స్టార్స్‌బట్టి అతను కెప్టెన్ ర్యాంక్‌లో ఉన్నాడని ప్రద్యుమన్‌కు అర్థమైంది. ముందుగా ఆ అధికారి అతని సర్టిఫికెట్స్ చూశాడు. "ఇంతకుముందు మీరు ఎక్కడ పని చేశారు" అడిగాడు ఆ అధికారి.

"చాలా ఉద్యోగాలు చేశాను. కాని ఒక్కదాంట్లో కూడా కుదురుగా ఉండలేకపోయాను.

దానికి కారణం తక్కువ జీతం, ఎక్కువ పని గంటలు. ఉదయం తొమ్మిదిగంటల నుంచి సాయంత్రం ఎనిమిదిగంటల వరకు పనిచెయ్యాలి.

నేను చదివిన చదువుకు, చేస్తున్న ఉద్యోగానికి ఏమాత్రం సంబంధం ఉండేదికాదు. దాంతో నాకు చేస్తున్న పనిమీద శ్రద్ధ తగ్గిపోయింది.

ఏ పని అయినా కష్టపడి కాకుండా ఇష్టపడి చెయ్యాలి. అప్పుడే ఆ మనిషి అభివృద్ధి సాధించగలడు. కాని నాకుమాత్రం ఎప్పుడూ నాకు ఇష్టమైన ఇంగ్లీష్‌ట్యూటర్ ఉద్యోగం రాలేదు. ఎన్నో కాలేజీలకు, ఇన్‌స్టిట్యూట్‌లకు అప్లైచేశాను.కాని నా దగ్గర రికమెండేషన్ లెటర్ కాని, లంచం ఇవ్వటానికి కాని డబ్బు లేదు.

అందుకే ఆ ఉద్యోగం నాకురాలేదు. అనుకోకుండా పేపర్‌లో మీ ప్రకటన చూశాను.మీరు అడిగిన అర్హతలన్నీ నాకున్నాయి. అందుకే ఈ ఉద్యోగం తప్పకుండా నాకే వస్తుందని నమ్మకం కలిగింది. అందుకే అప్లయ్ చేశాను" అన్నాడు ప్రద్యుమన్.

"మీరు ఇంగ్లీష్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేశారు కనుక మీకు చిన్న పరీక్ష పెడతాను" అన్నాడు ఆ అధికారి. "పెట్టండి" అన్నాడు ప్రద్యుమన్.

"మీకే కనుక ఈ ఉద్యోగం వస్తే మీరు ఎలా పని చేస్తారో వివరంగా తెలియచేస్తూ ఒక ఆర్టికల్ రాయండి" అన్నాడు.

వెంటనే ప్రద్యుమన్ పెన్ను కాగితం తీసుకుని రాయటం మొదలుపెట్టాడు.ఇలాంటి ఆర్టికల్స్ రాయటంలో అతనికి ఎంతో అనుభవం ఉంది. అందుకే ఏమాత్రం తడబాటు లేకుండా అతని కలం సాఫీగా ఏ ఒడుదుడుకులు లేకుండా సాగిపోయింది.

పదినిమిషాలలో పూర్తిగా రాసి ఆ అధికారికి ఇచ్చాడు. ముందు క్యాజువల్‌గా చూశాడు అధికారి. రెండు వాక్యాలు చదివేసరికి నిటారు అయి దీక్షగా చదివాడు. అంతా చదివినతరువాత ప్రద్యుమన్‌వైపు మెచ్చుకోలుగా చూశాడు.

"ఎక్స్‌లెంట్ డ్రాఫ్ట్. మీరు ఇంత చక్కగా మంచి పదాలతో రాస్తారని నేను ఎంతమాత్రం ఊహించలేదు. ఇంతవరకు ఎంతోమందిని ఇంటర్వ్యూ చేశాను. కాని ఎవరికీ ఇంగ్లీష్‌మీద పట్టులేదు.

పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశారుకాని ఇంగ్లీష్‌పదాలను ఎలా ఎక్కడ ఉపయోగించాలో బొత్తిగా తెలియదు. మీరుకూడా అదే బాపతు అనుకున్నాను.

కాని మీరు రాసిన డ్రాఫ్ట్ చూసినతరువాత నా అభిప్రాయం పటాపంచలైంది. చాలా చక్కగా మంచి పదాలతో, తేలికపాటి భాషలో రాశారు. మీరు ఈ ఉద్యోగానికి సెలక్ట్ అయ్యారు" అన్నాడు ఆ అధికారి చిరునవ్వు నవ్వుతూ.ప్రద్యుమన్ మొహం ఒక్కసారిగా ఆనందంతో వెలిగిపోయింది.

"థ్యాంక్యూ సార్" అన్నాడు ఆనందంతో.

"మీకు ఉద్యోగమిస్తే ఎన్ని రోజులలో జాయిన్ కాగలరు" అడిగాడు అధికారి.

"మీరు ఎప్పుడు జాయిన్ కావాలంటే అప్పుడు జాయిన్ అవుతాను" అన్నాడు ప్రద్యుమన్.

"మీకు పెళ్ళయిందా" "ఇంకా లేదు"

"మీ కుటుంబం గురించి చెప్పండి"

"నాకు ఒక తల్లి, పెళ్ళికాని చెల్లెలు ఉన్నారు. తను కాలేజీలో డిగ్రీ చదువుతోంది. నాతోనే ఉంటున్నారు" అన్నాడు ప్రద్యుమన్.

ఈ పరిస్థితి వస్తుందని సిన్హా ముందే ఊహించాడు.అందుకే ప్రద్యుమన్ తల్లిగా, చెల్లెలుగా నటించటానికి ఇద్దరు ఆడవాళ్ళను ఏర్పాటుచేశాడు.తల్లిగా నటిస్తున్న ఆమె నాటకాలలో వేషంవేస్తుంది. అప్పుడప్పుడు సినిమాలలోకూడా నటిస్తుంది.చెల్లెలుగా నటిస్తున్న అమ్మాయి పేరు స్వాతి. ఆమె తల్లిగా నటిస్తున్న ఆవిడ కన్నకూతురు.

**ఇంకా ఉంది**

# నేనెవరో తెలుసా!

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు **ఇన్‌లాండ్ కవర్‌పై** రాసి స్వాతి చిరునామాకు **2 డిశంబరు 2017** తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

చెమ్మచెక్క చారడేసి మొగ్గలనేఆటఆడని అమ్మాయిలు వుండరు. తారంగం తారంగం తాండవ కృష్ణ తారంగం పాడించని పెద్దలు వుండరు. అవి ఎవరు రాశారో ఎవరికీ తెలియదు.

ఎంత కాలం నుండి మన వాళ్ళు పాడుకుంటున్నారో కూడా తెలియదు. అయితే ఇటువంటి పాటలు ఇంకా ఎన్నో ఉండివుంటాయి. మారిన కాలంలో అవన్నీ మరుగున పడిపోయివుంటాయి.

అయితే కేవలం నోటితో ఒకరు చెపుతుంటే విన్న పాటలు కలకాలం నిలవటం ఒక విశేషమే.

అటువంటి పాటలు కనుమరుగు అవుతున్న కాలంలో వాటిని వెతికి, శతాబ్దాల నుండి నిర్లక్ష్యం చెయ్యబడిన మన సాహిత్య పరిజ్ఞానాన్ని ముందు తరాలకు అందించేందుకు కృషి చేసిన మహానుభావుడు ఒకరు వున్నారు. గ్రంథస్థంకాని సాహిత్యాన్ని సేకరించి ప్రచురించారు.

జనుల నోళ్ళలో నానుతూవున్న నుడులు, నానుడులు అనేకం సేకరించి తన పుస్తకాలలో రాసి మనకు అందించారు. లిఖిత వాఙ్మయాన్ని వెలువరించటంలోనూ ఎంతో శ్రద్ధ కనబరిచారు.

అలా పద సేకరణకు విస్తృతంగా పాటుపడిన వారిలో ప్రథమ తాంబూలం ఆయనదే.

ఫిబ్రవరి 7, 1888వ సంవత్సరంలో పుట్టిన ఆయన జీవితంమీద కృష్ణాతీరంలోని ఆ అగ్రహార ప్రభావం వుంది.

ఆ అగ్రహారంలోని మహాపండితులు గుడి మంటపంలో జరిపే సాహిత్యగోష్ఠులు, వాదోపవాదాలు, పాడే పాటలు, పద్యాలు, చేసే ప్రసంగాలు బాలుడిగా ఆయన వ్యక్తిత్వ వికాసానికి, సంస్కార అత్యున్నతికి ఎంతగానో దోహదపడ్డాయి.

ఇంటిదగ్గర తండ్రి అందించిన పాండిత్య సహకారం ఆయన్ని మరింతగా తీర్చిదిద్దాయి.

తిరుపతి వెంకట కవులకు శిష్యులయ్యే అదృష్టం ఆయనకు దక్కింది. చెళ్ళపిళ్ళవారి శిష్యరికంగా ఆ బాలుడు ఎన్నో అవధాన ధారణలు, పద్య రచనలలోని లోటుపాట్లను అర్థంచేసుకున్నాడు. పండితగోష్ఠులలో పక్కనే కూర్చునే అవకాశం చిక్కింది.

గురువుగారి దీవెనలతో అష్టావధాన, శతావధాన కళల్ని ఎంతో నిశితంగా పరిశీలించి నేర్చుకున్నాడు. ఆ తరువాత పరిశోధనను ప్రధాన అంశంగా ఎంచుకుని జీవితాన్ని ముందుకు తీసుకువెళ్ళాడు.



17.11.2017 సంచికలో ప్రచురించబడిన **'నేనెవరో తెలుసా!'** శీర్షిక సమాధానాలు :
1. హెచ్.సి.నంద, 2. ఎస్కార్ట్స్
₹ 500/- **బహుమతి పొందిన విజేత** : వి.శ్రీను, 5-4-34, సామర్లకోట-533440

ఈనాడు అన్నమయ్య 'ఆంధ్రుల సంపద'గా నిలిచివున్నాడంటే అందుకు ఏకైక కారణం కూడా ఆయనే అంటే అతిశయోక్తి కాదు.

ఎక్కడెక్కడో వుండిపోయిన అన్నమయ్య పదకవితల రాగిరేకులను సేకరించి, ఆ పదకవితలను సరిదిద్ది, ఆ రేకులను ఒక వరుసలో కూర్చి మనందరికీ ఆయన అందించబట్టే మనం నేడు వాటిని పిల్లల చేత సాధన చేయించగలుగుతున్నాం.

అన్నమయ్యను ఒక ప్రత్యేక లక్ష్యంతో శ్రీ వేంకటేశ్వరుడు ఈ లోకంమీదికి పంపాడన్న నానుడి మన మధ్య ఉన్నది.అన్నమయ్య జీవితమంతా గడిపి తాను నేర్చిన జ్ఞానాన్ని పదకవితల రూపంలో ఆ దేవదేవుని పాదాలచెంతకు చేర్చి లోకంవదిలి వెళ్ళిపోయాడు.

మరుగునపడిపోయిన ఆ పద సాహిత్యాన్ని తిరిగి శ్రీ వేంకటేశ్వరునికి వినాలనిపించిందేమో. అందుకోసం మరో తగిన వ్యక్తిని ఈ లోకంలోకి పంపించాలనుకున్నాడు. అలా శ్రీ వేంకటేశ్వరుని పదసేవ కోసం, ప్రాచీన తెలుగు వాఙ్మయసేవకోసం ఈ లోకంలో కృష్ణానదీ తీరంలోని ఒక పండిత వంశంలో పుట్టాడు ఆ మహానుభావుడు.

ఇరవయ్యవ శతాబ్దపు తొలి దశాబ్దంలో చెన్నపట్నంలోని ఒక పాఠశాలలో తెలుగు పండితుడిగా కొత్త జీవితం మొదలుపెట్టారు.

అప్పటికి దక్షిణ దేశమంతా బ్రిటీష్‌వారి పాలన. అన్ని ప్రాంతాలకు రాజధాని మద్రాసు. భారతదేశంలోని సాహిత్య సంపదను సేకరించి ప్రభుత్వ గ్రంథాలయంలో భద్రపరిచాయి.

ఆ ప్రాచ్య గ్రంథాలయానికి వెళ్ళి చదవటం మొదలుపెట్టారు. పుస్తకాలు చదువుతుంటే అలుపు అనేది కలిగేది కాదు ఆయనకు.

పుస్తకాలతో ఆయనకు ఏర్పడిన అనుబంధం ఉపాధ్యాయ ఉద్యోగం వదిలి గ్రంథాలయంలో ఉద్యోగం స్వీకరించేలా చేసింది.

అక్కడ వున్న ప్రాచ్య గ్రంథాలకు జాగ్రత్తగా నకలు తయారుచేశారు. ఆ తర్వాత విభిన్న భాషలలోని ప్రాచీన గ్రంథాల ప్రచురణకు రాతప్రతులను సేకరించే బృందాన్ని, దేశం స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మద్రాసు ప్రభుత్వం నియమించింది.

అందులో సభ్యుడిగా ఆంధ్ర దేశమంతా తిరిగారు ఆయన. వెళ్ళిన ప్రతిచోటా పలికే మాటలు, పాడే పాటలు, చెప్పుకునే కథలను సేకరించారు. ఎంత గొప్ప సాహిత్యం అలా నోటివాటగా వ్యాప్తి చెందింది! అని ఆశ్చర్యపోతూనే వాటినన్నింటినీ సేకరించారు.

ముఖ్యంగా బాలల భాష గురించి బాగా ఆలోచించారు. పాటలు, పదాలు, పలుకుబడులు, నుడికారాలు, చమత్కారాలు, పొడుపు పద్యాలు, చాటుధారలువంటివన్నీ ఆయన సేకరించి గ్రంథస్థం చేశారు. పిల్లల పాటలమీద ప్రత్యేక శ్రద్ధ పెట్టారు.

పిల్లల ముద్దుమాటలు, తొక్కుపలుకులు వినటం అందరికీ ఆనందమే. అయితే అవి ముందు తరాలకు అందే మార్గం ఏది! శబ్దం ధ్వని ప్రధానమయిన బాల భాష ముచ్చటయిన, ముద్దు ముద్దు మాటలు కలిగినది. ఆ విషయాలన్నీ వివరించి ముందు తరాలకు బాలభాషగా అందించిన ఘనత ఆయనది.

ఆయనలోని పాండిత్య కోణం గురించే చాలా మందికి తెలుసు. కాని ఆయనలో వున్న ఆధ్యాత్మిక కోణం కొంతమందికే తెలుసు.

ఆయన 1926 నాటికే ఆధ్యాత్మిక బాటపట్టారు. నాటి ఆధ్యాత్మిక గురువు సి.వి.వి.కి శిష్యుడిగా జీవితం మొదలుపెట్టిన ఆయన ఎందరెందరినో ప్రార్థనామార్గంలోకి నడిపించాడు.

ఆయనలో బాధలను తగ్గించే శక్తి వుండేది అని ఆయా ప్రాంత ప్రజలు తమ తమ అభిప్రాయాలను వెలిబుచ్చేవారు. అలాగే అనారోగ్యాలను తొలగించేవాడు అని ప్రతీతి. ఎందరినో మృత్యువు ముఖం నుండి వెనక్కితెచ్చి కొత్త జీవితం అందించినట్టుగా శిష్యులు చెపుతారు.

అలా ఒకవైపు సాహిత్యంలో, మరోవైపు ఆధ్యాత్మిక బాటలో ముందుకు నడిచిన ఆ కవి, పండితులు సొంతంగా ఎన్నో పుస్తకాలు రాశారు.

ఆయన చేసిన అన్నమయ్య సాహిత్య సేవకూ, రంగనాథుని తాళపత్ర గ్రంథాలను వెలికితీతను గుర్తించిన తిరుమల తిరుపతి దేవస్థానం ఆయన పేరుతో వాఙ్మయ పీఠం ఏర్పాటుచేసింది.

తిరుపతిలోని శ్వేత కాంప్లెక్స్‌లో ఆ పండితుని నిలువెత్తు కంచు విగ్రహం ప్రతిష్ఠించింది.

అంతగా రెండు, మూడు తరాలవారిని ప్రభావితం చేసిన ఆయన తన జిల్లాలోని ముక్త్యాల రాజావారి మ్యూజియంకోసం సేకరణ చేస్తూ అనారోగ్యంతో 1950లో మరణించారు.

సాహిత్య, ఆధ్యాత్మిక రంగాలలో చిరస్థాయిగా నిలిచిపోయేలా అనేక సేవలు చేసి మంచి పేరు పొందారు ఆయన. ఇంతకీ...

*1. ఆ మహానుభావుని పేరేమిటి?*

*2. ఆయన స్వగ్రామం ఏది?*

కామెడీ కథ

# ఆషాఢం ఆఫర్




“రాజీ!” పెద్దగా కేకేసింది బామ్మ. కంప్యూటర్ ముందు కూర్చున్న నాకు ఒళ్ళు మండిపోయింది. ఆమె కేకల్ని పట్టించుకోకుండా ఫేస్‌బుక్‌లో మొహం దూర్చేశాను.

“రాజీ! ఎక్కడ వున్నావురా...?” అంటూ మళ్ళీ పిలిచింది బామ్మ.

బామ్మ నన్ను రాజీ అని పిలవడం చిర్రెత్తుకొచ్చింది. “సరిగ్గా నా పేరుపెట్టి పిలిస్తేనే నీతో మాట్లాడతాను. లేకపోతే నీకు నాకు కచ్చే!” అన్నాను, పెద్దగా నాగదిలో నుంచే హాల్లో కూర్చున్న బామ్మకు వినపడేటట్లు.

“వెర్రినాగన్నా! నువ్వు లాగు తొడుక్కోవడం చేత కాని రోజుల్నుంచి నిన్ను ‘రాజీ’ అనే పిలుస్తున్నాను... ఉదయం రైతుబజార్ దగ్గర ఆ పిల్లముందు నిన్ను రాజీ అనేసరికి నీకు రోషంవచ్చింది”అంది బామ్మ.

...‘ఆ పిల్ల’ అంటే విభవ.

ఆ అమ్మాయితో తను మాట్లాడినట్లు అమ్మా-నాన్నలకు తెలిస్తే నామీద మండిపడతారు.

## అలపర్తి రామకృష్ణ

ముందు బామ్మ నోరు మూయాలి! అమ్మా-నాన్నలకు వినపడాలనే బామ్మ ఆ పిల్ల ప్రసక్తి తెస్తూ వుంది. గదిలోనుంచి హాల్లోకి వచ్చేశాను.

“పెద్దగా అరుస్తావెందుకు? నాన్న వింటాడు. ఏం కావాలి నీకు?” అన్నాను బామ్మ పక్కన నిలబడి.

“నీ పేరు అదేకదరా! కాకపోతే మధ్యలో ఓ అక్షరం మింగేశాను” అంది బామ్మ.

బామ్మ చెప్పింది అక్షరాలా నిజమే! మా తాతపేరు రామకోటి. బామ్మపేరు జీవిత... ఇద్దరి పేర్లు వచ్చేటట్లు ‘రామోజీ’ అని నాపేరు పెట్టింది బామ్మే!

...మొగుడి పేరుపెట్టి పిలవడం ఇష్టంలేక ‘రాజీ’ అని పిలుస్తూవుంటుంది. అలా పిలవద్దని మొత్తుకున్నా వినదు. పక్కింటి ‘విభవ’ అంటే తనకిష్టమని ఇంట్లో అందరికంటే ముందే పసికట్టింది బామ్మే!

ఆ అమ్మాయి మా ఇంట్లో తిరగడం అమ్మానాన్నలకు అస్సలు ఇష్టంలేకపోయినా బామ్మే ఏదో వంకతో ఆ అమ్మాయిని పిల్చి “రెండు ఉల్లిపాయలు ఉంటే ఇవ్వు తల్లీ! ఇంట్లో నిండుకున్నాయి. మా బడుద్ధాయిని ‘మార్కెట్‌కు వెళ్ళి తీసుకురారా!’ అంటే పట్టించుకోడు. నెలకు లక్షరూపాయల ఉద్యోగం చేస్తున్నానని మిడిసిపడుతూవుంటాడు. ఒకరోజు వేసిన బట్టలు రెండో రోజు వేసుకోడు! పాటలంటే ప్రాణం! నువ్వు ఎప్పుడన్నా పెరట్లో మల్లెపందిరి దగ్గర నిలబడి కూనిరాగాలు తీస్తూవుంటే మావాడు ఒళ్ళంతా చెవులు చేసుకుని గోడపక్కన చేరి వింటూవుంటాడు!” అని విభవకు చెప్పుకుపోతూవుంటుంది బామ్మ.

ఆ అమ్మాయి వెళ్ళిపోయాక “ఉల్లిపాయల సంగతి చెప్పుకోగాని, నాగురించి ఆ అమ్మాయికి చెబుతావు ఎందుకు?” అని ఎగిరిపడేవాడు బామ్మమీద.

బామ్మ ఆ అమ్మాయిని తరచూ మా ఇంటికి పిలవడం, తన గురించి చెప్పడం మహాపసందుగా ఉన్నా! “గదిలో మావాడు లేడులే! వెళ్ళి నీకు నచ్చిన పుస్తకం తెచ్చుకో!” అంటూంటుంది, గదిలోనే నేను ఉన్నా. గదిలోకి మెలికలు తిరుగుతూ వచ్చి ఒయ్యారాలు వలకబోస్తూంటుంది విభవ.

అంతటితో ఆగదు “చొంగకారుస్తూ నిలబడకపోతే నాలుగు మాటలు ముచ్చటగా మాట్లాడొచ్చు కదా!” అంటుంది బామ్మ గది గుమ్మందగ్గర నిలబడి.

అలా బామ్మ ఆ అమ్మాయిని నా ముందు నిలబెట్టే ప్రయత్నాలు ఇష్టంకాబట్టే, బామ్మ నన్ను ఎలా

### మనస్సుకు దగ్గరైన పాత్ర

‘పెళ్ళిచూపులు’ సినిమా నాకు చాలా చాలా స్పెషల్. ఈ సినిమాలోని చిత్ర పాత్ర ఎప్పుడూ నా మనస్సుకు దగ్గరగానే వుంటుంది. ఎంతో సహజంగా ఉన్న ఈ పాత్ర ఎందరికో నచ్చింది.

ఇప్పుడు ఉత్తమ చిత్రంగా పెళ్ళిచూపులకు,ఉత్తమ నటిగా నాకు ప్రతిష్ఠాత్మక నంది అవార్డులు రావడం చాలా ఆనందంగా వుంది. మంచి పాత్ర ఇచ్చిన మా దర్శకుడికి, ఆదరించిన ప్రేక్షకులకు కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

సినిమా విడుదలయిన ఏడాదితరువాత కూడా విజయం కొనసాగడం గొప్పగా ఉంది” అంటూ ఆనందాన్ని వ్యక్తంచేసింది రీతూవర్మ.

పిలుస్తున్నా సహిస్తూ ఉండిపోతున్నాను.

"రామకోటి పుస్తకం తెచ్చిపెట్టు!" అని ఆజ్ఞాపిస్తున్నట్లు అంది బామ్మ.

కంప్యూటర్‌ముందు కూర్చున్నవాడిని పిలిచి ఆమె రోజూ రాసుకునే రామకోటి రాసుకునే నోటు పుస్తకం తెచ్చిపెట్టమని అడగడంతో చిర్రెత్తుకొచ్చింది.

"ఇప్పటిదాకా వారపత్రికలో సినిమా బొమ్మలు చూస్తూ కాలక్షేపం చేశావ్...! ఇప్పుడేమో రామకోటి రాస్తావా? రామ, శ్రీరామ అనిరాస్తూ ఆ రాములువారిని తలుచుకుంటున్నావా? మీ ఆయన్ని తలుచుకుంటున్నావా?

"సినిమావాళ్ళని తక్కువగా అంచనా వెయ్యకు! రాముడు, శ్రీకృష్ణుడు ఎలా ఉంటారో ఎవరికీ తెలియదు... నిజంగా దేవుడు ఎదురుగా నిలబడినా పట్టించుకోం. ఎన్టీఆర్ రూపంలో దేవుడు ప్రత్యక్షమైతేనే దేవుడనుకుని నమస్కారం పెడతాం!

సీతమ్మ ఎలా ఉంటుందో తెలియదు. నయనతార, అంజలీదేవి సీతమ్మ వేషంలో కన్పిస్తే కళ్ళు చెమర్చి తన్మయత్వం చెందుతాం...!" అని చెప్పుకుపోయింది బామ్మ.

"ఆ సీతమ్మ, శ్రీరాముడు ఎలా చెబితే అలా నడుచుకుంటుంది. నువ్వు తాతను మూడు చెరువుల నీళ్ళు తాగించేదానివటగదా!" చుట్ట తాగితే దగ్గరకు రానిచ్చేదానివికాదట!

తమలపాకులు తెమ్మని చింతలపూడి పంపించేదానివటకద! మొగలిపూల రేకులకోసం చీరాల పంపించేదానివట! ఆఖరికి మల్లెమొగ్గలు కూడా ఆయనచేతే కోయించేదానివట"



## ఎన్నెన్నో భాషలు

'యుద్ధం శరణం' సినిమాలో నటిస్తున్న అందాల తార రుక్షర్ చిన్నతనం నుంచి అనేక ప్రదేశాలలో తిరిగి బహుభాషలు నేర్చేసింది.

"నేను పంజాబీని. చిన్నతనంలో గోవాలో పదమూడేళ్ళు ఉన్నాను. తర్వాత బెంగళూరు వెళ్ళిపోయాం. ప్రస్తుతం తెలుగు సినిమాలు చేస్తున్నా. ఇన్నేళ్ళలో కొంకణి, కన్నడ, ఇప్పుడు తెలుగు నేర్చుకున్నాను. అన్ని భాషలు కలిపి మాట్లాడేస్తుంటా. నా బుర్రలో సకల భాషలు మేళవించివుంటాయి" అంటూ కిసుక్కున నవ్వేసింది.

"పిచ్చిమొద్దూ! మీ తాత ఆ పనులు ఎందుకు చేసేవాడో నీకు అర్థం అయివుంటే ఈపాటికి ఆ విభవ నీ ఒడిలో చేరి మోహనరాగం ఆలపించేది!" ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ అంది బామ్మ.

"తాత నీకోసం ఎదురుచూస్తూ ఉండివుంటాడు. పైలోకంలో! తొందరగా వెళ్ళు! నీ ముసలికంపుతో తలనొప్పి వస్తుంది మాకు!"

"నేను పోతే నీ పెళ్ళి విభవతో జరగదు! మీ అమ్మ ఛస్తే ఒప్పుకోదు! పేదపిల్లను కోడలిగా ఇంటికి తెచ్చుకోదు. నా మాట మీ నాన్న కాదనడు... ఎలాగోలా మీ పెళ్ళి జరిగే ఏర్పాట్లుచేస్తాను. పొమ్మంటే చెప్పు ఇప్పుడే వెళ్ళిపోతాను మీ తాతదగ్గరకు" అని అంది బామ్మ మరచెంబు చేతిలో పట్టుకుని.

"చేతిలో ఆ మరచెంబు ఎందుకే?" అని అడిగాను నవ్వుకుంటూ బామ్మని.

"పై లోకాలకు వెళ్ళేటప్పుడు దప్పికయితే నోరు తడుపుకోవడానికి గుక్కెడు నీళ్ళు కావాలి కదా!" అంది ఆమె. బామ్మ ఒడిలో చేరాను. నా తల నిమురుతూ ఉండిపోయింది.

పక్కనే ఉన్న న్యూస్‌పేపరుమీద ఆమె దృష్టి పడింది. కళ్ళజోడు సవరించుకుని మొదటి పేజీలో ఉన్న ప్రకటన చదివింది.

"ఆషాఢం ఆఫర్! ఒక చీర కొంటే మరో చీర ఉచితం! వెయ్యి రూపాయలకుపైగా కొనుగోలు చేసినవారికి గిఫ్ట్ కూపన్ ఇస్తాం! ఈ ఆషాఢంలోనే డ్రా తీస్తాం. అదృష్టవంతుడికి 'మారుతి షిఫ్ట్ డిజైర్' కారు ఉచితంగా దక్కుతుంది" రెండు మూడు సార్లు బామ్మ ఆ ప్రకటన చదివింది.

"లేరా సన్యాసి...! తొందరగా నీ మోటార్ బైక్ బయటపెట్టు! షాపింగ్‌మాల్‌కు వెళ్దాం" అని భుజం పట్టుకుని లేపింది నన్ను.

"నిన్ను బైక్‌మీద ఎక్కించుకుని తిరిగితే అందరూ నవ్వుతారు! నీకేంకావాలో చెప్పు! నేను వెళ్ళి తీసుకువస్తాను" అన్నాను విసుగ్గా.

"నన్ను బైక్‌మీద తీసుకువెళ్ళే ఇబ్బంది తప్పిద్దామనే ప్రయత్నంలోనే ఉన్నాను. ఏడుకొండలవాడు దయతలిస్తే కారులో తిప్పుదువుగాని నన్ను!" అంది బామ్మ కళ్ళుమూసుకుని పరవశంతో.



"నిన్నా? కారులోనా? మనకు కారు లేదుగా!"

"రైతుబజార్ నుంచి కూరగాయల సంచులు మోసుకురావాలంటే భుజాలు పీకుతున్నాయిరా! ఇక కారులో దర్జాగా కూరగాయలు తెచ్చుకోవచ్చు!" అంది బామ్మ పర్సులో క్రెడిట్‌కార్డు పెట్టుకుంటూ.

నల్లకళ్ళజోడు పెట్టుకుని నాకంటే ముందే ఇంట్లో నుంచి బయటకువచ్చింది. టీచర్‌గా పనిచేసి ఎప్పుడో రిటైరయ్యింది. నెలనెలా పెన్షన్ వస్తుందామెకు.

"నీపేరుమీద ఉన్న చింతలపూడిలోని ఎకరం పొలం అమ్మేస్తావా ఏమిటి? 'కారు, కారు అంటూ' ఎంతో ఉబలాటపడుతున్నావ్" అన్నాను బామ్మను బైక్‌మీద ఎక్కించుకుని.

"ఆ పొలం మావాళ్ళు నాకు ఇచ్చింది. రేపు నీకు కూతురు పుడితే నా పేరుపెట్టుకో! ఆ ఎకరం పొలం నీ కూతురికి రాసిస్తాను..." అని అంది దర్జాగా కాళ్ళు ఊపుకుంటూ.

"అటూ ఇటూ కదలకే! కిందపడి నడుం ఇరగ్గొట్టుకుంటావ్" అన్నాను భయపడుతూ.

రెండు మూడుసార్లు బామ్మ వెనుక కూర్చున్నప్పుడు పడటంకూడా జరిగింది. రుబ్బుడుపొత్రంలా ఉన్న ఆమెకేం దెబ్బలు తగల్లేదు గాని, నా కాళ్ళు, మోచేతులకే దెబ్బలు తగిలాయి.

సాఫ్ట్‌వేర్ ఉద్యోగం చేస్తున్న నేను బామ్మను బైక్ మీద ఎక్కించుకుని తిరగడం ఏమిటి? అన్ని ఇబ్బందులు, ఫ్రెండ్స్ నామీద వేసే జోక్స్ భరిస్తున్నానంటే కారణం విభవను దక్కించుకోవడానికే!

## నాకూ ఎదురయ్యాయి

ఇటీవల కాలంలో చాలామంది తారలు గతంలో తామెదుర్కొన్న లైంగిక వేధింపుల గురించి తారలు సామాజిక మాధ్యమంలో గొంతువిప్పి చెప్పడం ఇటీవల పరిపాటి అయిపోయింది.

హాటెస్ట్ తార అయిన రాయ్‌లక్ష్మి కూడా ఇదే విషయాన్ని చెప్పింది.

"ఏ విధమయిన సినీ నేపథ్యం లేకుండా చిత్ర పరిశ్రమలో తొలి అవకాశం పొందే తారలకు సాధారణంగా ఇటువంటి చేదు అనుభవాలు ఎదురవుతుంటాయి. నాకూ ఇటువంటి అనుభవం ఎదురైంది. నేనవ్పులు ఒప్పుకోలేదు" అంటూ ఓపెన్‌గా చెప్పిన మాటలు వైరల్ అయిపోయాయి.



షాపింగ్‌మాల్‌కు చేరుకున్నాం. ఎంట్రెన్స్ దగ్గర ముందువైపు ఆవరణలో నిలబెట్టిన కారుమీద బామ్మ దృష్టిపడింది. కొత్తకారు. గులాబీరంగు రిబ్బన్ సింగారించుకుని మెరిసిపోతూ ఉంది.

కారు దగ్గరకు వెళ్ళి ఆప్యాయంగా నిమిరి మూడు ప్రదక్షిణలు చేసింది బామ్మ.

బ్యాగులోని వెండిబరిణె తీసి కుంకుమబొట్టు కారు బాయినెట్‌కు రుద్దింది. ఎంట్రెన్స్ దగ్గర నిలబడ్డ సెక్యూరిటీ గార్డు కళ్ళల్లో ఆ దృశ్యం పడింది. పరుగున బామ్మదగ్గరకు వచ్చి నెట్టివేశాడు.

"చూస్తే పెద్దదానివి...! ఏమిటి పిల్లచేష్టలు! చేతులతో నిమరడం ఏమిటి? బొట్లు పెట్టడం ఏమిటి? కారు నీ బాబుదనుకున్నావా?" గద్దిస్తూ అరిచాడు సెక్యూరిటీ గార్డు.

బామ్మ తక్కువేం తినలేదు.

సెక్యూరిటీ గార్డును వెనక్కుతోసింది.

"కారు నీ బాబుది కాదుగదా! చేతుల్తో తడమగానే అరిగిపోతుందా కారు! కుంకుమబొట్టు పెడితే శుభప్రదమే గదా! నీకు నచ్చకపోతే కారు తుడుచుకో! అంతేగాని పెద్దదాన్నని చూడకుండా నన్ను నెట్టివేస్తావా? కిందపడి నా వెన్నుపూస విరిగితే నీమీద కేసువేసి నీ ఇల్లు వేలం వేయిస్తాను.

మీ సేఠ్‌కు చెప్పి నిన్ను ఉద్యోగంలోనుంచి తీయించేస్తాను. చదువురాని దద్దమ్మను అనుకున్నావా? ఆ రోజుల్లో ఉత్తమ ఉపాధ్యాయురాలు అవార్డు జిల్లా స్థాయిలో పొందాను. నిన్ను డిస్మిస్ చేయిస్తాను... ఏమనుకున్నావో...?" పెద్దగా అరుస్తూ చిందులు తొక్కింది బామ్మ.

అక్కడ చుట్టూ చేరినవాళ్ళు సెక్యూరిటీ గార్డును మందలించారు.

బామ్మ రెక్క పట్టుకుని షాపింగ్‌మాల్‌లోకి తీసుకువెళ్ళాను. చీరలు కొన్నాక షాపువాళ్ళు ఇచ్చిన గిఫ్ట్ కూపన్ భద్రంగా పర్సులో పెట్టుకుంది బామ్మ. బయటకు వస్తూ సెక్యూరిటీ గార్డు చేతిలో యాభై రూపాయల నోటు ఉంచింది.

"పిచ్చిసన్యాసి నేను తిట్టానని బిక్కమొహం వేసుకుని బొమ్మలా నిలబడివున్నావ్. ఇంట్లో పిల్లలకు మిఠాయి కొనుక్కుని వెళ్ళు!

రేపు లాటరీలో కారు మాకే వచ్చిందనుకో కొత్త రెండు వేలరూపాయల నోటు నీ చేతిలో ఉంచుతాను నా గిఫ్ట్‌గా!" అంది ఆమె.

బామ్మకు సెల్యూట్ చేశాడు సెక్యూరిటీ గార్డు.

పదిరోజులతరువాత లాటరీ రిజల్ట్ వచ్చేసింది. పర్సులో నుంచి గిఫ్ట్ కూపన్ తీసి అందులో ఉన్న నెంబరు, పేపరులో పడ్డ నెంబరుని మార్చి మార్చి చూసుకుంది బామ్మ.

లాటరీ తగల్లేదు. కారు బామ్మకు రాలేదు. గిఫ్ట్ కూపన్ చింపేశాను.

"కష్టపడి సంపాదించిన డబ్బుతో కారు కొనుక్కోవాలిగాని, లాటరీలో కారు ఉచితంగా వస్తుందని వెర్రి భ్రమలు పెట్టుకోకూడదు పిచ్చి భద్రమ్మా!" అన్నాను బామ్మతో.



ఎవరితోనైనా చర్చలకు సిద్ధం... కాదని తుపాకీ పోరాటం చేస్తామంటే వారిని ఖతం చేస్తాం. -సర్బానంద్ సోనోవాల్
అస్సాం సి.ఎమ్.

"రాజీ! ఎందుకనో ఆ కారు మనదేననిపించింది రా!" అంది బామ్మ.

"సర్లే! ఆ కారు గొడవ వదిలెయ్యి! నా జీతం డబ్బులతో సంవత్సరం తిరక్కముందే కారు కొనేస్తాను" అన్నాను బామ్మను ఓదార్చుతూ.

ఇంటిముందు కారు ఆగిన శబ్దం విన్పించింది.

అందరికంటే ముందు బామ్మ వీధి గేటుదగ్గరకు వెళ్ళింది. కొత్త కారును చూసి ఆశ్చర్యపడింది.

షాపింగ్‌మాల్ యజమాని, అతనిపక్కన వినయంగా నిలబడ్డ సెక్యూరిటీగార్డు కన్పించారు. ఆ సెక్యూరిటీగార్డుతోనే బామ్మ పోట్లాట పెట్టుకుంది.

"బామ్మగారూ! కారు మీకే దక్కింది. మీకు అప్పగించడానికి వచ్చాం!" అన్నాడు సెక్యూరిటీ గార్డు.

బామ్మ వెనుక నిలబడ్డ నాకు మరింత ఆశ్చర్యమేసింది.

"గిఫ్ట్ కూపన్ నెంబరు సరిగ్గా చూశావా? మనకే వచ్చిందట! సరిగ్గా నెంబరు చూడకుండా ఆ కూపన్ చించిపడేశావ్? ఇప్పుడు ఆ కూపన్ చూపిస్తేనే కారు ఇస్తామని కండిషన్ పెడితే?" అని నావైపు తిరిగి అడిగింది బామ్మ.

"సరిగ్గానే చూశాను... హండ్రెడ్ పర్సెంట్ మనకు ప్రైజ్ తగల్లేదు" అన్నాను.

"మీ అమ్మాయి వచ్చి గిఫ్ట్ కూపన్ మాకు హ్యాండోవర్ చేసింది. కారు కీస్ తీసుకుని చెక్ చేసుకోండి! మీ విభవను ఒక్కసారి పిలవండి. కారు తీసుకున్నట్లు ఈ ఫారమ్‌మీద సంతకం పెట్టాలి!" అని అన్నాడు షాపింగ్‌మాల్ ఓనర్.

"విభవది పక్క ఇల్లండీ! మీరు పొరపాటున మా ఇంటికి వచ్చారు" అన్నాను.

"కూపన్‌లో రాసిన ఇంటి అడ్రస్ ఇదేనండి! నేనేం పొరపాటుపడలేదు!" అన్నాడు అతను.

పక్కింటికి వెళ్ళి విభవను పిలిచింది బామ్మ.

"మంచి చీర కొనుక్కోమని రెండువేలు ఇచ్చారు మీరు... గిఫ్ట్ కూపన్‌మీద మీ ఇంటి అడ్రస్ నేనే రాశాను... డబ్బు మీదేకాబట్టి కారుకూడా మీదే!" అంది విభవ.

విభవ బుగ్గలు నిమిరింది బామ్మ "శ్రావణ లక్ష్మిలా ఉన్నావు" అంటూ.

"ఆ అమ్మాయిని చీర కొనుక్కోమని మీరెందుకు డబ్బులు ఇచ్చారు?" అడిగింది అమ్మ అత్తగారిని.

"పెళ్ళి చూపులకు వెళ్ళినప్పుడు పిల్లనచ్చితే నగో, కొత్త చీరో ప్రెజెంట్ చేస్తాము... ఆ అమ్మాయి నాకు నచ్చింది.. మన రాజీగాడికి కూడా ఆ అమ్మాయి అంటే ప్రాణం! 'మా రాజీగాడి పెళ్ళాం' అని అందరికీ చెప్పేశాను" అంది బామ్మ.

'తాంబూలాలు ఇచ్చేశాను తన్నుకు చావండి...' అన్నట్లు అంది బామ్మ మా అమ్మవైపు చూస్తూ.

అమ్మానాన్నలు మా పెళ్ళికి ఆమోద ముద్ర వేశారు. "బాపురే! బామ్మ!" అనిపించింది నాకు.





సీరియల్

# అలజడి

## పుట్టగంటి గోపీకృష్ణ

ఇంతలో ఒక పాతికేళ్ళ యువతీ, పదిహేనేళ్ళ యువకుడూ వీళ్ళు కూర్చున్న టేబుల్‌దగ్గరకు వచ్చారు. "నమస్కారం రమేష్ సార్" అంటూ వచ్చి ఆ అమ్మాయి రమేష్ కాళ్ళమీద పడబోయింది.

"ఏయ్! ఏయ్!!.... ఎవరు నువ్వు..." కంగారుగా అన్నాడు రమేష్.

"నేను మీకు ఎలా గుర్తుంటాను సార్! మీవలన సహాయంపొందిన ఎంతో మందిలో నేను ఒకరిని" అంది ఆ అమ్మాయి.

"ఏం సహాయం చేశాడు?" అడిగింది సౌందర్య. ఆ కంఠంలో అప్పుడే ఏదో అనుమానం ధ్వనించింది. ఇంకా కంగారుపడ్డాడు రమేష్.

ఈ అమ్మాయెవరో పానకంలో పుడకలా వచ్చి తను ఇప్పటిదాకా పడ్డ కష్టాన్ని చెడగొడుతుందా ఏంటి అన్న దుగ్ధతో, "అసలు నువ్వెవరో నాకు తెలియ దంటుంటే..." అని ఏదో చెప్పబోయాడు.

"ఆ అమ్మాయిని మాట్లాడనివ్వు రమేష్. నువ్వెందుకు అడ్డుకోవటం" అని అధికారయుతంగా అని, "చెప్పు! ఏం సహాయం చేశాడు? ఎప్పుడు చేశాడు? ఎందుకు చేశాడు?" అని లా పాయింట్లు తీసింది.

"మా తల్లిదండ్రులు చనిపోయి ఫీజు కట్టటానికి స్థోమత లేక అల్లాడుతున్న నాకు, ఫీజు కట్టిన మహానుభావుడమ్మా ఈయన. ఆయన పుణ్యాన ఇంజినీరింగ్ పూర్తిచేసి ఏదో చిన్న ఉద్యోగం వెతుక్కోబోతుంటే ఆపి, నన్ను చదువుకోసం ఫారిన్ పంపిన దేవుడమ్మా ఈయన..." అంది ఆ అమ్మాయి.

ఒకసారి అటూ ఇటూ చూశాడు రమేష్.. ఆ అమ్మాయి పొగుడుతోంది తననేనా, ఇంక ఎవరినన్నానా? అని... తను ఆ పనులన్నీ ఎప్పుడు చేశాడో అతనికే అర్థంకావటంలేదు.

"ఫారిన్ పంపారా?"

"నేనూ అదేనన్నానమ్మా! ఏదో చదువుచెప్పించారు. ఇక నా బతుకు నేను బతుకుతానన్నాను. ఆయన వింటేనా? ఆయన హామీతో బ్యాంకు 'లోన్' ఇప్పించారు. ఇప్పుడు నేను నా కాళ్ళమీద నిలబడ్డాను... కానీ ఆయన కోరిక తీర్చలేకపోయాను..."

గాభరాగా కుర్చీలో నుండి లేవబోయాడు రమేష్. ఇంతలోనే అతనికంటే ముందు సౌందర్య కల్పించుకుంది.

"ఆయన కోరిక తీర్చలేకపోయారా? అంటే" భృకుటి ముడివేసి అడిగింది.

"మీరు అపార్థం చేసుకోకండి. ఆయన కోరింది ఒకటే! నన్ను మరో పేద విద్యార్థికి సహాయము చేయమన్నారు..." అని చెప్పింది ఆ అమ్మాయి.

'అమ్మయ్య' అనుకున్నాడు రమేష్.

"అదే నేను చేయలేకపోయాను. తప్పు తెలుసుకునేటప్పటికి ఆలస్యం అయిపోయింది. ఆయన చెడు అలవాట్లకి బానిసయ్యారు"



### జరిగిన కథ (14)

కారులో వున్న వ్యాఘ్రం పరుగులు పెడతాడు. మందుకొట్టి ఎదురైన మురారీని చూసి మండిపడతాడు వినాయకరావు. 'తాతయ్యను అబద్ధాలతో మోసం చేస్తావా' అంటూ అడ్డం తిరుగుతుంది ఈషిక.

మృదుల, మురారీని ఇష్టపడుతుంది. టానిక్ అనుకుని మందు కొట్టానని మురారి, తన తాత వరసిద్ధితో చెబుతాడు. ఆదిత్య, ఈషిక ఇద్దరూ ఓ కాఫీషాపులో కలుస్తారు.

నువ్వు ప్రేమించిన అమ్మాయి పేరయినా చెప్పు అంటూ కొడుకు ఆదిత్యకి ఫోన్ చేస్తాడు రంగారావ్. ఈషిక, రంగారావు మాట్లాడుకుంటారు. నువ్వు ప్రేమించిన అమ్మాయివద్ద సువాసనలు రావటం ఏంటి అని నిలదీస్తుంది ఈషిక ఆదిత్యను.

'ఈషిక తన ప్రేమను ఒప్పుకుంది' అని రమేష్‌కు ముద్దుపెట్టి మరీ చెబుతాడు ఆదిత్య సౌందర్యను కలసిన వైనమంతా చెబుతాడు రమేష్. ఇక తరువాత జరిగేది చదవండి.

అంటూ చెప్పుకుపోతోంది ఆ అమ్మాయి... మళ్ళీ ఉలిక్కిపడ్డాడు రమేష్. తన చెడు అలవాట్లకి బానిస అవటమేమిటో అతనికి అర్థంకాలేదు.

"ఏయ్ అమ్మాయ్! ఏం మాట్లాడుతున్నావ్?" అని అనబోయేంతలో అదే మాట సౌందర్య అడిగింది, "ఏమిటి తనకున్న చెడు అలవాట్లు?" అని.

"ఇంతకుముందు పైసాపైసా కూడబెట్టి ఆ డబ్బును పేదపిల్లలకు చదువు చెప్పించటానికి ఉపయోగించేవారు. వారు అభివృద్ధిచెందికూడా ఆయన కోరినట్లు వేరే పేదవారికి సహాయంచెయ్యటంలేదని కోపంవచ్చిందేమో, తన పొదుపు ఉద్యమానికి కామాపెట్టి చేతికి చిల్లుపడినట్లు ఖర్చుపెట్టటం మొదలుపెట్టారు"

రమేష్. సౌందర్య ఇద్దరూ నిట్టూర్చారు.

ఆ అమ్మాయిమాత్రం తన ఉపన్యాసం కొనసాగిస్తోంది. "...ఇప్పుడు నేనూ, నాతోపాటు మీ సహాయం పొందిన అనేకమందిమి మా తప్పు తెల్సుకున్నాం. నా వరకూ నేను ఇదిగో ఈ అబ్బాయికి ఫీజుకట్టి చదువు చెప్పించే బాధ్యత తీసుకున్నాను. ఇప్పటికయినా మమ్మల్ని క్షమించి... మీరు ఈ డబ్బు ఖర్చుపెట్టే ఉద్యమాన్ని మానండి. ఇలా అనవసరపు ఖర్చులు పెట్టకండి..." చేతితో టేబుల్‌మీద ఉన్న తిండిపదార్థాలను చూపిస్తూ అంది.

కొద్దికొద్దిగా అర్థమవుతోంది రమేష్‌కి ఇదంతా ఆదిత్య చేసిన ఏర్పాట్లు అని. తనుకూడా సంభాషణకి ఇంకాస్త మసాలా జోడించి, "ఎందుకు మారాలి? ఎవరికోసం నా జల్సాలు మానుకుని డబ్బు ఆదాచేసి ఖర్చు చేస్తున్నానో వారికే నా ఆదర్శాలమీద విశ్వాసం లేనప్పుడు ఎందుకు మారాలి?" సినిమాలో డైలాగ్ చెప్పినట్లు అన్నాడు రమేష్.

"మీరైనా చెప్పండి మేడమ్!... అవసరానికి మాల్‌కి వచ్చే అదొక రకం. ఇలా అవసరం ఉన్నా లేకపోయినా రోజూ వచ్చి ఇష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టటం మంచి పద్ధతికాదని మీరైనా చెప్పండి"

గొంతులో వెలక్కాయ పడటం అంటే ఏమిటో తెలిసింది సౌందర్యకి. "నేను కూడా రోజూ అవసరం





## బాలల సినిమా తీస్తా

సినిమాల్లో అవకాశాలు అరకొరే అయినప్పటికీ ఛాన్స్ రావాలే కాని, చిన్నపిల్లలకు సంబంధించిన సినిమా తీస్తానంటున్నది మన్నారాచోప్రా.

బాలల చిత్రోత్సవాల్లో సినిమాలు చూసి టెంప్ట్ అయిపోతున్నదట. "నాకు చిన్నపిల్లలు అంటే చాలా ఇష్టం. వాళ్ళతో గడపడం మరీ ఇష్టం. మా అక్క ప్రియాంకచోప్రా నిర్మాతగా మారి సినిమాలు తీస్తున్నది. నాక్కూడా అవకాశం వస్తే తప్పకుండా బాలల సినిమా తీస్తా" అంటున్నది మన్నారాచోప్రా.




లేకపోయినా మాల్‌కి వస్తానని" చెప్పలేకపోయింది. అలా అని నువ్వుచేస్తోంది తప్పని రమేష్‌కి చెప్పలేదు. అందుకే, "చూడమ్మా! ఆయనకి నేను సర్దిచెప్తాను. నువ్వెళ్ళిరా!..." అంది సౌందర్య.

ఆ అమ్మాయి మరోసారి రమేష్ కాళ్ళకి నమస్కరించటానికి ప్రయత్నించి కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే వెళ్ళిపోయింది. ఆ తరువాత రమేష్, సౌందర్య ఇద్దరూ కాసేపు మవునంగా ఉండిపోయారు. చివరికి సౌందర్యే మాట్లాడింది-

"నిజంగా ఇలా రోజూ అనవసరపు ఖర్చులు పెట్టే బదులు ఆ డబ్బు మంచి పనులకి వాడితే ఎంత బాగుంటుందో కదా!" అంది.

"ఆ అమ్మాయి చెప్పినతరువాత మనం తప్పు చేస్తున్నామేమో అనిపిస్తోంది" అన్నాడు రమేష్ 'మనం' అన్న మాటను మరింత ఒత్తిపలుకుతూ.

మరికాసేపటి తరువాత వారిద్దరూ మరెప్పుడూ డబ్బు వృధాఖర్చుచేయకూడదన్న కృతనిశ్చయానికి వచ్చి అక్కడనుండి వెళ్ళిపోయారు. ఫ్లాష్ బ్యాక్ చెప్పటం ముగించాడు రమేష్.

"ఆ అమ్మాయెవరో కానీ సూపర్ యాక్టింగ్ బాసూ..." అన్నాడు రమేష్.

"ఆ అమ్మాయా? ఆవిడ ప్రొఫెషనల్ యాక్టర్.నాకు సహాయంచేస్తుంటుంది"

"సూపర్ డైలాగులు బాసూ! సౌందర్య ఫ్లాట్ అయిపోయిందనుకో..." అన్నాడు రమేష్. "నీ విషయంలో మన ప్లాన్ సక్సెస్ మీద సక్సెస్ అవుతోంది. అన్ని కేసులూ ఇంత తేలిగ్గా తేలిపోతే ఎంత బాగుంటుంది?"

"చెప్పటం అప్పుడే అయిపోలేదు. కథ ఇంకా ముందుకు వెళ్ళింది"

"ఎంత ముందుకెళ్ళిందేమిటి?"

"మాల్‌నుండి బయటకెళ్ళిన ఇద్దరం సౌందర్య ఫ్లాటుకి వెళ్ళాం..."

"మైగాడ్! ఏంట్రా నువ్వు మాట్లాడేది? ఇంత ఫాస్ట్ ప్రేమని ఎక్కడా చూడలేదు... ఆ అమ్మాయి ఫ్లాటుకి వెళ్ళటం ఏమిటి?"

"షటప్! ఏవేవో ఊహించుకోమాకు. ఆ ఫ్లాటులో మరో ముగ్గురు అమ్మాయిలుకూడా ఉన్నారు"

"సరే!... అక్కడ ఏం చేశారు?"

"మాట్లాడుకున్నాం..."

"ఏం మాట్లాడుకున్నారు?"

"మాల్‌కి వెళ్ళకుండా ఉండలేని అలవాటు ఎలా వదుల్చుకోవాలా... అని మాట్లాడుకున్నాం"

"ఆ తరువాత?"

"అక్కడే ఉంది ట్విస్ట్. ఆ తరువాత అక్కడనుండి నేను వచ్చేశానా! రాత్రి నిద్రపోయి లేచేటప్పటికి తలుపు చప్పుడయింది. ఇంత ఉదయాన్నే వచ్చేది ఎవరా?.... అని ఆశ్చర్యపోతూ తలుపు తెరిచాను"

"ఎవరొచ్చారు? పోలీసులా?..."

"కాదు... సౌందర్య"

"ఏంటి? అంత ఉదయాన్నే సౌందర్య నీ రూముకు వచ్చిందా? ఎందుకు?..."

"రాత్రంతా నిద్రపోదామని ప్రయత్నించి నిద్ర పోలేకపోయిందంట" అన్నాడు రమేష్.

"అయితే నీ దగ్గరకు రావటం ఎందుకు? ఏదన్నా డాక్టర్ దగ్గరకు వెళ్ళాలికానీ?" ఆదిత్య వ్యంగ్యాన్ని పట్టించుకోకుండా కొనసాగించాడు రమేష్.

"నిద్రపట్టింది రోగమొచ్చి కాదు, ప్రేమపుట్టి. ఇక ఆగలేక ఆ విషయం ఇంట్లో కూడా చెప్పిందంట. వాళ్ళు అర్జంటుగా నన్ను తీసుకుని రమ్మన్నారంట. ఈ రాత్రికే ప్రయాణం. నాకు ఏం చెయ్యాలో అర్థం కావటంలేదు" అంది.

"ఇందులో అంత ఆలోచించేదేముంది?వెళ్ళూ"

"ఒక్కడినే వెళ్ళాలంటే భయమేస్తోంది. నాకు తోడు నువ్వుకూడా రాకూడదూ?"

"ఇక్కడ నా పనులు నాకు ఉన్నాయి. అయినా రేపు పెళ్ళయ్యాక శోభనానికి కూడా తోడు రమ్మంటావా? నాకు కుదరదు, నువ్వు వెళ్ళిరా!..." అంటూ అయిష్టంగా లేచాడు రమేష్. "ఇంతకీ ఏ ఊరు వెళుతున్నారు?" అడిగాడు ఆదిత్య.

"నక్కలదొడ్డి"

"ఏమన్నావ్?" గావుకేకపెట్టి అడిగాడు ఆదిత్య.

"ఎందుకంత ఆశ్చర్యం 'నక్కలదొడ్డి' అన్నాను"

"అక్కడెవరున్నారు ఆ అమ్మాయికి?"

"ఎవరుండేదేమిటి? ఆ అమ్మాయిది అదే ఊరు. వాళ్ళ అమ్మానాన్నా అక్కడే ఉంటారంట"అన్నాడు.

"వాళ్ళ అమ్మా-నాన్నా పేర్లు తెల్సా?"

"తెలియదు కానీ, ఆ అమ్మాయి తాత పేరు వరసిద్ది. అన్నయ్య పేరు మురారి"

"సౌందర్య మురారి చెల్లెలా...?" ఎటో చూస్తూ అన్నాడు ఆదిత్య.

"నీకు మురారి తెలుసా?"

"తెలుసు. నేను ప్రేమించిన అమ్మాయి మాజీ ప్రేమికుడు" అన్నాడు ఆదిత్య.

"వాళ్ళు కూడా నక్కలదొడ్డి వస్తున్నారు"

"పోనీ, పోనీ పోతే పోనీ! సతుల్, సుతుల్, హితుల్ పోనీ, పోతే పోనీ..."

"ఏంట్రా! నీ పిచ్చి ఆనందం"

"ఆ మురారిగాడే నాకూ ఈషికకీ మధ్య అడ్డు. ఇప్పుడు వాడు నక్కలదొడ్డికి వెళ్ళిపోతున్నాడంటే ఇకనాకూ ఈషికకీమధ్య అడ్డు ఎవరూ ఉండరు"

"నీ ప్రియురాలు పేరేంటన్నావ్?"

"ఈషిక..."

"నీ బొంద నువ్వనుకుంటున్నట్లు నీ రొట్టె విరిగి నేతిలో పడలేదు. మురుగ్గుంటలో పడింది. మురారి, వరసిద్దితోపాటు ఈషిక కూడా ఆ ఊరుకొస్తోంది"

"ఇంపాజిబుల్..."

"నీ ఖర్మ... నేను వెళుతున్నాను. సూట్‌కేస్ సర్దుకోవాలి" అని వెళ్ళిపోయాడు రమేష్.

లోకం అంతా చీకట్లు కమ్ముకున్నట్లయింది ఆదిత్యకి. అంత కష్టపడి మురారికి లేని తాగుడు అలవాటున్నట్లు నిరూపించినా వినాయకరావు ఎలా మురారిని నమ్మాడో అతనికి అర్థంకావటంలేదు.

పక్కగదిలోని వ్యాఘ్రం బృందం ఈ సంభాషణ అంతా యథాప్రకారంచాటుగా విన్నట్లు వున్నారు. వ్యాఘ్రం ఆనందాన్ని ఆపుకోలేక శబ్దం పైకి రాకుండా నోటిని రెండు చేతులతో అదుముకుని మరీ



రాహుల్‌గాంధీలో వచ్చిన మార్పును ప్రజలు గుర్తించి నేడు ఆయన చెపుతున్నదానిని వింటున్నారు.

-సంజయ్‌రౌత్, శివసేన ఎమ్.పి.

**ఇతరులకంటే మెరుగ్గా వుండాలనుకోవడం కాదు. ఎప్పుడూ నీకంటే నువ్వు మెరుగ్గా వుండటానికి ప్రయత్నించు.**

నవ్వుతున్న శబ్దంవద్దన్నా డాల్బీ సిస్టమ్ పెట్టినట్లు రూమంతా ప్రతిధ్వనిస్తోంది. ఆ నవ్వు వినపడకుండా ఉండటానికి టీ.వీ ఆన్ చేశారు పక్కరూములో.

"నీ గూడు చెదిరింది, నీ గుండెపగిలింది, ఓ చిట్టిపావురమా ఎవరు కొట్టారు, ఎవరు కొట్టారు... నిన్నెవరు కొట్టారు" అన్న పాట టీవీలోనుండి వస్తోంది.

ఆదిత్య విచారంతో ఏంజరిగిందో తెల్సుకోవటానికి ఈషికకి ఫోన్ చేద్దామనుకుంటుంటే తనే ఫోన్ చేసింది.

"హలో" నీరసంగా అన్నాడు ఆదిత్య.



**దేశం మొత్తంమీద గుజరాత్‌లోనే ఎక్కువ అవినీతి వుంది... ఈ విషయం వ్యాపారస్తులు నాకు చెప్పారు.**

-రాహుల్‌గాంధీ, కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు

"ఏంటిఏదో పాట వినబడుతోంది?" అడిగింది ఈషిక.

"సిట్యుయేషనల్ సాంగ్..."

"మనము కలుసుకున్న తరువాత ఇక్కడ సంఘటనలు అత్యంత వేగంగా జరిగాయి"

"వాటి వివరం తెలియదుకానీ, ఎండ్ రిజల్ట్ తెలిసింది. నువ్వు నక్కలదొడ్డికి వెళుతున్నావటకదా!..."

"నువ్వు సూపర్ ఆదిత్యా... నేను చెప్పకముందే వివరాలన్నీ నీకు తెలిసిపోతున్నాయి"

"ఇంతకీ ఏమిటీ సడన్ ఛేంజ్? మురారి తాగుడు ప్రహసనం చూశాక కూడా మీ తాతయ్య మళ్ళీ ఇలా మొదటికి ఎలా వచ్చాడు?"

"వివరంగా చెప్తాను విను" తనింట్లో ఏం జరిగిందో చెప్పసాగింది ఈషిక.

ఆదిత్యతో కలిసిన ఆనందంతో 'నథింగ్ కంపేర్స్ టు యూ...' అన్న పాట హమ్‌చేస్తూ ఇంట్లో అడుగుపెట్టిన ఈషిక షాక్ కొట్టినట్లు గుమ్మంలోనే ఆగిపోయింది. బిగ్ బడ్జెట్ ఫ్యామిలీ సినిమాలో పెళ్ళి కుదుర్చుకునే సీనులో మాదిరిగా గుంపుగా ఉన్నారు, ఇంటి నిండా మనుషులు.

"ఏంటమ్మా! అక్కడే ఆగిపోయావ్. లోపలకిరా!!" అన్నాడు వినాయకరావు.

"ఇంతమందిని ఒక్కసారి చూసి ఆ అమ్మాయి కంగారుపడుతున్నట్లుంది' అన్నాడు వరసిద్ధి. అందరూ నవ్వారు.

లోపలికి నడిచి అక్కడ ఉన్నవారందరినీ ఒకసారి చూసింది ఈషిక.

అక్కడ రెండు భారీ కుర్చీల్లో వినాయకరావు, వరసిద్ధి కూర్చునివున్నారు. వారికి ఎదురుగా ఒక చిన్న కుర్చీలో వ్యాఘ్రం కూర్చుని ఉన్నాడు.

ముగ్గురు కూర్చునే సోఫాలో రెండు సీట్లు ఆక్రమించి ఉంది భ్రమరం.

మరోపక్క బ్రహ్మాం అదే సోఫాలో మిగిలిన చోటులో ఇరుక్కుని కూర్చుని వున్నాడు. హాలునుండి కాస్త ఎడంగా డైనింగ్ టేబుల్‌దగ్గర ఉన్న కుర్చీల్లో ఒక దాంట్లో కూర్చునివున్నాడు మురారి.

ఈషిక రావటంచూసి నోట్లో ఉన్నది నమలకుండా బుగ్గల్లోకి తోయటంతో అవి పొంగి కాస్త డిఫరెంట్‌గా కనపడుతున్నాడు. 'ఏమిటి ఇదంతా?' అన్నట్లు చూసింది ఈషిక తన తాతవైపు.

"మనకి తెలియని సంగతులు చాలా ఉన్నాయమ్మా! నిన్న మురారి తాగాడని అనుకున్నాం కదా! అది అంతా నిజం కాదట. ఎవరో ఆడిన డ్రామాలో పావుగా మారాడట" చెప్పాడు వినాయకరావు.

"అలా అని మీకెవరు చెప్పారు?" కోపంగా అడిగింది ఈషిక.

"ఎవరో చెబితే నమ్మేవాడిని కాదు.

# చిలిపి



ఔదార్యం అంటే ఏమిటి?
బస్సులో అమ్మాయికి
అబ్బాయి లేచి సీటివ్వడం.

ఇందాకే కదా జీర్ణంకావటం
లేదంటే మాత్రలు ఇచ్చాను! మళ్ళీ
ఎందుకు వచ్చావ్!
మీరు ఇచ్చిన మాత్రలు కూడా
జీర్ణం కావటంలేదు డాక్టర్!

కన్యాశుల్కం అనగా?
బ్రహ్మచారియొక్క భార్య.

వార్తలు చదువుతూ రేడియోలో
మధ్యలో "వార్తలు వింటున్నారు"
అని అంటారెందుకు?
అవి నిజం అనుకుంటారేమోనని.

ఏ రోజుల్లో పొగడ్తలు ఇబ్బందికరంగా
ఉంటాయి...?
నెలాఖరు రోజుల్లో.

లంచం తీసుకోకుండా
పనిచేసేది ఎవరు?
సూర్యుడు, భూమి, చంద్రుడు.

నీ పాపపుణ్యాలకోసం
తల బద్దలుకొట్టుకునేది ఏది?
కొబ్బరికాయ.

గమ్మత్తు అంటే?
దేవుడు నైవేద్యం తినడం.

మీది స్వీట్ హోమా, ఎలా?
మావారిది చక్కెర వ్యాపారం.
మా ఇంటినిండా స్టాకే.

చిలకా గోరింకల్లా ఉండేవి ఏమిటి?
ప్రశ్న జవాబు.

పేరులో ఏముంది...?
పేరులో 'నేము'ంది.

దాన్నంతా చేయించినవాళ్ళే చెప్పారు. ముందు నువ్వు కూర్చో! నీకు అర్థమయ్యేట్లు చెపుతాను..." అని అన్నాడు వినాయకరావు.

కోపంతో ఒళ్ళు మండిపోతుంటే ఏమనాలో తెలియక దొరికిన ఒక కుర్చీలో కూర్చుండిపోయింది.

"ఆయన పేరు వ్యాఘ్రం. 'ఇఈ' కంపెనీ డైరెక్టర్. ఆ కంపెనీ చేసే పనేమిటో తెలుసా ప్రేమికుల్ని కలపటం. అలాంటిదే మన సిటీలో ఇంకో కంపెనీ కూడా ఉంది. దానిపేరు 'అఆ'. ఏ మాత్రం నైతికత లేని కంపెనీ అది.

జంటలను విడగొట్టటమే దాని పని. ఒకప్పుడు ఈ రెండు కంపెనీలూ కలిసే ఉండేయంట. దాని ఆగడాలు నచ్చక వీళ్ళే విడిపోయి వేరే కంపెనీ పెట్టుకున్నారంట. దానికి ఉదాహరణ ఆ కంపెనీ నుండి విడిపోయి వచ్చి ఇక్కడ చేరిన స్టాఫ్ చెప్పిన మాటలు. ఏమయ్యా? నేను చెప్పింది నిజమేనా?" బ్రహ్మంవైపు చూస్తూ అడిగాడు వినాయకరావు.

బ్రహ్మం, భ్రమరం తాము ఆదిత్యకి చేస్తున్న ద్రోహానికి సిగ్గుపడుతున్నట్లు తలవంచుకున్నారు. వ్యాఘ్రం మాత్రం గర్వంగా నవ్వుకుంటున్నాడు.

ఇంతలో గుమ్మం దగ్గర చప్పుడైంది. ఈషిక తలతిప్పి చూసింది. అప్పుడే మృదుల ఇంట్లోకి వస్తోంది.

"అదుగో! మృదులకూడా వచ్చింది. రామ్మా! రా!! ఇంతకీ నిన్న నీ గొలుసు కొట్టేసింది నిజం దొంగకాదట. ఆర్టిఫీషియల్ దొంగంట" అన్నాడు వరసిద్ధి.

"ఆర్టిఫీషియల్ దొంగంటే?" అడిగింది మృదుల.

"ఎవరో దొంగని ఎరేంజ్ చేశారు. అతను నీ మెడలో గొలుసుకొట్టేశాడు. దానికోసం పాపం మురారి ఆ దొంగని వెంబడించాడు. ఆ దొంగేమో మురారీని మాయచేసి టానిక్ అనిచెప్పి, విస్కీ బాటిల్ ఇచ్చాడు. పాపం అన్నెంపున్నెం ఎరుగని మురారి అది విస్కీ అని తెలియక తాగాడు. అంతేతప్ప మురారీకి ఎలాంటి చెడు అలవాట్లూ లేవు" చెప్పాడు వరసిద్ధి.

"ఆ మాట వరసిద్ధి చెప్పివుంటే నమ్మేవాడిని కాదేమో... కానీ ఇలాంటివి ఎరేంజ్ చేసే వ్యాఘ్రం స్వయంగా వచ్చి చెప్పటంతో నమ్మక తప్పటంలేదు" అన్నాడు వినాయకరావు.

వారి మాటలమధ్య కల్పించుకున్నాడు వ్యాఘ్రం. "నా తోటి కంపెనీ చేస్తున్న మోసాలు నేను ఎందుకు బయటపెడుతున్నానని మీకు అనుమానం రావచ్చు. వరసిద్ధిగారిదీ, మాదీ ఒకే ఊరు. మా నాన్న వరసిద్ధి గారికి బాగా తెలుసు కూడా. మొదట మురారి పరిచయం అయినప్పుడు అతని ఊరు తెలియకపోవటంతో అతనెవరో తెలుసుకోలేకపోయాను.

ఈ రోజు మురారి తన ఊరి పేరూ తాత పేరూ చెప్పటంతో వారెవరో నాకు తెలిసింది.



పిల్లలకు చదువు,
సాంకేతికతను అందించే
క్రమంలో మానవసంబంధాలను
దూరం చేస్తున్నాం.
-పుల్లెల గోపీచంద్, షెటిల్ కోచ్

నా ఊరివారు ఇలా మోసానికి గురవుతుంటే ఊరుకోవటం నాకు భావ్యం అనిపించలేదు. అందుకే మా స్టాఫుతో సహా ముందుకు వచ్చి జరిగిన మోసాన్ని వివరించాను. మురారి ఒక పెద్ద కుట్రలో పావుగా మారి తాగాడుతప్ప కావాలని తాగలేదు..."

బుగ్గల్లో ఉన్న పదార్థాన్ని తినటం పూర్తిచేసిన మురారి అమాయకంగా ఈషికవైపు చూసి కనురెప్పలు టపటపలాడించాడు.

ఈషిక చిరాకుతో తల తిప్పుకుంది.

"...కాబట్టి నేను మరోసారి మీ అందరికీ విన్నవించుకునేదేమంటే మీరు ఇక్కడ ఉన్నంతసేపూ ఈ జంటని విడగొట్టటానికి కంకణం కట్టుకున్నవాళ్ళు ప్రయత్నిస్తూనేవుంటారు. కాబట్టి కొన్నాళ్ళు మీరు ఈ యువతీయువకుల్ని దూరముగా ఒక ఊరికి పంపండి. వారికి ఒకరిని ఒకరు అర్థం చేసుకునే సమయం దొరుకుతుంది..."

మురారి, వరసిద్ధితో కలిసి ప్రిపేర్ చేసుకున్న స్క్రిప్ట్ చదివి వినిపించాడు వ్యాఘ్రం.

వినాయకరావు అంగీకరిస్తున్నట్లు తలూపాడు.

"మా ఊరు నక్కలదొడ్డికి అమ్మాయిని తీసుకువెళ్తాను. అక్కడ నాకు తెలియకుండా ఎవరూ ఎలాంటి వేధవేషాలూ వేయలేరు.

మురారికీ, ఆ అమ్మాయికీ ఒకరినొకరు అర్థం చేసుకోవటానికిగాను కాస్త ఏకాంతం కూడా దొరుకుతుంది..." అని చెప్పాడు వరసిద్ధి.

"నేను ఎక్కడికీ వెళ్ళను" అని కోపంగా అంది ఈషిక.

**ఇంకా ఉంది**



# ఈ వీణకు శ్రుతిలేదు




దేశోద్ధారకులు

**ప.** ఈ వీణకు శ్రుతిలేదు
ఎందరికో హృదయం లేదు
నా పాటకు పల్లవి లేదు
ఈ బ్రతుకెందులకో అర్థంకాదు ॥ఈ వీణకు॥

చ. అందాన్ని వెలకట్టేవాళ్ళకు
అనురాగం వెలివేసినవాళ్ళకు ॥2॥
తెగిపోయిన తీగలు మీటేవాళ్ళకు
నేనేమని చెప్పేది ఏ పాటలు పాడేదీ
అని కన్నీరొలికాను ఆ కన్నీరంతంకాదు ॥ఈ వీణకు॥

చ. అందరిలా పుట్టిన నేను
కొందరి ఆశకు బలియైనాను ॥2॥
నావలె ఎందరో వున్నారని తెలిసి
యిది ఎవరు చేసిందీ.... ఏ దేవుడు రాసిందీ
అని ఎలుగెత్తడిగాను
నా ప్రశ్నకు బదులే లేదు... ॥ఈ వీణకు॥

సంగీతం కె.వి.మహదేవన్ గానం పి.సుశీల

చక్రవర్తి సంగీత దర్శకత్వంలో ఆత్రేయ పాట రాస్తూ పల్లవి పూర్తిచేశారు. "అనుపల్లవి చెప్పండి అన్నారు చక్రవర్తి" ఇచ్చిన ట్యూన్ చెయ్యకుండా. "ముందు నువ్వు పల్లవి అను-నేను అను పల్లవి అంటాను" అన్నారు ఆత్రేయ. అనుపల్లవి కూడా అయింది. "ఇంక చరణాలు" అన్నారు చక్రవర్తి. "అదే ఎవరి చరణాలు పట్టుకోవాలా అని ఆలోచిస్తున్నాను" అన్నారు ఆత్రేయ.




# దేవుడనేవాడున్నాడా

## దాగుడుమూతలు

**ప.** అ. దేవుడనేవాడున్నాడా అని మనిషికి
కలిగెను సందేహం ॥2॥
ఆ. మనుషులనేవారున్నారా అని
దేవునికొచ్చెను అనుమానం ॥దేవుడనే॥

చ. అ. మనసులేని ఈ మనిషిని చూసి...
దేవుడు రాయైపోయాడు...
ఆ. ఆ దేవుడు కనబడలేదని...
మనిషి నాస్తికుడైనాడు... ॥దేవుడనే॥

చ. ఆ. పశువులకన్న పక్షులకన్న మనిషిని.. మిన్నగ చేశాడు.
బుద్ధిని ఇచ్చి... హృదయాన్నిచ్చి...
భూమే నీదని పంపాడు...
అ. బుద్ధికి హృదయం లేక... హృదయానికి బుద్ధే రాక...
నరుడే... యీ నరలోకం నరకం చేసాడూ...
॥దేవుడనే॥

చ. అ. తాము నవ్వుతూ నవ్విస్తారు కొందరు అందరిని॥2॥
ఆ. తామేడుస్తూ ఏడ్పించుతారెందరో కొందరిని ॥2॥
అ. నేను నవ్వితే యీ లోకం చూడలేక ఏడ్చింది
ఆ. నేనేడిస్తే ఈ లోకం చూసి చూసి నవ్వింది...
॥దేవుడనే॥

సంగీతం కె.వి.మహదేవన్ గానం ఘంటసాల, సుశీల

ఆత్రేయ నెలరోజులకు చనిపోతారనగా చిరకాల మిత్రుడైన ఒక నటుణ్ణి కలిసి మాట్లాడుతూ సిగరెట్ అడిగారు.

ఆయన సిగరెట్ మానేశానన్నారు. 'మరి మందు' అన్నారు ఆత్రేయ. 'మందుకూడా మానేశాను' అన్నారాయన.

'ఇప్పటివరకు మందుభాగ్యుడవనుకొన్నాను. మందభాగ్యుడవై పోయావన్నమాట' అన్నారు నవ్వుతూ ఆత్రేయ.




రైలు కదిలింది. కదులుతూనే వేగం పుంజుకుంది. అప్పుడు చూశాను. రైలు కదలడం నాలాగే ఆలస్యంగా గమనించిన ఆమె పరుగున కంపార్టు మెంటులోకి దూకబోయింది. చీరె కుచ్చిళ్ళు అడ్డం పడ్డాయి. ఆవిడ ఇప్పుడు ఎక్కడికి వెళ్తోందో తెలుస్తోంది. మరో క్షణంలో ప్లాట్‌ఫారంకీ, రైలుకీ మధ్య ఉన్న చోట ఇరుక్కుంటోంది.

ప్రయత్నించి చేసిన పని కాదు.ఒక్క దూకులో ఆమెమీద పడ్డాను. కుడిచెయ్యి, నడుం దొరికింది. గట్టిగా శరీరాన్ని గాలిలోకి ఎత్తి కంపార్టుమెంటులో దూకాను. ఆనాటికి ఆ అదృష్టం మా ఇద్దరిదీ.

కంపార్టుమెంటు అంచుకి వచ్చాం. రైలుతో పరిగెత్తుతున్న ఎర్ర మైసయ్య- చెనిక్కాయల బస్తా కంపార్టుమెంటు లోపలికి విసిరేశాడు. బస్తా పెద్దది కాదు. కాని రైలు వేగం, విసిరిన వేగం, ఆత్రుత అన్నీ కలిసి ఆ బస్తాను తుపాకీని చేశాయి.

అంచున ఉన్న మా ఇద్దరి శరీరాలనీ ఆ బస్తా లోపలికి గిరాటేసింది.

ఇద్దరం నేలమీద పడ్డాం ఒకరిమీద ఒకరం. ఇదంతా- అనుకోకుండా జరిగింది- క్షణంలో.

భయంతో నన్ను కరుచుకుని ఆవిడ ఏడుస్తోంది. ఒక్క క్షణంలో మృత్యువునుంచి తప్పించుకున్న విషయం ఆవిడకి ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది.

ఆమె ముఖంలో షాక్. చాలా విచిత్రంగా నా ముఖంలోనూ షాక్. ఎందుకని? చాలాసేపటికి కాని అర్థంకాలేదు. ఈ పరుగులో- గుంజాటనలో, బస్తా విసురులో- ఆమె వక్షోజాలు బలంగా నన్ను గుచ్చుకున్నాయి. అంత టెన్షన్‌లోనూ వాటి బలం, అవి సుఖాన్ని ఇవ్వగలవన్న ఆలోచనా నన్ను తప్పించుకోలేకపోయింది. నేనూ ఒణికాను.

అప్పటికి సాయంకాలం అయిదున్నర. రైలెక్కాక టీ తాగాలన్న ఆలోచన ఆమెకి వచ్చిందట- అదిన్నీ అరుస్తూ వెళ్తున్న కుర్రాడు దాటిపోయాక. రైలు దిగింది. టీ దాటిపోయింది. రైలు కదిలిపోయింది. అదీ పరిస్థితి. ఒకరిని చావు ఒణికించింది.

మరొకరిని కోరిక ఒణికించింది. నిజానికి కోరిక కాదు. కోరికకి ఆలంబన. మామూలుగా రైలు ఎక్కివుంటే ఆ అమ్మాయిని చూసేవాడిని కాదు. ఇది కేవలం 42 సంవత్సరాల కిందటి మాట.

గుంతకల్లువైపు తిరిగే రైళ్ళలో-ఆ రోజుల్లో-స్లీపరు పెట్టెల్లో-ఒక మూలకి కేవలం ఆడవాళ్ళకే ప్రత్యేకించిన్నక్యాబిన్ ఉండేది. కనీసం-గుంతకల్లు-హుబ్లీ-గుత్తి ప్రాంతాలవైపు తిరిగే రైళ్ళ మాట. ఈవిడ ఆక్యాబిన్‌లో ఉంది. రైలు పెట్టెలో-గుంతకల్లులో రైలు బయలుదేరేటప్పటికి- ఆనాడు నలుగురైదుగురే ఉన్నారు.

ఆ అమ్మాయి ఆడవాళ్ళ క్యాబిన్‌లో ఒక్కర్తే ఉంది. ఈ లైనులో ఆ రోజుల్లో రద్దీ తక్కువ.

ఆనాడు- ఎందుకో మరీ తక్కువగా ఉంది. రైలు గుత్తి చేరేటప్పటికి నరాలు సర్దుకున్నాయి. ఈసారి

## గొల్లపూడికి 'గీతం' గౌరవ డాక్టరేట్

తెలుగు సాహిత్యంలో కథకుడిగా, నవలాకారుడిగా, వ్యాసకర్తగా, నాటకరంగంలో, సినీరంగంలో నటుడిగా, ప్రయోక్తగా కొత్తకొత్త ప్రయోగాలుచేసి, సమాజాన్ని మెప్పించిన ప్రముఖనటుడు, రచయిత గొల్లపూడి మారుతీరావుకు గీతం యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్‌ని ఇచ్చి గౌరవించింది.

కళలకు కాణాచి అయిన విజయనగరంలో 1939లో పుట్టిన గొల్లపూడి ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థిగా వికసించి, ఆకాశవాణి కేంద్రాలలో తన ప్రతిభను ప్రదర్శించి సినీరంగంలోకి దుక్కిపాటి వంటివారిద్వారా ఆహ్వానించబడ్డారు.

నాటినుండి దాదాపు ఆరుశతాబ్దాలపాటు గొల్ల

రైలు దిగి-ఆమె అడక్కుండానే ప్లాట్‌ఫారం మీద నుంచే టీకప్పు అందించాను. మనస్ఫూర్తిగా అందుకుంది. ఆమె ముఖంలో కొంతకాలం కిందటి భయం పోయి కృతజ్ఞత కనిపించింది.

అప్పుడు-ఆ అమ్మాయిని తేరిపార చూశాను. నిజానికి చిన్నపిల్లేం కాదు. తేలిగ్గా 27-28 ఏళ్ళు ఉంటాయి. కాని వయస్సుని ధిక్కరించే శరీరం. ఆ విషయం ఇప్పుడు గుర్తించినది కాదు. ప్లాట్‌ఫారం మీదకి తలమాత్రమే కనిపిస్తోంది. అయితే శరీరం ఇందాకటి నా అనుభవం చెప్పిన విషయం.

ఆమె అందగత్తె కూడా కాదు. కాని కళ్ళు దూసుకుని చూసేవి. నవ్వులో చిన్న విచిత్రం ఉంది. రెండు పెదవులూ బయటికి విచ్చుకుంటాయి.చిన్న అమాయకత్వం, నిజాయితీ-ఆ నవ్వులో కనిపిస్తుంది.


డా॥ గొల్లపూడి మారుతీరావు

పూడి మారుతీరావు ఏదోక రకమైన కొత్త ప్రయోగాలు చేస్తూనే వున్నారు. ప్రజలను మెప్పిస్తున్నారు.

గొల్లపూడి అందుకున్న అవార్డులు, సన్మానాలు అనేకం. ఆయన స్పృజించని అంశాలు లేవు. రచనల్లో చేయి పెట్టని విభాగం లేదు. నిత్యంఏదో ఒక కొత్త విషయం పాఠకులకు తెలియపరచాలని, వివరించాలనే తపన ఆయన రచనల్లో కనిపిస్తుంది.

'రుణం' సీరియల్‌తో లక్షలాది స్వాతి పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్న గొల్లపూడిగారికి డాక్టరేట్ వచ్చిన సందర్భంగా అభినందిస్తూ ఆయన మరిన్ని రచనలు చేయాలని ఆశిస్తోంది స్వాతి.✦

రైలు వేగం పుంజుకున్నాక- ఆలోచనలు-ఆ చిన్న మహిళల పెట్టెలో ఏకాంతంగా కూర్చున్న వ్యక్తివైపే పరుగులు తీశాయి. కంపార్టుమెంటు దాదాపు ఖాళీ. టీటీయీ వచ్చి తీరికగా కూర్చున్న నన్ను చూసి ఎదురుగా కూర్చున్నాడు. టిక్కెట్టు అడగలేదు. సిగరెట్టు అడిగాడు. అలవాటు లేదన్నాను.

టిక్కెట్టు లేదన్నంతగా నిరుత్సాహపడ్డాడు.

లేచి వెళ్ళబోతున్న ఆయన్ని అడిగాను : ఎందుకీ వాళ్ళ బొత్తిగా రద్దీ లేదు?- అని. వెళ్తూ వెళ్తూ 'బక్రీద్' అన్నాడు. ముస్లిమ్‌లకు బక్రీద్ చాలా పవిత్రమైన పండుగ.ప్రయాణాలు చెయ్యకుండా ఇళ్ళల్లో పండుగ చేసుకుంటారేమో. అయితే ఈ లైను అంతా ముస్లిమ్‌లే ఉండరుకదా? క్షణాలు గడిచేకొద్దీ ఆలోచనలు ఆ అమ్మాయివైపు ప్రయాణం చేస్తున్నాయి.

వెళ్ళి ఆ పెట్టె తలుపు తీశాను.చటుక్కున నన్ను చూసింది. చూసినందుకు ఆశ్చర్యపడలేదు. కాగా రావడం ఆలస్యం చేసినందుకు ఆత్రుతపడినట్టు కనిపించింది. ఎలా తెలిసింది? వెంటనే తను జరిగి నాకు చోటిచ్చింది. ఎదురుగా కూర్చోవచ్చు కదా?

కాని అమ్మాయి తనపక్కకి ఆహ్వానించడం శుభసూచకం. దేనికి?కాస్సేపే నిశ్శబ్దం.నా చేతిమీదచెయ్యి వేసి 'థాంక్స్' అంది. అప్పుడు అర్థమైంది ఆవిడబొత్తిగా చదువుకోలేదని. కాని కళ్ళల్లో కృతజ్ఞతకి మించిన ఉత్తేజం తెలిసింది. ఏమిటది? నా చేతిమీద ఆమె చెయ్యి ఒణుకుతోంది. లేక నా చెయ్యా?

ఇక తట్టుకోలేకపోయాను. ఆమె భుజంమీద చెయ్యివేశాను. ఆమె ఆశ్చర్యపడలేదు. నిజానికి ఎదురుచూస్తున్నట్టు కనిపించింది.

దంతా కృతజ్ఞతలో భాగమా? సినిమాల్లో హీరోలు మొదటి కలయికలోనే హీరోయిన్లను ఏదో ప్రమాదంనుంచో, కీడు నుంచో కాపాడుతారు. ఆ వెంటనే రొమాన్సు ప్రారంభమవుతుంది.

"నీ పేరు?"

"చినపాప. అసలు పేరు మహాలక్ష్మి. చిన్నప్పుడు నాకు ఆ మాట సరిగ్గా పలకడానికి వచ్చేదికాదట. అందుకని ఎవరడిగినా మా అమ్మ నన్ను పిలిచే పేరునే చెప్పేదాన్ని"

"మరి పెద్ద పాప ఎవరు?"

నవ్వింది. అప్పుడే తెలిసింది. పెదాలు బయటికి



విచ్చుకుని నోరు ప్రత్యేకంగా కనిపించడం. "ఎవరూ లేరు. నేను ముద్దుగా ఉన్నానని మా అయ్య నన్ను చినపాప అని ముద్దాడేవాడట. అందరికీ చినపాపని అయిపోయాను"

వెంటనే ఓ తొందరమాట అనుకోకుండా అన్నాను: "ఇప్పుడూ ముద్దొస్తున్నావు"

పగలబడి నవ్వింది. అప్పుడు తెలిసింది-ఆమెలో మరొక అందం-కుడి చివర ఊడిన పన్ను ఖాళీ. ఇది అందం ఎలా అవుతుంది? ఏమో! అది చెప్పడానికి చినపాపని చూడాలి.

నా చెయ్యి తీసుకుని తన జాకెట్టుమీద పెట్టుకుంది. ఈసారి నేను ఒణికిపోయాను. కంపార్టుమెంటులో ఇద్దరం కలిసి పడిన సంఘటనలో ఆత్రుత ఉంది. ప్రాణభయం ఉంది. మించి-అసంకల్పితమైన reflex మాత్రమే ఉంది.

ఇప్పుడిది తెలిసిన అనుభవం. శరీరం వేడెక్కిన క్షణం.చెమట పట్టింది.ఇప్పుడు ఏం జరుగుతుంది?మా ఇద్దరికీ తెలియని విషయమేమిటంటే అంతకు కొన్ని క్షణాల క్రితమే

## అనూహ్య ప్రయాణం

తెలుగు, తమిళ పరిశ్రమల్లో బిజీబిజీగా సాగిపోతున్న కాజల్ నటనను ఓ ఉద్యోగంగానే చూస్తుందట. నేను చిత్రసీమలోకి అడుగు పెట్టినప్పుడు ఇంత సుదీర్ఘమైన ప్రయాణాన్ని ఊహించనే లేదు. వచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసుకున్నాను.

ఏనాడూ అలసటకు గురవలేదు. నా పని నేను నిజాయితీగా చేసుకుంటూవస్తున్నానేతప్ప ఇమేజ్ సృష్టించాలని మాత్రం ఆరాటపడలేదు. నన్నెంతగానో ఆదరిస్తున్నందుకు ఆనందంగా ఉంద'ని చెప్పింది.

రైలు స్టేషన్లో ఆగింది.భళ్ళున ఈ లేడీస్ పెట్టెతలుపు తెరుచుకుంది. 'భళ్ళున' అన్న మాట ముఖ్యం.

కొత్తగా ఎవరైనా ప్రయాణీకులు వచ్చారేమో.ఆమె జాకెట్టుమీద చెయ్యిని చటుక్కున తీసేశాను. పెట్టెలోకి ప్రయాణీకులు ఎవరూ రాలేదు.

కేవలం టీటీయీ వచ్చాడు.అతని ముఖంలోచిన్న చిరునవ్వు. మగాళ్ళకి మాత్రమే ప్రత్యేకమైన నవ్వు. "నాకు తెలుసులే!" అన్న బెల్లింపు అందులో ఉంది. అమ్మాయితో అన్నాడు : "ఎక్కడికి?"

"పొన్నూరు"

"ఇది గుంటూరుదాకే పోతుంది"

"అక్కడ బండీ మారుతాను"

టిక్కెట్టు అడగలేదు. మా ఏకాంతాన్ని చెడగొట్టగలిగినందుకు తృప్తిపడ్డాడు. బయటికి వెళ్తూ తలుపు దగ్గర ఆగి "తలుపువేసుకోండి" అన్నాడు.ఆ మాటలో "నాకు తెలుసులే" అన్న చిన్న సూచన ఉంది.

"గుంతకల్లు ఎందుకు వచ్చావు?"

"కసాపురంలో మా అమ్మమ్మ ఉంది. ఒళ్ళు బాగు లేదు. చూసిపోదామని వచ్చాను"

"పొన్నూరులో ఎవరున్నారు?"

"మా అమ్మ"

"నాన్న?"

"లేడు"

"పోయాడా?"

"పారిపోయాడు"

ఇప్పుడు జాలి చూపించాలా? కారణం అడగాలా? ఎప్పుడు- అనాలా?

"నేను టైలరింగు చేస్తాను. పొన్నూరులో జంపరు కుట్టుకి చినపాపదే పేరు" అంటూ చీరెకొంగు తప్పించి జాకెట్టుని గర్వంగా చూపించింది. కాని కనిపించినవి-రెండు. చినపాప జంపరుకుట్టు కాదు. పొడుచుకుని వచ్చిన వక్షోజాలు.

చక్కగా, ఏపుగా పెరిగిన శరీరం.ఆ 'ఏపు'ని గుర్తుపట్టగల ఆమె గర్వం.వాటిని చూసి ఎదుటి వ్యక్తి తలకిందులవుతున్నాడని ఆమెకి తెలుసు. ఆమెకి తెలుసునని నాకూ అర్థమవుతోంది.

చిలిపిగా చూస్తోంది. చాలాసేపటివరకూ మాట రాలేదు. స్త్రీలో కోరిక తొందరపెడితే మగాడు తడబడతాడు. ఎందుకని? 'సిగ్గు' అనే ముసుగు ఆరుచిని మరింత పెంచుతుంది కనుక. అయితే ఒక్కచోటే దానికి సెలవు. పడకగదిలో. ఇది పడకగది కాదు. "నిన్ను ముద్దుపెట్టుకోనా?" అన్నాను.

"అడగాలా?" అని ముందుకు జరిగింది. నవ్వినప్పుడు ఆమె పెదాలు బయటికి విచ్చుకోవడంలో 'సెక్స్'కీ ప్రమేయం ఉన్నదని ఇప్పుడనిపించింది. ఆమె పెదాలు దగ్గరకు జరిగిన నా పెదాలను ఆక్రమించుకున్నాయి. 'కోరిక' నాకు తెలియకుండానే ఆమె చెప్పుచేతల్లోకి వెళ్ళిపోయింది.

తర్వాత ఏం జరిగేది? ఫ్రాయిడ్, హేవ్‌లాక్ ఎల్లిస్ తలబద్దలుకొట్టుకున్నా తేలేదికాదు కాని-ఆ క్షణంలో రైలు ఆగి మా పెట్టె సరిగ్గా స్టేషన్లో రద్దీగా ఉన్నచోట నిలిచింది. ఈ రోజుల్లోలాగా గాజు అద్దాల కిటికీలు కావు. ఊచలు లేని మామూలు కిటికీలు.

చటుక్కున నేను వెనక్కి జరిగాను. ఆమె పక్కున నవ్వింది. ఆ నవ్వుకి అర్థం-చేతిలో పెట్టిన తాయిలాన్ని అందుకోలేని పసివాడిని చూసినప్పటి చిలిపితనం.

మాటలు రాని నిశ్శబ్దమది. టీ, బిస్కెట్లు, కూల్‌డ్రింకులవాళ్ళు కిటికీలోంచి తల దూర్చి పలకరించి వెళ్తున్నారు"మీరేం చేస్తారు?" అంది- ఇప్పటికి. చెప్పాలని నోరు తెరిచి, అంతలో ఆగి- "ఏం చేస్తానో చెప్పుకో చూద్దాం" అన్నాను.

అలవాటైన, చిక్కనినవ్వు నవ్వుతోంది."అమ్మాయిల్ని ముద్దుపెట్టుకుంటుంటారా?"

చదువుకీ, instinctకీ సంబంధం లేదు. అనుభూతికి అధ్యక్షత వహించడంలో ఏనాడైనా స్త్రీకి రెండు, మూడు మాస్టర్ డిగ్రీలు ఉన్నాయి. కోరికను సమాధానపరచడంలో, మమకారాన్ని మాతృత్వానికి మలచడంలో సృష్టిలో స్త్రీని దాటి నిలవగల శక్తి లేదు. Womanhood and motherhood are the ultimate conquests of woman.

"విజయవాడ గవర్నరుపేటలో ఒక హోటల్లో ఛెఫ్‌ని"-ఛెఫ్ అన్న మాట నేను వెతుక్కున్నది. ఆ రోజుల్లో విజయవాడలో- కనీసం ఆ ప్రాంతంలో స్టార్ హోటళ్ళు లేవు. ఛెఫ్ అన్న మాట చాలామందికి తెలీదు. నేను వెదుక్కుని నా వృత్తికి గౌరవాన్ని పొదగడానికి తెచ్చిపెట్టుకున్న మాట.

చుట్టుపక్కల వాళ్ళు, హోటల్లో



నిజాం మన రాజు... నిజాం మన చరిత్ర... వక్రీకరించిన చరిత్రను చక్కదిద్దుతా.

-కె.సి.ఆర్., తెలంగాణా సి.ఎమ్.



ఏ రాజకీయ నాయకుడు పాదయాత్ర చేసినా అది అధికార సాధన లక్ష్యంగా చేసేదే.

-జయప్రకాష్ నారాయణ, లోక్‌సత్తా నేత

పనిచేసేవాళ్ళూ పిలిచేది 'మాస్టర్' అని.

"ఛెఫ్ అంటే?" నాకు అర్థమైంది-ఆమెకి అర్థం కాని మాట చెప్పానని. ఇప్పుడిక విజయవాడ స్థాయి కంటే కిందకి రాకపోతే ఆమెకి అర్థంకాదు.

"హోటల్లో వంటలు చేస్తాను" అన్నాను అలా చెప్తున్నందుకే ఇబ్బందిపడుతూ.

నవ్వింది."నాకంటే బాగా చేస్తారా? నేను రొయ్యల వేపుడు స్పెషల్" నన్ను మించి గర్వపడే మరో అందం ఆ క్షణంలో ఆమె సొంతం చేసుకుంది.

మొదటిది?- ఆమె యవ్వనం.మొదటిసారిగా ఆమె ముందు ఓడిపోవడానికి సిగ్గుపడలేదు.

నన్ను అర్థంచేసుకున్నట్టుంది- నా భుజం తట్టి "ఒక్కసారి మీ వంట తినడానికి విజయవాడ వస్తాను" అంది. అప్పుడు గుర్తొచ్చింది-భోజనం మాట.

"ఇద్దరికీ భోజనం చెప్పి వస్తాను" అని లేవబోయాను. నన్ను భుజం పట్టుకు లాగి కూర్చోపెట్టింది. "ఈ లైనులో భోజనం ఇచ్చే స్టేషన్లు లేవు. మా అమ్మమ్మ పెరుగూ అన్నం, వాము మిరపకాయలు, బిరియానీ ఇచ్చింది. మనిద్దరికీ చాలు" అంది.

మళ్ళీ రైలు కదిలింది. మళ్ళీ ముద్దు పెట్టుకునేదా? ఇలాంటి చర్యలకి ఆవేశం ప్రాతిపదిక. కేవలం ఆలోచన చాలదు."మీరెందుకు గుంతకల్లు వచ్చారు?"

"చెనిక్కాయ పచ్చడి ఎలా చెయ్యాలో నేర్చుకోడానికి" అన్నాను. ఆపకుండా నవ్వింది.

నవ్వుతున్నప్పుడు చీరె పైట జారిపోయింది. లేక జారిపోయేలాగా నవ్వుతోందా? బయట అందరికీ వినిపించేలాగా ఉంది ఆ నవ్వు. ఆపడానికి ప్రయత్నించాను.కాని నా చేతిని తన చేతిలోకి తీసుకుని మరీ నవ్వుతోంది. చేతిని భుజంమీద ఆప్యాయంగా తిప్పుకుంది.

కాస్సేపటికి ఆగి- "ఇంతోటిదానికి ఇంత దూరం రావాలా?" అంది. చేతివంట కళకాగలదన్న దృష్టి స్త్రీకి తక్కువ. చిన్నప్పటినుంచీ ఒక 'అలవాటు'లాగా ఆ ప్రక్రియ లొంగిపోతుందివారికి.

జీవితమంతా సాగిపోతుంది. కాని ప్రపంచంలో గొప్ప వంటవాళ్ళంతా మగవారు. మన సంస్కృతిలో కూడా. వంటకి భీముడిని చెప్తాం. ద్రౌపదిని కాదు. నలుడుని చెప్తాం. దమయంతిని కాదు.

ప్రపంచంలో గొప్ప వంటగాళ్ళందరూ మగవాళ్ళే. గార్డెన్ రామ్స్, పాల్ బోకూసే, ఎమిరిల్ లగాస్సీ, ఆంథోనీ బోర్డాయిన్-ఇలా ఎందరైనా.

విజయవాడ వంటవాడికి ఇంత పెద్ద పేర్లు ఎలా తెలుసు? ఓ ఇంగ్లీషు దొరగారు నా చేపలకూరకి మురిసి నా కూరని విదేశీ కూరలతో పోల్చి చెప్పాడు. అప్పుడే ఈ పేర్లు తెలిశాయి. నేను కాగితంమీద వాటిని రాయించుకున్నాను.

మరీ గొప్పవారు హోటల్లో దిగినప్పుడు- నా తెలివితేటల్ని ప్రదర్శించడానికి ఆ పేర్లు వాడతాను.అయితే చినపాప ముందు ఎందుకు? ఆమెకి తెలియని గొప్ప ప్రపంచం నాకు తెలుసునని ఊరించడానికి. ఇది హనుమంతుడి కుప్పిగెంతు.

## గుర్తింపు కావాలి

'లవర్స్ క్లబ్'ను ప్రేక్షకుల ముందుకు తెచ్చిన పావని మంచి పాత్రల్లో ప్రేక్షకుల్ని అలరించి, గుర్తింపు పొందడమే తన లక్ష్యం అంటున్నది.

"నా మెడికల్ స్టూడెంట్ పాత్ర ఈ కాలం అమ్మాయి మాదిరే ఉంది. నేను 2004లో మొదటి సారిగా బాలనటిగా పనిచేశాను. మాది గుంటూరు. కొన్ని చిత్రాల్లో నటించాను కాని పెద్దగా గుర్తింపు పొందలేకపోయాను. ఈ చిత్రంలో నన్ను అందరూ మెచ్చుతారని ఆశిస్తున్నాను. సరదాగా సినిమా పూర్తిచేశాం. ఇంకో స్క్రిప్టు సిద్ధంగా ఉంది.

నటిగా నన్ను నేను నిరూపించుకోగల పాత్రల కోసం ఎదురుచూస్తున్నా"అని తెలిపింది.



చెప్పాను. "రాయలసీమలో చెనిక్కాయల పంట ఎక్కువ. చెనిక్కాయలతో ఎన్ని రకాల ఐటమ్స్ చెయ్యవచ్చునో చాలామందికి తెలీదు. శ్యాంసన్‌పురంలో మా ఎర్రమైసయ్య నాయనమ్మ ఉంది. కుంచమ్మ. ఆవిడకి 87 ఏళ్ళు.

మైసయ్య ఓసారి విజయవాడ వచ్చి రొట్టెల్లో ఓ విచిత్రమైన కూర పెట్టి నా మతి పోగొట్టాడు. ఏమిట్రా ఇది- అంటే చెప్పడు. బెల్లించి బెల్లించి వాడి నాయనమ్మ చేసిందనిచెప్పాడు. అప్పటినుంచీ ఆ 'రుచి' పట్టుకోవాలని తాపత్రయం. ఇన్నాళ్ళకి కుదిరింది"

"ఎలా చేస్తావు ఆ కూర?" దగ్గరికి జరిగింది.

నేను నవ్వాను."రెండేళ్ళు కష్టపడి ఆర్జించిన విద్య అది. అంత సులువుగా చెప్తానా? విజయవాడ రా.చేసి తినిపిస్తాను" తల్లి కుర్రాడిని బెల్లించినట్టు చూశాను. నా చెయ్యి తీసుకుని తన చేతిలో పెట్టుకుని "ఒట్టు?" అంది. నేను అనలేదు. ముద్దు పెట్టుకున్నాను.

"ఒకటి కాదు. ఆరు రకాల వంటకాలు నేర్పింది ఆవిడ. వాటికి కాస్త పట్నం పద్ధతులు జతచేశానంటే- కేవలం చెనిక్కాయవంటకాలు కారణంగా జీతం మరో వెయ్యి పుచ్చుకుంటాను.

ధనియాలు, తిరగ మోత, ఉల్లిపాయ ముక్కలు వేసిన పచ్చడి మామూలు వంటకం. చెనిక్కాయని కచ్చాపచ్చాగా ముక్కలు చేసి-ముద్ద కాకుండా ఉడికించి- మైదాపిండి..." ఒక్కసారి వ్యాపారదక్షత ఉన్న వంటవాడినయిపోయాను.

ఆమె మనఃపూర్వకంగా బురద పూసుకుంటున్న కుర్రాడి ఆటని ఆనందంగా గమనిస్తున్నట్టు నన్ను చూస్తోంది.ఆమె చూపులో వింటున్న శ్రద్ధకాక,చూస్తున్న ఆసక్తి తెలుస్తోంది.నేను చెప్తున్న విషయంమీద ఆమెకి శ్రద్ధ లేదని అర్థమై అంతలోనే ఆగిపోయాను.

ఇద్దరం ఒకరినొకరు గమనిస్తూ కొన్ని క్షణాల పాటు నిలిచిపోయాం. చెనిక్కాయ వంటకాలు అటకెక్కిపోయాయి. తర్వాత ఏం జరిగేది?

ఏమో! తలుపు చప్పుడైంది. ఇద్దరం తుళ్ళిపడ్డాం. వెళ్ళి గొళ్ళెం తీశాను. టీటీయీ రహస్యం చెప్తున్నట్టు అన్నాడు :"పెద్ద స్టేషన్ వస్తోంది.

మీరు బయట ఉంటే మంచిది" ఈ మాటని రహస్యంగా చెప్పనక్కరలేదు. కాని అతని మాట- ఆర్డరులాగా లేదు. సూచనలాగా ఉంది. పోలీసు దొంగతనాన్ని ప్రోత్సహించినట్టు ఉంది.

అవకాశం, మద్దతు, ఇటుపక్క పూర్తి సహకారం- శరీరం క్రమంగా వేడెక్కుతోంది.ఐనా బయటికి వచ్చాను. తీరా అది రైలు ఆగే ఊరు కాదు. గుడిమెట్ట. ఏదో క్రాసింగు ఉందట. రైలు దిగి అటూ ఇటూ దిక్కు తోచనట్టు నడిచాను.

కిటికీలోంచి పాప చూస్తోంది. అక్కరలేకపోయినా, అలవాటులేకపోయినా సిగరెట్టు కొని కాల్చాను.

పొగకి గుక్క తిరగక ఉక్కిరిబిక్కిరికావడం పాప గమనించింది. కోరిక తీర్చుకోవడం తెలీని వ్యక్తిని చూసి ఆట పట్టించినట్టు నవ్వుతోంది. మేమిద్దరం ఒకరినొకరం



**బాగా ఆడుతున్నంత కాలం కోచ్‌కన్నా మేమే గొప్పవాళ్ళమని ఆటగాళ్ళు అనుకోవటం సహజం.**
-రాహుల్ ద్రావిడ్, మాజీ క్రికెటర్



చూసుకుంటూండడం టీటీయీకి తెలుస్తోంది. భుజంమీద చెయ్యి వేశాడు.

"ఓ పార్టీ ఉందా?" అన్నాడు-అప్పు అడిగినట్టు కాదు. అదేదోతన హక్కులాగా అడిగాడు.

ఏమిటా హక్కు? స్లీపరు కంపార్టుమెంటులో ఆడవాళ్ళపెట్టెకు లోపలి గడియ ఖరీదు.ఇవ్వనన్నాను. గమనించాలి. లేదనలేదు.మా దగ్గరతనాన్ని గుర్తించి నందుకు ఆనాడు అతను ఏర్పరుచుకున్న రుసుమది. మరొకరెవరైనా సులువుగా ఇచ్చేవారేమో.

ఇది 42 ఏళ్ళ కిందటి 40 రూపాయలు. నిజానికి అంత డబ్బు ఆనాడు నా దగ్గర లేదు. ఉంచుకునే అవసరమూ లేదు. అతను ఆశ్చర్యపోయాడు. నిష్కర్షగా చెప్పిన నా ధోరణికి షాక్ అయ్యాడు. దూరంగా జరిగిపోయాడు.

ఒక అపశ్రుతిని సమర్థించడానికి రుసుము చెల్లించాలనే యావలేని రోజులవి. ప్రతీ సౌకర్యానికీ విలువ కట్టి రాబట్టుకునే ఉద్యోగం అతనిది.ఇద్దరికీ ఆ క్షణంలో పొంతనకుదరలేదు.

కాని అందువల్ల జరిగిన నష్టాన్ని చాలాకాలం మరిచిపోలేకపోయాను. రైలు కదిలింది.ఈసారి స్వేచ్ఛగా పాప పెట్టెలోకి వెళ్ళలేకపోయాను.

కారణం- టీటీయీ ఈ కంపార్టుమెంటులోనే ఉండడం. అతని కోరికని కాదన్నా నిర్మొహమాటం నాకు ఆ క్షణంలో బంధమైంది. మించిపోయిందిలేదు. ఐతే ఇవ్వాలన్నా అంత డబ్బు నా దగ్గరలేదు.

## పాటల 'రాశి'

బూరెబుగ్గల బ్యూటిఫుల్ లేడీ రాశీఖన్నా 'జోరు'లో టైటిల్ సాంగ్ పాడి స్వరాన్ని సవరించింది. తర్వాత చాలా షోలలో, సినిమా వేడుకల్లో సరదాగా గళం విప్పిన సందర్భాలూ ఉన్నాయి. మరోమారు తన స్వరా నికి పనిపెట్టింది.

'జవాన్' చిత్రంలో రాశీఖన్నా ఉర్రూతలూగిస్తూ పాట పాడిందట. తమన్ బాణీలో తన గొంతుతో మాయచేసిందని వినికిడి. ఇంకో సినిమాలోనూ పాట పాడిందనేది ఓపెన్ సీక్రెట్.

మునుమాక దాటాక మెల్లగా కంపార్టుమెంటు దాటాడు పక్క పెట్టెలోకి. అంతే. వెంటనే పాప దగ్గరికి దూకాను. నా కోసమే ఎదురుచూస్తున్నట్టు కూర్చుని ఉంది. 'ఎందుకింత ఆలస్యం?' అన్నట్టు చూసింది. దొంగలకి దొంగభాష అర్థమవుతుంది లేదా ఆర్తులకి ఎదుటి వ్యక్తి ఆర్తి గుర్తు తెలుస్తుంది. "టీటీయీ" అన్నాను క్లుప్తంగా.

ఈసారి మరీ దగ్గరగా కూర్చున్నాను. ఎలా కలిలింది ఈ చొరవ? లాజిక్ లేదు. గుంతకల్లు నుంచి సంఘటనలన్నీ అలా తోసుకొచ్చాయి.

ఈసారి ప్రయత్నం లేదు. పాపని నా కౌగిట్లోకి తీసుకున్నాను-నా హక్కులాగా. రైలు వేగానికి పాత కంపార్టుమెంటు మమ్మల్ని ఉయ్యాల ఊగిస్తోంది. పాప క్రమంగా నన్ను అల్లుకుంటోంది.

అలా ఎంతసేపు? అప్పటికి నేను మరిచిపోయిన విషయం ఏమిటంటే ఈ ఆడవాళ్ళ పెట్టె. తలుపు గొళ్ళెం వేయలేదు. న్యాయంగా ఎవరైనా తలుపు తోసుకు లోపలికిరావచ్చు. వచ్చే ప్రయత్నం జరిగింది. కాని రాలేదు. ఎవరు? టీటీయీ.

పక్క పెట్టెలోంచి ఒక ముసలావిడని వెంట బెట్టుకు వచ్చాడు. మేమిద్దరం తుళ్ళిపడ్డాం. మా ఇద్దరివేపూ చూడకుండా- కార్యదక్షతతో నిమగ్నమైన ఉద్యోగిలాగా చార్టుని చూసుకుంటూ- "ఈ కింది బెర్తులో పడుకోండి" అన్నాడు.

"రాత్రంతా నేలమీదే దొర్లాలేమోనని బెంగెట్టుకున్నాను. నెత్తిన పాలుపోశావు కొడుకా" అంది ముసలావిడ.అంటే-రిజర్వేషన్ చేయించుకున్న పాసింజరు కాదు. పూనుకుని, వెతికి పట్టుకుని తీసుకొచ్చిన శాల్తీ ఈ పాసింజరు.

"మీలాంటివాళ్ళకి సేవచేస్తే పుణ్యం మాన్నగారూ. పడుకోండి" అని తలుపుదాకా వెళ్ళి "నాకేం ఇవ్వనక్కరలేదు" అన్నాడు నన్ను చూస్తూ. కావాలని, కసిగా చేసిన పని అని అర్థమవుతోంది. నన్ను చూసి "ఆవిడకి తోడున్నారు. మీరు మీ బెర్తుకి వెళ్ళి కూర్చోవచ్చు" అనేసి తలుపు దగ్గరికి లాగేసి మాయమయ్యాడు.

ఇక అక్కడ కూర్చున్నా ఒరిగేదేమీలేదు- కబుర్లు చెప్పుకోవడం తప్ప. అయినా మమ్మల్ని మాట్లాడనివ్వలేదు ముసలావిడ. "నీకేమవుతుంది ఈ బొట్టి?" అంది. ఏమీ కాదన్నాను.

"అయితే నువ్విక్కడ కూర్చోడం తప్పుకదా?"

కొందరికి లేని చొరవ ఉంటుంది. ఎక్కువగా తమిళులకి అది జన్మహక్కు. రోడ్డుమీద, సైకిలు మీద వెళ్తున్నవాడు పార్కులో పువ్వులు కోస్తూంటే గుర్రుగా చూస్తాడు సైకిలు ఆపి.Righteous monitering మంచి జబ్బే.అది జాతికంతా ఉంటే వ్యవస్థ సంస్కారం. కొందరికే ఉంటే అది వ్యక్తి వికారంగా సరిపెట్టుకుంటాం. లేచాను.

చినపాపకూడా నిరుత్సాహపడినట్టు తెలుస్తోంది. అయినా చేసేదేమీ లేదు.

వెళ్తున్న నన్ను చూసి "గంటలో రా. భోజనం చేద్దాం" అంది. ఇది అతిచిన్న సౌకర్యం.

కాలుకాలిన పిల్లిలాగా కంపార్టుమెంటు అంతా తిరిగాను. అప్పటికి నా జేబులో 40 రూపాయలు ఉంటే వెదికి పట్టుకుని టీటీయీకి సమర్పించేవాడిని. అది నా శక్తికిమించిన పైకం అప్పటికి.

బెర్తుమీద కూర్చున్నాను. శరీరం అలసిపోయినప్పుడూ, మనస్సు అలసిపోయినప్పుడూ ఓ ఆటవిడుపు ఉంది- నిద్ర. నాకు తెలియకుండానే నిద్ర పట్టేసింది. ఉన్నట్టుండి-ఎవరో భుజంమీద చెయ్యి వేస్తే తుళ్లిపడి లేచాను. చీకటిపడింది-చేతిలో భోజనం ప్యాకెట్‌తో వచ్చి నా పక్కన కూర్చుంది.

అప్పటికి కంపార్టు మెంటులో ఉన్న నలుగురూ నిద్రపోతున్నారు. నా పక్కన కూర్చుంది-

'నువ్వొస్తావేమోనని ఎదురుచూశాను' అంటూ. "ఆ ముసలి దెయ్యం?"

"ఇంకా పడుకోలేదు. 'నాకేం భయం లేదు. హాయిగా పడుకో'మంటోంది. తనకి రాత్రుళ్ళు నిద్ర సరిగా పట్టదట" నిరుత్సాహం గుండెలకి ఎగదన్నింది. ఆమె స్వయంగా ప్యాకెట్‌లోంచి అన్నం నోటికిఅందించింది. ఆకలి లేదు. అయినా నోరు తెరిచాను.

నా కళ్ళల్లో నిరుత్సాహం ఆమెకి అర్థమవుతోంది. ఆ క్షణంలో అర్థంచేసుకున్న అమ్మ అయింది. లేచి వెళ్తున్న ఆమె చీరె పట్టుకుని ఆపాను. వెనక్కి తిరిగి- ఎంగిలి పెదాలను ముద్దుపెట్టుకుని వెళ్ళి పోయింది. అంతే ఆ రాత్రి కథ.

గుంటూరు రైల్వేస్టేషన్లో తుళ్ళిపడి లేచాను. అప్పటికే రైలు ఆగి చాలాసేపయినట్టుంది. హడావుడిగా కంపార్టుమెంటు దిగాను. ఎక్కడ చినపాప? చుట్టూ తప్పిపోయిన పసివాడిలాగా కళ్ళు వెదికాయి.అప్పుడు కనిపించింది- ఎదుటి ప్లాట్‌ఫారంమీద నా దృష్టిని పడడానికి ఎదురుచూస్తోంది. నేను చూడగానే చెయ్యి ఊపింది. స్టేషన్లో నన్ను లేపలేదేం? వెళ్తున్నట్టు చెప్పలేదేం?



**ఫలితంమీద దృష్టిపెట్టి ఒత్తిడికి గురయ్యేకన్నా పనిచేసే క్రమానికి ప్రాధాన్యతనివ్వటం మంచిది.**

-మహేంద్రసింగ్ ధోనీ, క్రికెటర్

ఇంత సులువా విడిపోవడం? అటుపక్క ప్లాట్ ఫారం మీద డూప్లికేట్ రైలు ఉంది. నాలుగడుగులు వేశాక జనం మధ్య కలిసిపోయింది చినపాప. మరి కనిపించలేదు.

అతను పొద్దుట్నుంచీ నాకోసం ఎదురుచూస్తున్నాడట. నేనెలా ఉంటానో తెలీదు. ఏ హోటలో తెలీదు. కనీసం పన్నెండు హోటళ్ళలో వెదికి ఇక్కడికి వచ్చాడు. ప్రతీ అరగంటకీ అడుగుతున్నాడట ఆయన వచ్చారా అంటూ. హనుమంతు నన్ను చూస్తూనే పరుగున వచ్చి ఈ కథంతా చెప్పాడు.

"అతన్ని చూస్తే జాలేస్తోంది బాస్. ఏదో పెద్ద కష్టంలో ఉన్నట్టున్నాడు. వెళ్ళి మాట్లాడు. బయట-పార్శిల్స్ తీసుకెళ్ళే బెంచీమీద ఓ మూలకి ఒదిగి కూర్చున్నాడు.జుత్తు రేగి ఉంది.గెడ్డం బాగా మాసింది. బట్టలూ నలిగి ఉన్నాయి.నాలుగైదు రోజులుగా నిద్ర లేదన్న విషయం తెలుస్తోంది. నేనూ అతన్ని ఏనాడూ చూడలేదు. సందేహిస్తూనే దగ్గరకి వెళ్ళాను.

"ఎవరండీ?" అన్నాను. తుళ్ళిపడ్డట్టు లేచాడు. మీరు ఫలానా?అవునన్నాను. "మీరు త్వరగా నాతో రావాలి. టైము లేదు. అర్జంట్"

"ఎక్కడికి? ఎందుకు? అసలు..." మాట పూర్తి కానివ్వలేదు. "ఇప్పుడంతా చెప్పలేను. నా మాట విన్నందుకు మీరు... ప్లీజ్. వెళ్దాం పదండి"

విషయం తెలియకపోయినా, అదేదో అర్జెంటు వ్యవహారమేనని అర్థమవుతోంది.కాని ఇంకా సందిగ్ధం వదలలేదు. "ఇంతకీ ఎవరు మీరు?"

ఎలా చెప్పాలో తెలీక గింజుకున్నాడు. దీనంగా చూశాడు.అతని కళ్ళు రెండూ నీళ్ళతో నిండుకుండలయ్యాయి. చెప్పలేక చెప్పలేక- 'నేను చినపాప తమ్ముణ్ణి" అన్నాడు.

అంతే. ఇంకేమీ అడగలేదు. హనుమంతుకి చెప్పి బయటికి నడిచాను. ఇద్దరం రిక్షాలో దూకాం.

పటమటదాటి గణపతి సచ్చిదానందస్వామి ఆశ్రమం సమీపంలో ఓ నర్సింగ్‌హోమ్‌ముందురిక్షా ఆగింది. అంతవరకూ చినపాప తమ్ముడు మాట్లాడలేదు. నిజానికి మాట్లాడే స్థితిలో లేడు.

నర్సింగ్ హోమ్ లోపల బొత్తిగా చీకటి గుయ్యారంగా ఉంది. ఏమిటిది? చినపాప ఇక్కడెందుకుంది? ఆమెకేమయింది? చీకట్లోంచే ఒకాయన బయటికి వచ్చాడు. దాదాపు 30 వయస్సు. మెడలో పాతబడిన స్టెతొస్కోపుని చూసి డాక్టరని గుర్తు పట్టాను.

దాదాపు మాసిపోయిన కార్డిగాన్. జుత్తు మాత్రం దుబ్బుగా పెరిగి ఉంది. మా ఇద్దర్నీ-కాదు-నన్ను చూడగానే అతనిముఖం వికసించింది. "ఓహ్! మిస్టర్ ఫలానా! మీకోసం ఇద్దరూ తపస్సు చేస్తున్నారు. లోపల ఆవిడ, ఇతను" "ఎందుకని? చినపాపకి ఏమ యింది?" డాక్టరు నవ్వాడు. "ఇంకా ఏం కాలేదు. ఇక ఏమైనా చినపాప బాధపడదు. ఆమె చూడాలనుకున్న ఒక వ్యక్తి ప్రస్తుతం ఇక్కడ ఉన్నారు"

తమ్ముడు ఏడుస్తున్నాడు. డాక్టర్ అతన్ని పట్టించుకోలేదు. "నా పేరు దుర్గ. నన్నంతా 'పూర్ డాక్టర్'



## సంతృప్తికరం

**త**న 'ఒక్కడు మిగిలాడు' సినిమా గురించి అనీషా అంబ్రోస్ ఆత్రుతగా చెప్తోంది. విభిన్నమైన సినిమాలు చేయాలన్న ఉద్దేశ్యంతో 'ఒక్కడు మిగిలాడు' చిత్రంలో నటించా.నా సినీప్రయాణంసంతృప్తిగా ఉంది.ఏది జరగాల్సివుంటే అది జరుగుతుంది. జీవితం ఓ ప్రయాణం. ఎన్ని ఆటుపోట్లు ఎదురవుతున్నా ముందుకు సాగిపోతుండాలి.

కమర్షియల్ సినిమాలు ఎప్పుడైనా చేయవచ్చు. కాని, వైవిధ్యభరితమైన కథలు మాత్రం అరుదుగా వస్తుంటాయి" అని చెప్పింది.

అంటారు. పేదరికం నా వైద్యానిది కాదు. డబ్బుది. గ్లాడ్ టూ మీట్ యూ. ఇది చాలా తేలికగా అందరూ అనే మాట. ఇంతకంటే మంచి మాట ఏదైనా ఉంటే అనాలని ఉంది నాకు" తెల్లబోయి చూస్తున్నాను.

"మీగురించి నాకంతా తెలుసు. చినపాప ఏ విషయం మరిచిపోలేదు. గుంతకల్లులో ఆమెను రక్షించడం. ఆడవాళ్ళ పెట్టెలో జంపరుకుట్టు.

జాకెట్టుమీద మీ చేతులు. మీరు పెట్టుకున్న ముద్దు" నేను కంగారుపడడాన్ని చూసి నవ్వాడు.

"మీకు తెలియకుండానే ఆ క్షణంలో చినపాప జీవితాన్ని పొడిగించారు. ఆ కాస్త జీవితాన్ని వెలిగించారు. ఆనాడు వాము మిరపకాయల రుచితో వేడెక్కిన ఎంగిలిపెదాల మీద ముద్దు"

నాకు కోపం వచ్చింది. ఇంత ఏకాంతమైన విషయాలు చినపాప- ఇతనితో... దుర్గ డాక్టరు. క్షణంలో నా మనస్సులోని ఆలోచనని చదివాడు.

"మిమ్మల్ని ఇబ్బందిపెట్టడానికి ఇవన్నీ చెప్పడం లేదు. కాని ఆమె మనస్సులో దాచుకున్న విలువైన జ్ఞాపకాలను-వాటికి కారణమైన మనిషికి చెప్పాలనుకున్నాను. మీరు చాలాకాలం జీవిస్తారు.

ఆ రోజు-కాదు-ఆ రాత్రి-ఒక వ్యక్తికి గొప్ప ఉపకారం చేశారని చెప్తే గతాన్ని తలుచుకుని జీవితమంతా గర్వపడతారని గుర్తుచేస్తున్నాను.ముద్దుకి సమాజంలో రకరకాలైన అర్థాలున్నాయి.

కాని చర్మ వ్యాధి నిపుణుడికి అది కేవలం రెండు పెదాల కలయిక. గుండె వ్యాధి నిపుణుడికి అది రెండు గుండెకాయలు వేగంగా కొట్టుకోవడానికి గుర్తు. సైకాలజిస్టుకి అది రెండు మనస్తత్వాల సమన్వయం. అంతే. అంతకన్నా ఇంకేం లేదు.

నేను ఆనాటి మీ చర్య ఎంత జీవ లక్షణాన్నిఆమె శరీరంలో ప్రోదుచేసిందో చెప్పాలనుకుంటున్నాను. ఈ తర్వాత మీ నెత్తినపడబోతున్న పెద్ద విషాదాన్ని కనీసం ఈ జ్ఞాపకం రాబోయేకాలంలో ఎంతో కొంత తేలిక చేస్తుంది. ఆ గదిలో ఉన్న పేషెంటుకి నేనేం చెయ్యలేను.కాని మీకు చెయ్యగల చికిత్స కాస్త పాటి చేసి-ఉపకారం చేద్దామనుకుంటున్నాను"

మెల్లగా మీదన పడబోయే విపత్తు తెలియవస్తోంది. అసలు... అసలు...

"అవును.ఇప్పటికీ మీరు ఊహించినది రైటే. చినపాప వెళ్ళిపోతోంది. ఇప్పుడు కాదు. కనీసం రెండేళ్ళ కిందటే ఈ ప్రయాణం ప్రారంభమైంది. కార్సినోమా. అంటే- మామూలు భాషలో క్యాన్సర్. మర్మాయవం దగ్గర. ఆమె కుటుంబ జీవితానికి పనికిరాదు. ఆ విషయం చినపాపకి ముందునుంచీ తెలుసు"

నాకు తల తిరిగిపోయింది.గుంతకల్లు నాటి అనుభవానికి ఇది అన్వయం. ఆ రోజు అంత ఉదారంగా, సులువుగా, అసంకల్పితంగా మా దగ్గరతనాన్ని శారీరకసుఖంవేపు కొరిమలుపు తిప్పిన వంద ఆలోచనలు మనస్సులో కదిలాయి. కుటుంబ జీవితానికి నోచుకోని ఓ అందమైన, పండు యౌవనంలో ఉన్న అమ్మాయి- మరో వ్యక్తిని ఆ దిశగా రెచ్చగొట్టింది. ఎందుకు? దుర్గ నవ్వాడు.

"తను పోగొట్టుకుంటున్నదేదో తెలుసు. కాదు-తాను పొందలేనిదేదో తెలుసు.కాని దాన్ని పొందాలనే 'కోరిక'ని, ఒక్క అనారోగ్యం వినా-దాన్ని తీర్చగలిగే అన్ని అర్హతలు ఉన్న తనని- ఇది ముఖ్యం- ఆ అనుభవానికి కాదు- ఆ ఆలోచనకు సిద్ధం చేసింది- మిమ్మల్ని.కాదు-సిద్ధంచేయగలిగే స్త్రీత్వంని మీరు రెచ్చగొట్టారు. నేను వైద్యుడిని.

కాని వైద్యానికి అందని కొన్ని చికిత్సలున్నాయి. ఆమెలో మీరుమేల్కొల్పిన 'జీవలక్షణం' ఆమెకి మరి కొంత సమయం-కొన్ని నెలలు జీవలక్షణాన్ని బలోపేతం చేశాయి"

"మైగాడ్!" "ఇది మీకు తెలియకుండా ఆమెకి జరిపిన చికిత్స" హఠాత్తుగా ఓ ఆలోచన కదిలింది. ఆనాడు- నేను 40 రూపాయలు టీటీయీకి ఇవ్వగలిగితే, ఆ రోజు ఆ ముసలావిడ కంపార్టుమెంటులోకి రాకపోతే?... ఈ రహస్యం ఆనాడే నాకు తెలిస్తే?

దుర్గ నవ్వాడు. "ఆమె అనుభవానికి ఒక పరిమితి ఉంది. సెక్స్‌కి ఆమె పనికిరాదని మీకు తెలీదు. కాని ఆమెకి తెలుసు. మీరు అందుకు తొందరపడు

తున్నారు. అంటే-అంతవరకూ ఆమె నిర్మించుకున్న నీటిబుగ్గ పగిలిపోతోంది. ఇప్పుడు సెక్స్‌కి గండి పడాలి. మీరు సెక్స్‌కోసం 40 రూపాయలు ఖర్చు చెయ్యలేకపోయారు. ఆమె సెక్స్‌ని ఆపడానికి 60 రూపాయలు ఖర్చుచేసింది"

నేను దిమ్మరపోయాను."అవును. టీటీయాకి 60 రూపాయలు ఇచ్చింది. ఆ రోజు ముసలావిడ ఆ కంపార్టుమెంటులోకి రావడం ఆమె ఏర్పరుచుకున్న వెసులుబాటు. మీరు సిద్ధంచేసిన 'కల'ని కల స్థాయి లోనే ఆపడానికి ఆమె చేసిన ఖర్చు. ప్రయత్నం"

నాకు మతిపోయింది. "మరొక్క విషయం ఇప్పుడు మీకు గుర్తు రావాలి. మర్నాడు ఉదయం మీరు లేచేసరికి చినపాప- ఎదుటి ప్లాట్ ఫామ్‌మీద ఉంది- చెయ్యి ఊపుతూ.మీకు తన అడ్రసు ఇవ్వలేదు. 'మళ్ళీ కలుస్తాం' అనలేదు.

'మళ్ళీ ఎప్పుడు కలుస్తావు?' అని మీరడిగే అవకాశం ఇవ్వలేదు. కారణం-ఈ అనుభవానికి ఆవలి తీరం లేదు. అప్పుడు- మీకు నిర్దాక్షిణ్యంగా కనిపించినా-ఆమె నిస్సహాయంగా మీ ఇద్దరిమధ్యా తలుపు మూయకపోతే- ఓ గొప్ప అనుభవానికి సిద్ధపడుతున్న మీకు ఒక పీడకల మిగిలేది"

"అయితే ఆవిడ ఆ రోజు తెలిసి చేసిన పని అంటారు" "మరో వింత విషయం. ఆమె కథ మీకేమీ దొరక్కుండా జాగ్రత్త పడింది.ఒకవేళ మీరు ప్రయత్నించి పొన్నూరు వెళ్ళినా ఆమెని వెదికిపట్టుకోలేకపోయేవారు. కారణం- ఆమె చినపాపే. కాని జంపరుకుట్టు, టైలరింగు ఆమె పని కాదు" "మరి ఎందుకలా చెప్పింది?"

దుర్గ నవ్వాడు. మీరు మగాళ్ళు. ఆమె అసమాన్యురాలైన స్త్రీ. కంపార్టుమెంటులో పడిన క్షణంలోనే మీ కళ్ళలో ఆకర్షణని గుర్తుపట్టింది. ఆమెకది గర్వ కారణం. అప్పుడామె ఏకాకి. ఇటు ఆకర్షితుడైన మగాడు. మగాడిని త్వరగా ఆకర్షించేది ఏది?

జాకెట్టు మీద మీ చెయ్యి. జాకెట్టుకి ఏది దగ్గర తోవ? టైలర్ పనివాడితనం. ఆమె స్త్రీ. సృష్టి సహజమైన అన్ని బాణాలూ సంధించగల స్త్రీ. ఒకటే ఆమెకి కలిసిరాలేదు. శరీరం" నాకు నోటమాట రాలేదు.

"నాకెందుకు అబద్ధం చెప్పాలి?" అన్నాను ఆలోచనలని కూడదీసుకుని. దుర్గ నవ్వాడు. "మీరు అబద్ధాన్ని చూస్తున్నారు. కాని ఆమెపట్ల ఆకర్షణని పెంచుకున్న మగాడి 'కోరిక'ను ధ్వంసం చెయ్యని ఆమె ఔదార్యాన్నీ, తన నిస్సహాయతను మీతో చెప్పుకుని భోరుమనే బేలతనాన్నీ చూపలేదు. Her disease could not break her dignity"

"టైలర్ కాకపోతే ఎవరామె?"

"తమ్ముడిని చదివించడంకోసం ఒక ఫ్యాన్సీ షాపులో సేల్స్‌గర్ల్‌గా పనిచేస్తోంది. ఆమె అనారోగ్యం ఆమెని ఎక్కువ బాధపెట్టలేదు.తన తమ్ముడి చదువు పూర్తికాకుండా- తనుపోతే తన సహాయం నిలిచిపోతుందేమోనని విలవిలలాడింది. తమ్ముడు పరీక్ష పాసయ్యాడని తెలిసిన రెండో రోజు ఆమె అనారోగ్యం తిరగబెట్టింది. తన cinvic-tion తో రోగాన్ని ఆమడ దూరంలో నిలిపిన ధైర్యస్తురాలు"

"కాని ఏ ఆడదీ ఎవరితోనూ చెప్పుకోలేని విషయాలన్నీ మీకెలా చెప్పింది?"

దుర్గ నవ్వాడు."ఆమె అందరిలాంటి ఆడది కాదు. కాగా, ఆనాడు మీరు ఆమెని కోరుకోవడం ఆమె స్త్రీత్వానికి విజయం. ఆమెకు గర్వకారణం. తాను రోగంతో వెళ్ళిపోతున్నాననే సానుభూతి కాదు.

బతికినప్పుడు తను కావాలనుకున్నవారున్నారనే గర్వాన్ని జతచేసుకోవాలని ఆమె తాపత్రయం. ఈ విషయాలు ఆమె ఆభిజాత్యానికి ప్రతీకలు. నిజానికి ఆమె మిమ్మల్నీ, మీ అందాన్నీ ప్రేమించలేదు. తను మరొకరితో ప్రేమించబడడాన్ని ప్రేమించింది"

అంత విషాదంలోనూ నాకు నవ్వొచ్చింది. "మీరు వైద్యులు మాత్రమే కారు" అన్నాను. దుర్గా నవ్వాడు. "అవును. నా మిత్రులు నన్ను 'సెంటిమెంటల్ ఫూల్' అంటారు. ఇంగ్లీషులో కవిత్వం రాస్తాను. క్లినికల్ సైకాలజీ నాకు ఇష్టమైన సబ్జెక్టు. బతుకుతెరువుకి 'ఆంకాలజీ'ని ఎంచుకున్నాను"

> సినీరంగంలో నేర్పుగా వ్యవహరించాలంటే ఓర్పు అవసరం... ఈ రంగంలో నెగ్గాలంటే కొన్ని విషయాలు కీలకం. -అనుఇమ్మాన్యుయేల్, నటి

ఇంత జరిగాక ఆమెని చూడాలని మనసు తొందరపెడుతోంది. గదిలోకి వెళ్ళడానికి ముందుకు అడుగువేశాను. దుర్గ నాకు అడ్డు వచ్చాడు.

"ఆమెని చూసేముందు కొన్ని విషయాలు చెప్పాలి. మీరు ఆ రోజు మృత్యువునుంచి ఆమెని కాపాడారు. కాని అప్పటికే మరో మృత్యువు ఆమె శరీరంలో ఉంది. ఆరెండో మృత్యువుని ఆమె మీతో అలంకరించుకుంది. అందుకనే ఇప్పుడు- తన జీవితం ఆఖరిక్షణాల్లో మిమ్మల్ని కలుసుకోవాలని తాపత్రయపడింది"

నేను కదిలిపోయాను.అతను చెప్పుకుపోయాడు. "చూడండి. ఈ తలుపు తెరుచుకున్నాక మీరు షాక్ అవుతారు. చినపాప మీరు ఆనాడు చూసిన చినపాప కాదు. రేడియేషన్ 'కీమో థెరపీ'తో జుత్తు పూర్తిగా ఊడిపోయింది.నలిగి నలిగి పుల్లలాగా అయిపోయింది. ఆమెని చూశాక మీరు భయపడతారు.

కాని నటించడానికి ఇప్పటినుంచీ సిద్ధం అవ్వండి. ఈ ఆఖరి క్షణాలు ఆమె సంపాదించుకున్న విలువైన ఆస్తులు. మీరు ఆనాటి గుంతకల్లు చినపాపనే చూస్తున్నట్టు ఆమెకి అనిపించాలి. అప్పటి ఉత్సాహంతోనే పలకరించాలి" దగ్గరికి ఒంగి "ముద్దుపెట్టుకోవడం మరిచిపోకండి"

నేను చికాకుగా చూస్తే "ఇది డాక్టరుగా ఆమె ఉపశమనానికి నేను ఇస్తున్న ప్రిస్క్రిప్షన్" అని తలుపు తెరిచాడు. దుర్గ ముందుగా నన్ను సిద్ధం చెయ్యకపోతే నేను షాక్‌తో తల్లకిందులయిపోయేవాడిని. చినపాప నేను చూసిననాటి చినపాప కాదు. జీవచ్ఛవం.

తలుపు అలికిడికి తల తిరగలేదు. కళ్ళు మాత్రం తిరిగాయి. ఆ చిన్న వెలుగులో నన్ను గుర్తుపట్టింది. చిన్న నవ్వు వెలిసింది. అతికష్టంమీద చెయ్యి ఎత్తాలని ప్రయత్నిస్తోంది. దగ్గరికి వెళ్ళి చెయ్యి అందుకుని పక్కన ఉన్న బల్ల మీద కూర్చున్నాను. ఆ దృశ్యానికి తేలికగా భోరుమనేవాడిని. దుర్గ పెద్ద ఉపకారంచేశాడు. నేను నటించాలి. మరిచిపోకూడదు.

"నాకు చెప్పడానికి ఇంత ఆలస్యం చేశావేం?" అన్నాను. చినపాప కళ్ళనిండా కృతజ్ఞతని పూరించింది. "పాపా! నువ్వు పెద్ద యోధురాలివి. నిన్ను జీవితంలో మరిచిపోలేను. ఇంత ప్రేమని- ఇలాంటి ప్రేమని నేను ఎన్నడూ చూడలేదు"

నా చేతిలో ఆమె వేళ్ళు బిగుసుకున్నాయి. అలా ఎంతసేపు కూర్చున్నానో. డాక్టర్ ప్రిస్క్రిప్షన్ గుర్తుకొచ్చింది.

ఒంగి కళ్ళు మూసుకున్న ఆమె పెదాల మీద ముద్దుపెట్టుకున్నాను.

పెదాలు ఇప్పుడు అరిగిపోయిన ఆకు రాయిల్లాగా గట్టిపడి ఉన్నాయి.ఆమె కళ్ళు 'హాయిగా' విప్పారాయి. ఆ మాట ఆమె జీవితానికి ఆఖరిసారి. అంతే. మెల్లగా మూసుకున్నాయి. నా చేతిలో ఆమె చెయ్యి సడలిపోయింది.ఆ శరీరంలో జీవ లక్షణం పూర్తిగా సెలవు తీసుకుంది"

ఎంతసేపు కూర్చున్నానో. లేచాను. చల్లబడుతున్న చినపాప ముఖంలో గొప్ప విషాదం నుంచి విడుదలైన ఆటవిడుపు కనిపిస్తోంది.

ఆ చిన్న జీవితంలో ఆకాస్త ఆనందానికి 'వాటా' నాదా? బయటికి వచ్చాను. దుర్గ గోడకి ఆనుకుని నిలబడిఉన్నాడు. భుజంమీద చెయ్యి వేశాను. "వెళ్ళిపోయింది" అన్నాను. ఇటు చూశాడు. భోరుమన్నాడు. "డాక్టరుకి కన్నీళ్ళు రావు. కాని నేనిప్పుడు సెంటిమెంటల్ ఫూల్‌ని-కవిని"

"You know, the love started when you stopped her die. It ended when you gifted her death with your love"

నాతో రిక్షాదాకా నడిచాడు.

"మీరు అడగలేదు.కాని చెప్తున్నాను.ఆమెని మోనా లిసా, వీనస్, ఊర్వశి స్థాయిలో నిలుపుతాను"

"నాకవేవీ తెలియవు" అన్నాను.

నవ్వాడు దుర్గ. "కవిత్వం పాఠకుడిని వెతుక్కోదు. పాఠకుడు కవిత్వానికి దొరుకుతాడు" నర్సింగ్‌హోమ్ వేపు చూస్తూ అన్నాడు.

A flower bloomed with radient splendour But withered without fulfilling its candour

రిక్షా నడుస్తోంది. రిక్షా నడుస్తూనే ఉంది. (జెఫ్రీ ఆర్చర్ 'వన్ మాన్స్ మీట్...' చదివిన స్ఫూర్తితో.)

# అంతా రాజకీయమే

## వస్తాడంటే భయం

మీ పార్టీతరఫున వచ్చి ప్రచారంచేస్తానని ఎవరైనా అనగానే ఎగిరి గెంతేసి పలుకుతుంటాయి పార్టీలు. ఆ వచ్చే నేతవల్ల పది ఓట్లన్నా కొత్తగా రాకపోతాయా! అనేది ఆశ. అందునా గెలిచితీరాలనుకుంటున్న పార్టీలో అటువంటి ఆశ వుండటం సహజం.

కాని గుజరాత్ ఎన్నికల్లో చావో, బతుకో తేల్చుకుంటున్న కాంగ్రెస్ మాత్రం ఎవరు ప్రచారానికొచ్చినా పరవాలేదు కాని ఆయన్నిమాత్రం రావద్దని చెప్పండి అంటున్నది. ఆ నేతే లాలూప్రసాద్ యాదవ్. నేను వచ్చి కాంగ్రెస్ తరఫున ప్రచారంచేస్తా అని లాలూ ముందుకొచ్చినా సరే, రా అని ఒక్క కాంగ్రెస్ నేత అనకపోవటంతో లాలూప్రసాద్ అహం దెబ్బతిన్నది.

గుజరాత్‌లో అవినీతి అంశాన్ని ప్రధాన అంశంగా చేసి తాము ఎన్నికల యుద్ధంలో దిగిన వేళ అవినీతి కేసులో శిక్షపడి బెయిల్‌మీద బయట వున్న లాలూ ప్రసాద్ యాదవ్‌ని వెంటతీసుకుని తిరిగితే ఇంకేమన్నా వుందా! అని కాంగ్రెస్ నేతలు భయపడుతున్నారు. 'నన్ను ఒక్కడిని అవినీతికి ప్రతీకగా చేస్తారా' కాంగ్రెస్‌వారు అన్నది లాలూ బాధ.

చెప్పాపెట్టకుండా దిగి కాంగ్రెస్‌కి తన తడాఖా చూపిస్తాడేమోనని కాంగ్రెస్ భయపడుతోంది. ◆

## అంతా బహిరంగమే

తెలంగాణ ముఖ్యమంత్రి కె.సి.ఆర్. అభద్రతా భావంతో మాట్లాడుతున్నట్టుగా కనిపిస్తోంది.

కాంగ్రెస్ పార్టీ పుంజుకుంటున్నదని ఆయనే స్వయంగా అంగీకరించినతరువాత ఒంటరి పోరాటం కన్నా కొన్ని ముఖ్య వర్గాలను కలుపుకోకపోతే కష్టం అనే ఆలోచనకు ఆయన వచ్చినట్టున్నాడు.

అందుకే మజ్లీస్‌ని మెప్పించేందుకు కె.సి.ఆర్. యత్నంచేస్తున్నాడు. మరోవైపు గ్రామ ప్రాంతాలలో తన ఓటుబ్యాంక్‌ను పటిష్టం చేసుకునేందుకు రైతు సంఘాలను రాజకీయం చేస్తున్నాడు.

అందులో రైతులు వుంటారో లేదో తెలియదు కాని మొత్తం టి.ఆర్.ఎస్. కార్యకర్తలతోనే నింపుతా అంటూ అసెంబ్లీ సాక్షిగా సెలవిచ్చాడు.

గతంలో కాంగ్రెస్, టి.డి.పి. ప్రభుత్వాలు అలాగే నియామకాలు చేశాయని, అలాంటప్పుడు తాను మాత్రం టి.ఆర్.ఎస్. కార్యకర్తలకు ఎందుకు తాయిలాలు ఇవ్వకూడదనేది కె.సి.ఆర్. ప్రశ్న. నిజమే ఆ తరువాత ఆ రెండు పార్టీలనూ తిరస్కరించిన ఓటర్లు టి.ఆర్.ఎస్‌ని మాత్రం ఎందుకు తిరస్కరించకూడదన్నది లాజిక్. ◆

## కళ్ళ ఎదుట నిర్లక్ష్యం

కృష్ణానదిలో పడవ ప్రమాదం 20కిపైగా మృతులు అనేది ఒక విషాదం. ఆ విషాదం వెనకున్న ప్రభుత్వం పనితీరును వివరించాల్సిన పరిస్థితి రాష్ట్ర సి.ఎమ్. చంద్రబాబునాయుడిది. ఆ పడవ నడిపే సంస్థకు లైసెన్స్‌లేదు,ఆ పడవ నడిపేవాడికి అనుభవంలేదు.

ఇవన్నీ ఇప్పుడు ప్రభుత్వం తరఫున చెపుతున్న విషయాలు. అయితే అసలు ఆ పడవ కృష్ణానదిలోకి ఎలా వచ్చింది! అదేమీ నీటిపక్షి కాదుకదా అలా ఆకాశంలోనుండి ఎగురుకుంటూ వచ్చి కృష్ణానదిలో వాలటానికి. దానిని నీటిలోకి దించటమనేది పెద్దతతంగమే. అంత పెద్ద నావ ప్రకాశం బ్యారేజ్ రిజర్వాయర్‌లోకి దిగుతుంటే అధికార యంత్రాంగం ఏంచేస్తున్నది.

రోడ్డు పక్కన పార్క్‌చేసిన కార్లమీద చేసేంత హడావుడి నదిలో పార్క్‌చేస్తున్న పడవల విషయంలో చూపించరా! అనేది ప్రశ్న.

ఎవరికి వారు ఇలా పడవలు యథేచ్ఛగా నదిలో దింపుకుంటుంటే కళ్ళు మూసుకున్న ప్రభుత్వం ముంబయిలో సముద్ర మార్గంగుండా పడవలో వచ్చిన పాకిస్తానీ ఉగ్రవాదుల గురించి ఒక్కసారి గుర్తుతెచ్చుకోవాలి. ముఖ్యమంత్రి అధికార నివాసానికి అనధికార పడవ ప్రయాణం అంటే భద్రత లోని డొల్లతనం విస్పష్టం. ◆

## పథకంలో భాగమేనా!

మరేదో కార్యక్రమంకోసం చెన్నై వెళ్ళిన నరేంద్ర మోడీ ముందస్తుగా చెప్పకుండానే డి.ఎమ్.కె. కురువృద్ధుడు కరుణానిధి ఇంటికెళ్ళి పరామర్శించే నిర్ణయం తీసుకున్నట్టు బయటకు కనిపిస్తున్నా దానివెనుక ముందస్తు ప్రణాళిక ఉందనే అర్థమవుతుంది.

విదేశంలో వున్న కరుణానిధి కొడుకు, రాజకీయ వారసుడు స్టాలిన్ తన కార్యక్రమాలను రద్దు చేసుకుని హుటాహుటిన చెన్నై చేరాడు.

నిజానికి ప్రధానమంత్రి నరేంద్రమోడీని గాని, మరొకరిని గాని గుర్తించే స్థితిలో, మాట్లాడే స్థితిలో కరుణానిధి లేడు. అందుకని అసలు మాటలు స్టాలిన్‌తోనే జరిగివుంటాయి.

ఆ పలకరింపుల ప్రహసనం ముగిసిన మరుసటి రోజునుండే కేంద్ర దర్యాప్తు బృందాలన్నీ చెన్నైలోని శశికళ వ్యాపార విభాగాలు, టీ.వీ. ఛానళ్ళు, ఇళ్ళమీద దాడులుచేసి వేలకోట్ల నల్లడబ్బును వెలికితీశాయి.

పైగా శశికళ ఇంట్లో భూగర్భంలో నిక్షేపాలు దాచిపెట్టిన మాళిగ వుందని దానిని కనుక్కున్నామంటున్నారు. ఇదంతా వచ్చే ఎన్నికల్లో అన్నా డి.ఎమ్.కెని కాక డి.ఎమ్.కె.తో అంటకాగటం మంచిదన్న ఆలోచన అమిత్‌షాకి కలగటంవలనే జరుగుతున్నాయా! ◆

## రాజకీయ వాయిదా

పార్లమెంట్ శీతాకాల సమావేశాలకు రాజకీయ వాయిదా తప్పలేదు. సాధారణంగా నవంబర్, డిశంబర్‌లలో జరిగే ఆ సమావేశాలు ఈసారి డిశంబర్ రెండవ వారంవరకు మొదలుపెట్టేలాలేదు.

సభలు ఎప్పుడు నిర్వహించాలనేది ప్రభుత్వ నిర్ణయమే అయినా సాంప్రదాయాలకు పెద్దపీటవేయటం ప్రజాస్వామ్యంలో ముఖ్యం. కాని గుజరాత్ ఎన్నికలు, అక్కడ ఎన్నికల ప్రచారంలో అధికార పార్టీ నేతలు తలమునకలయివుండటంతోపాటు జి.ఎస్.టి., పెద్ద నోట్ల రద్దుమీద ప్రతిపక్షాలు రెచ్చిపోవటం బి.జె.పికి ఇబ్బందిగా మారింది.

పార్లమెంట్‌ని సమావేశపరచి దానిని ప్రతిపక్షాల గుజరాత్ ఎన్నికల ప్రచారానికి వేదికగా అప్పగించి నష్టపోవటం ఎందుకని భావించిన ప్రభుత్వం పార్లమెంట్ సమావేశాల వాయిదావైపు మొగ్గింది. ఎప్పుడు ప్రారంభిస్తారో ఇంతవరకు చెప్పలేదు.

బహుశా గుజరాత్‌లో ఓటింగ్ ముగిసేవరకు పార్లమెంట్ విషయాల ఊసును ప్రభుత్వం ఎత్తకపోవచ్చు. తద్వారా తమది కాంగ్రెస్ ప్రభుత్వంకన్నా భిన్నమేమీ కాదని మరోమారు నిరూపించుకుంది బి.జె.పి. ◆

## ఎంతకైనా దిగజారుడు

షేక్ అబ్దుల్లా కుటుంబం కాశ్మీర్ తమ సొంత ఆస్తి అనుకుంటారు. దాని విషయంలో ఎలా మాట్లాడినా చెల్లిపోతుందన్న భావన వారిది.

ఒకే వంశంలో తాతనుండి మనుమడివరకు ముఖ్యమంత్రులుగా చేశారు ఆ రాష్ట్రానికి.

నిజానికి ఆ రాష్ట్ర ప్రధాన సమస్య ఏమిటో వారికి బాగా తెలిసివుండాలి. కాని అధికారం కోల్పోగానే దిగజారుడు మాటలు ఆ కుటుంబం నోటి నుండి మామూలుగా వస్తుంటాయి.

జమ్మూ, కాశ్మీర్ మొత్తం భారతదేశంలో అంతర్భాగమని పార్లమెంట్‌లో ఏకగ్రీవ తీర్మానం జరిగింది. ఆ సమయంలో అబ్దుల్లా కుటుంబం నుండి ఎవరో ఒకరు పార్లమెంట్‌లో సభ్యులైవుంటారు. వారి పార్టీ నేషనల్ కాన్ఫరెన్స్ ఆ తీర్మానంలో భాగస్వామి.

అది తెలిసి కూడా 'పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్ పాకిస్తాన్‌దే' అది ఇక భారతదేశానికి దక్కేది కాదు అనే ప్రకటన ఫరూక్ అబ్దుల్లా చేశాడు. అటువంటి ప్రకటన చెయ్యాల్సిన అవసరం ఏమిటి!

కాశ్మీరీ సమస్యమీద పరిష్కారంకోసం కేంద్ర ప్రభుత్వం ప్రయత్నిస్తున్న వేళ పాకిస్తానీ అనుకూల ప్రకటన చెయ్యటంలోని కుతంత్రం ఏమిటో ఫరూక్ అబ్దుల్లానే వివరించాల్సివుంటుంది. ◆

# ఎవరి సొంతమో

ఎవరేమనుకున్నా, ఎన్ని రూమర్లు, కబుర్లు తన చుట్టూ కమ్మేస్తున్నా తన పనేదో తాను చేసుకు పోవడం బాలీవుడ్ తార కత్రినాకైఫ్ అలవాటు.

కేర్‌నాట్ ధోరణి తొలినుంచి ఆమెలో కనపడు తూనేవుంటున్నది. బ్రేకప్‌లు, మేకప్‌లు షరా మామూలే. ఆమెతో ఇంటర్వ్యూ, విశేషాలు:

**కెరీర్ సంతృప్తిగా సాగుతున్నదా?**

ఎంతో. సంతృప్తిగా ఉంది. సంతోషంగా సాగు తున్నది. పరిశ్రమలోకి వచ్చినప్పుడు నటిగా నాకు ఎటువంటి శిక్షణా లేదు. డ్యాన్స్ చేయడం తెలియదు. మాట్లాడటమూ రాదు. ఇన్నేళ్ళలో నటనలో కానీ యండి, ఇతరత్రా కానీయండి- సినిమాలు చేస్తూ సెట్స్‌లోనే నేర్చుకున్నాను.

**మంచి పరిజ్ఞానం వచ్చిందంటారు?**

(నవ్వేస్తూ) అవుననే చెప్పాలి. సెట్స్‌లో నేను చాలా ప్రశాంతంగా ఉంటాను. నాపనిని ఎంతగానో ఎంజాయ్ చేస్తాను. హార్డ్‌వర్క్ అలవాటుగా మారింది.

**ఎప్పుడైనా టెన్షన్ పడుతుంటారా?**

పడనని చెప్పలేను. పనిని ఎంజాయ్‌చేస్తున్నప్పుడు టెన్షన్ ఏముంటుంది. పనిని ఎంజాయ్ చెయ్యలేక పోయినప్పుడుమాత్రం టెన్షన్‌గానే ఉంటుంది.

ఎందుకంటే బుర్రలో అనేక విషయాలు తిరుగు తుంటాయి. ఇన్నాళ్ళ అనుభవంలో, పరిజ్ఞానాన్ని సంపాదించిన తర్వాత నియంత్రణ అలవడింది.

సెట్స్‌లో ఇటువంటి కంట్రోల్ ఉన్నప్పుడు తప్పనిసరిగా ఎంజాయ్‌మెంట్ అనేది దక్కుతుం దన్నది నా నమ్మకం.

**మీ జీవితంలో ప్రేమకు సంబంధించి అదృష్టం లేదన్న భావం ఉంటుందా?**

అదృష్ట, దురదృష్టాల సంగతి పక్కనాపెడితే, ప్రేమలో ఉన్నవారు, ప్రేమను అనుభవించినవారు మాత్రం లక్కీయే అనుకుంటాను.

**పెళ్ళిపట్ల మీ అభిప్రాయం?**

పెళ్ళంటే రెండు జీవితాల కలయిక. వారి శరీ రాలు, ఆత్మలు, మనస్సులు ఒక్కటే. కుటుంబమే ప్రపంచం అన్నంతగా ప్రేమించాలి. ఎంతలా అంటే మా అమ్మకు నేనే లోకం అన్నంతగా.

**మీ దృష్టిలో ప్రేమంటే?**

ప్రేమంటే ఇద్దరు వ్యక్తుల నడుమ ఉండే అవగా హన, అనుబంధం.

**ప్రేమకథలకి సుఖాంతముం టుందనే భావిస్తున్నారా?**

తప్పకుండా వుంటుంది. ఐతే అది ప్రేమలో గల వ్యక్తుల అభి ప్రాయాల్నిబట్టి వుంటుంది.

ఆ ప్రేమికుల నడుమ పరస్పర అవగాహన, నియంత్రణ ఉన్నప్పుడు సక్సెస్ అవుతుంది.

**మహిళా ప్రాధాన్యంగల యాక్షన్ రోల్ చేస్తారా?**

(నవ్వేస్తూ)ఎందుకు చెయ్యను?

**మీరు కొంచెం కేర్‌లెస్‌గా వుంటారంటే మీ కామెంట్?**

నాకు మీడియాతో మొదటినుంచి ఇంటరాక్షన్ లేదు. నా పనులేవో నేను చేసుకుంటూ పోతుంటా. ఐతే, అందరితోనూ స్నేహంగానూ, సంతోషంగానూ వుంటాను. ఎవరేమనుకున్నా నేనేం చేయలేను అని చెప్పింది కత్రినాకైఫ్.

**అయినపూరి సుజాత**











# వసంతసేనా చారుదత్తం



సీరియల్

“అక్కర్లేదు చెప్పు!” అన్నాడు విటుడు.

“అరిగిపోయిన రాతిముక్క చేత్తో పట్టుకొని, కత్తితో పురుషుల గడ్డాలు గొరిగి, కత్తెర చేతిలో ఆడించే వాడవు, నువ్వెప్పుడు సేనాపతివయ్యావు?”

“ఒరే చందనా! నువ్వా గౌరవంగా నగరంలో చెలామణి అవుతూ నీ కులమేదో మరిచిపోయినట్టున్నావు”

“ఒరే! నాకేమిత్రా, చందనకుడి జాతి చంద్రుడంత శుద్ధమైంది!” “ఎందుకు చెప్పడం!” అన్నాడు విటుడు.

“చెప్పు, చెప్పు”

“విను, నీ జాతి అంత స్వచ్ఛమయిందేం? నీ తల్లి భేరి, నీ తండ్రి తప్పెట, సోదరుడు డోలు, పాడు మొహం నువ్వూ. ఇప్పుడు సేనాపతివయ్యావు”

“అంటే నేనంత తక్కువవాడినా?” అన్నాడు కోపంగా చందనకుడు.

“ఒరేయ్ బండివాడా! బండి తిప్పు పరీక్షించాలి. బండివాడు బండిని వెనక్కితిప్పాడు. వీరకుడు బండి ఎక్కబోతాడు. చందనకుడు హఠాత్తుగా వీరకుడి జుట్టు పట్టుకొని, కిందపడేసి కాలితో తన్నాడు.

వీరకుడు కోపంగా లేచి, “ఒరేయ్, నమ్మకంగా నేను రాజాజ్ఞ నెరవేరుస్తూవుంటే హఠాత్తుగా జుట్టు పట్టుకొని, కాలితో తంతావా! వినురా, విను! న్యాయసభలో తగాదా పెట్టకపోతే, నేను వీరకుణ్ణి కాను” అరిచాడతను.

“పోరా రాజుగారి దగ్గరికో, న్యాయస్థానానికో వెళ్ళు. పోరా కుక్కా నీతో నాకేం పనీ?” అంటూ గట్టిగా అరిచాడు చందనకుడు.

“చూస్తా, నీ అంతు” అని గుర్రాన్ని అధిరోహించి, రోషంగా అక్కడ్నుంచి నిష్క్రమించాడు వీరకుడు. చందనకుడు నలువైపులా చూసి, “వెళ్ళరా, బండివాడా! వెళ్ళు. తోవలో ఎవరైనా అడిగితే, చందన, వీరకులు బండి పరిశీలించారని చెప్పు. అమ్మా! వసంతసేనా! ఈ గుర్తు నీ దగ్గర ఉంచు” అంటూ చందనకుడు లోపలున్న ఆర్యకుడికి కత్తిఇచ్చాడు”

ఆర్యకుడు కత్తి అందుకున్నాడు సంతోషంగా. కానీ కుడిభుజం అదురుతోందేనని భయపడ్డాడు. పోనీ ఏదోవిధంగా బ్రతికిపోయానని సంతోషించాడు. “అమ్మా! వసంతసేనా! నిన్ను నమ్మి ఈ మాట అంటున్న చందనకుణ్ణి జ్ఞాపకం ఉంచుకుంటావా?

నేనేదో ఆశపడి నీతో ఈ మాట అనడంలేదు. కేవలం స్నేహబుద్ధితో చెబుతున్నాను” అన్నాడు చందనకుడు ఆర్యకుడ్ని ఉద్దేశించి.

దైవికంగా చంద్రశీలుడైన చందనకుడు తనకు ఇప్పుడు మిత్రుడైనాడు. సిద్ధుడు చెప్పినదే నిజమైతే, తప్పకుండా చందనకుణ్ణి జ్ఞాపకండుంచుకోవాలనుకున్నాడు ఆర్యకుడు. అతడి మనసంతా చందనకుడిపట్ల కృతజ్ఞతాభారంతో నిండిపోయింది.

“శివుడు, విష్ణువు, బ్రహ్మ, సూర్యుడు, చంద్రుడు, శుంభనిశంభులను చంపిన పరమేశ్వరి నీకు అభయమివ్వాలి” అంటూ ప్రార్థించాడు చందనకుడు. బండివాడు బండిని ముందుకు పోనిచ్చాడు. తనవెనుకే శర్విలకుడ్ని చూశాడు చందనకుడు.

సరే, నగర రక్షకులలో ప్రధానుడై, రాజుగారి విశ్వాసపాత్రుడైన వీరకుడితో విరోధం తెచ్చుకున్నాను.

ఏది ఏమైనా పుత్రులు, సోదరులతో ఈ శర్విలకుణ్ణే అనుసరిస్తాననుకున్నాడు చందనుడు. “భలా! మిత్రుడివే కాదు, ఆత్మబంధు వనిపించుకున్నావు. నీ ఉద్యోగధర్మాన్ని కూడా న్యాయం కోసం పణంగా పెట్టావు.

నీకోసం ప్రాణాలివ్వడానికైనా నేను సిద్ధమే మిత్రమా!” అంటూ శర్విలకుడు వచ్చి, చందనకుడిని ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. “నేను చేసింది ధర్మమో, అధర్మమో కాలమే తేల్చాలి” అన్నాడు చందనకుడు.

అది పుష్పకరండక ఉద్యానవనం. ఆ ఉద్యానవనంలో చారుదత్తుడితో, మైత్రేయుడు కూడా వున్నాడు. చారుదత్తుడు అటునుంచి ఇటు, ఇటునుంచి అటు పచార్లు చేస్తుంటాడు. వసంతసేన రాకకోసం నిరీక్షిస్తున్నాడతను.

“మిత్రమా! ఈ ఉద్యానవన శోభ చూడు, చూడు!” అన్నాడు మైత్రేయుడు. “అవును మిత్రమా! ఈ చెట్లు వర్తకులవలె పువ్వులనే సరుకులను అమ్మజూపుతుండగా, తుమ్మెదలనే రాజపురుషులు పన్ను వసూలుచేయడానికి తిరుగుతున్నట్లుంది!” అని అన్నాడు చారుదత్తుడు.

“తీర్చిదిద్దకపోయినా, ఈ రాతిపలక ఎంతో చక్కగావుంది. దీనిమీద కూర్చో” మైత్రేయుడి మాటననుసరించి, చారుదత్తుడు అక్కడ కూర్చున్నాడు. “మిత్రమా! ఎందుచేతనో వర్ధమానుడు ఆలస్యం చేస్తున్నాడు” అన్నాడు.

“వర్ధమానుడితో నేను చెప్పాను సుమా! వసంతసేనని తీసుకొని త్వరగా రమ్మని” “అయితే ఎందుకీ ఆలస్యం? అతని ముందు ఏదైనా బండి అడ్డొస్తే, మెల్లగా వస్తున్నాడేమో? ఇరుసు విరిగితే మార్చుకుంటున్నాడేమో? లేక పగ్గం తెగిపోయిందేమో! తోవలో ఏవైనా దుంగలు ఏమైనా అడ్డమొస్తే, త్రోవ చేసుకుంటూవస్తున్నాడేమో! లేకపోతే ఎడ్లు నెమ్మదిగా నడుస్తూవుంటే తనూ నెమ్మదిగా వస్తున్నాడేమో!?”

చారుదత్తుడి అసహనమంతా ప్రశ్నల రూపంలో బయటికొచ్చింది.

“ఆడవాళ్ళ అలంకారాలు తొందరగా ముగియవు కదా! వసంతసేన అలంకారం చేసుకుంటూ ఆలస్యం చేసిందేమో?”

మైత్రేయుడు తన మనసులోని మాటను నెమ్మదిగా చెప్పాడు.

ఖిలందర్



## జరిగిన కథ

10

వసంతసేన చెలికత్తె ఇచ్చిన బంగారునగను చూసి మనింట్లో దొంగ ఎత్తుకుపోయిన నగే ఇదే అని చారుదత్తుడికి చెబుతాడు మైత్రేయుడు.

వర్షంలో తడుస్తూ వసంతసేనను తన ఇంటికి తీసుకువెళ్ళి తన శయ్యామందిరంలో ఆమెతో సుఖిస్తాడు.

చారుదత్తుని భార్య ధూతాంబ తననెంతగానో ఆదరించినందుకు కృతజ్ఞతలుచెప్పి తను తెచ్చిన రత్న మాలను ఆమె మెడలో అలంకరిస్తుంది వసంతసేన.

ఆడుకునేందుకు బంగారుబండి కావాలని ఏడుస్తున్న చారుదత్తుని కొడుక్కి తన నగలను ఇస్తుంది, ఆ బండిని అలంకరించుకోమని.

ఆర్యకుడు తన ప్రియమిత్రుడైన శర్విలకుడి వల్ల రాజుగారి చెరసాల నుండి బయటపడి వసంతసేన బండిలో తప్పించుకువెళ్తాడు.చారుదత్తుడ్ని, వసంతసేనను వీరకుడి వద్ద పొగుడుతాడు చందనకుడు.

ఆర్యకుడికి అభయమిచ్చిన చందనకుడు మరో సేనాధిపతి యైన వీరకుడితో గొడవపడతాడు. ఆ తర్వాత జరిగేది చదవండి.

అంతలో ఆర్యకుడు ఉన్న బండితో బండివాడు "ఏహేయ్, నడవండి నడవండ"ంటూ ఎడ్లను అదిలిస్తూ బండిని ఆ ఉద్యానవనం వైపుకు తెచ్చాడు.

రాజపురుషులు చూస్తారేమోనని భయపడుతూ, ఇంకా కాలికి ఒక గొలుసు మిగిలి స్వేచ్ఛగా పోవడానికి వీల్లేక పెద్దమనిషి బండియెక్కి,

ఆడ కాకులు కాపాడిన కోకిలలా పోతున్నాను. ఒహో! నగరం నుంచి చాలా దూరమే వచ్చాను.

వెంటనే ఈ బండి దిగి, చెట్ల గుబురులోకెళ్ళి దాక్కుందామనుకున్నాడు ఆర్యకుడు. చెట్లగుబురులో ఉండడమెందుకు?

ఆశ్రయించినవారిని దయతో చూస్తాడని ఆర్యచారుదత్తుడికి పేరు. ఆయనను చూసే వెడతాను. ఆయన కూడా చెరలోంచి కొత్తగా బయటపడిన నన్నుచూసి సంతోషిస్తాడు.

ఆ మహానుభావుడి దయవల్ల, మంచిపేరువల్ల ఈ శరీరం ఇట్లా నాకు నిలిచిందనుకుంటూ,ఆర్యకుడు చారుదత్తుడిని కలిసే వెళ్ళాలని చివరికి నిర్ణయించుకున్నాడు.

వర్ధమానుడు బండి ఆపి,"అయ్యా! మైత్రేయా!" అని అరిచాడు.

"మిత్రమా! మేలు మేలు. మాటలలోనే వర్ధమానుడి బండి వచ్చేసింది. వసంతసేన వచ్చివుంటుంది" అంటూ మైత్రేయుడు లేచాడు.

"మంచిది" అంటూ చారుదత్తుడు కూడా లేచాడు. వచ్చిన బండివాడిని చూసి,"తొత్తు కొడుకా!ఇంత ఆలస్యం చేశావేమిరా?" అని కోపగించుకున్నాడు మైత్రేయుడు.

"కోపగించుకోకండయ్యా! బండి పరుపు మరచిపోయి, రాకపోకలతో ఆలస్యమైంది" అన్నాడు బండివాడు వినమ్రంగా.

"వర్ధమానకా!ఇక ఆలస్యమెందుకూ? మిత్రమా, వసంతసేనను దింపు" తొందరచేశాడు చారుదత్తుడు.

"ఏమీ, ఆమె స్వయంగా దిగలేకపోవడానికి కాళ్ళు ఎవరైనా కట్టేశారా?" అంటూ మైత్రేయుడు బండిలోకిచూసి, "ఏమయ్యోయ్! బండిలో వున్నది, వసంతసేన కాదు, వసంతసేనుడు" అని అరిచాడు.

"చాలు, నీ నవ్వుతాలు, నీ హాస్యం. స్నేహం ఆలస్యం సహించదు. నేనే

## కథకే ప్రాధాన్యం

తెలుగులో అరకొర సినిమాలతోనే బిచాణా సర్దేసి తమిళ, మలయాళ పరిశ్రమల్లో రాణించింది అమలాపాల్. రెండో ఇన్నింగ్స్ లోనూ కోలీవుడ్‌లోనే కూతపెట్టేసింది. ఎందుకిలా అని అడిగితే, అక్కడ మంచి కథలు, పాత్రలు లభించాయంటున్నది.

"నేనెప్పుడూ మంచి కథను తెరకు ఎక్కించే దర్శకుడు ఎవరా అని వెతుకుతాను. ఉద్వేగానికి లోనయ్యే కథలకే నేను ప్రాధాన్యం ఇస్తుంటా. ఇటువంటి చిత్రాల్లో నటనకు ఆస్కారం ఎక్కువగా వుంటుంది" అని చెప్పింది అమలాపాల్.

---

దింపుతాను" అని చారుదత్తుడు బండి లోకిచూశాడు. ఆర్యకుడు చారుదత్తుడ్ని చూసి, ఇతడేనా ఈ బండి యజమాని? వినడానికే కాదు, చూడడానిక్కూడా మనోహరుడు!

ఆహా ఈయన ఆశ్రయం దొరకడం మహాభాగ్యం అనుకున్నాడు.

"ఇతడెవరు? ఏనుగుతొండంవంటి బాహువులు, సింహంవంటి భుజాలు, బలసిన వక్షస్థలం, ఎర్రజీరల కళ్ళు! ఇట్టి మహాపురుషుడు కాలిగొలుసుతో ఇట్టి దుర్దశ అనుభవిస్తున్నాడేమిటి?" అంటూ, "అయ్యా ఎవరు నువ్వు?" అని అడిగాడు చారుదత్తుడు.

"అయ్యా! శరణాగతుణ్ణి. గొల్ల పల్లె వాసిని.నా పేరు ఆర్యకుడు" అంటూ అతడు బండినుంచి క్రిందికి దిగి, రెండు చేతులు జోడించి వినయంగా నమస్కరించాడు.

"ఏమీ! గొల్లపల్లెనుంచి తెచ్చి, పాలకరాజు బంధించినవాడవా?" ఆశ్చర్యపోతూ అడిగాడు చారుదత్తుడు.

"అవును" సమాధానమిచ్చాడతను.

"దైవం తీసుకువస్తే, నాకంటబడ్డావు. నా ప్రాణాలైనా విడిచిపెడతానుగానీ శరణు పొందిన నిన్ను విడువనులే!" అన్నాడు చారుదత్తుడు.

ఆ మాటలకు ఆర్యకుడు సంతోషించాడు. "వర్ధమానకా! ఈయన కాలిగొలుసు ఊడదియ్యి"

వర్ధమానకుడు క్రింద కూర్చొని, అతడి కాలికున్న గొలుసుని తన ఒరలోని కత్తితో తొలగించాడు.

ఆ గొలుసుని తీసి, స్నేహమనే ఇంకో గట్టిగొలుసు తగిలించాడనుకున్నాడు ఆర్యకుడు. "ఇతడు విడుదలయ్యాడు.మిత్రమా!ఆ గొలుసు నువ్వు తగిలించుకో, ఇక మనం పోదాం" అన్నాడు మైత్రేయుడు.

"ఛీ, ఏం మాటలవి మైత్రేయా!" చారుదత్తుడు కోపగించుకున్నాడు.

"మిత్రమా! నేను చనువు తీసుకొని మీ బండి ఎక్కాను. నన్ను క్షమించండి" అని తలవంచి అడిగాడు ఆర్యకుడు.

"నువ్వు స్వయంగా నా స్నేహం కోరి వచ్చి నన్ను గౌరవించావు" అన్నాడు చారుదత్తుడు గంభీరంగా.

"ఆర్యపుత్రా! సెలవిస్తే, వెళతాను" అన్నాడు ఆర్యకుడు, నమస్కరిస్తూ.

"మంచిది అయితే... మిత్రమా! బండి మాత్రం దిగకు. గొలుసులు కొత్తగా ఊడదీయడం వల్ల నీ కాళ్ళు తొందరగా సాగవు.

తరచుగా మనుష్యులు తిరిగే ఇట్లాంటిచోట బండి మీద అయితే అనుమానానికి అవకాశం ఉండదు. కనుక బండిలోనే వెళ్ళు" అన్నాడు చారుదత్తుడు. "సరే"

"క్షేమంగా వెళ్ళి బంధువులను కలుసుకో" అన్నాడు చారుదత్తుడు.

"మొట్టమొదట దొరికిన బంధువులు మీరే"

"ప్రసంగం వస్తే నన్ను జ్ఞాపకం ఉంచుకో"

"నన్ను నేను మరచిపోతే, అప్పుడు మిమ్మల్ని మరుస్తాను"

"తోవలోదేవతలు నిన్ను రక్షించాలి"

"ముందు మీరు రక్షించారు గదా!"

"కాదు, నిన్ను నీ అదృష్టం రక్షిస్తుంది"

"అందుకూ మీరే కారణం"

"పాలకరాజు గట్టిగా చూస్తే, నీకు రక్షణ ఉండదు గనుక, త్వరగా వెళ్ళిపో"

"సరే, మళ్ళీ మీ దర్శనం"అంటూ ఆర్యకుడుఅక్కడున్న చారుదత్తుడికి, మైత్రేయుడికి నమస్కరించి బండెక్కాడు.బండి ముందుకు కదిలింది.

"మహారాజుకు విరుద్ధమైన పనిని చేసి,ఇక్కడ ఒక్కనిమిషమైనా ఉండడం భావ్యంకాదు. మైత్రేయా! ఆ సంకెళ్ళను పాడునూతిలో పడవెయ్యి.

లేకపోతే చారులవల్ల రాజులేదైనా కనుక్కోగలరు. ఏమిటో ఎడమకన్ను అదురుతోంది. మిత్రమా! వసంతసేనను చూసేందుకు ఎంతగా ఆత్రపడ్డాను? ఆమెను చూడక నా ఎడమ కన్ను అదురుతోంది. నిష్కారణంగా మనస్సు చెదరి బాధపడుతోంది.

రా పోదాం" అంటూ ముందుకు నడిచాడు చారుదత్తుడు.

బౌద్ధభిక్షువు నగరంలోని వీధివీధీ తిరుగుతూ, ధర్మప్రచారం చేస్తున్నాడు- "మూర్ఖులారా! ధర్మ సంగ్రహం చెయ్యండి.కడుపుకక్కుర్తి విడవండి,ధ్యానమనే తప్పెటతోమేల్కొనండి.ఇంద్రియాలనే దొంగలు మిక్కిలి కఠినులు. చిరకాలంనుంచి దాచుకున్న ధర్మాన్ని దోచుకుంటారు.

ఈ సంసారం అనిత్యము. తెలుసుకొని ధర్మాన్ని శరణు పొందండి.

విద్యావంతుడు కానివాడు, ఇంద్రియాలను అదుపులో ఉంచుకోనివాడు, అహంకారంగలవాడు, శరీరసుఖాలకే ప్రాధాన్యతనిచ్చేవాడుధర్మాన్నితెలుసుకోలేడు. అజ్ఞానంలో జీవిస్తూ, అజ్ఞానమనే అంధకారంలోనే తనువు చాలిస్తాడు. తల గొరుక్కుంటారు, ముఖం గొరుక్కుంటారు.

మనస్సునిమాత్రం ఎందుకు గొరగలేరు? మనస్సును అదుపులోపెట్టు



తమ రాష్ట్రంవాడు ప్రధానిగా వున్న సమయంలో గుజరాతీ ఓటర్లు బి.జె.పిని ఓడిస్తారనుకోలేం.
-నితీష్‌కుమార్, బీహార్ సి.ఎమ్.



కోండి" మురికిబట్టిన తన బట్టల్ని ఉతుక్కోవడానికి ఆ సన్యాసి రాజశ్యాలకుని ఉద్యానవనంలోనిచెరువుదగ్గరికి నడిచాడు. "ఆగరా! ఓరీ బౌద్ధ సన్యాసీ ఆగు!"

ఆ గర్జించిన పిలుపు విని, ఉలిక్కిపడ్డాడు బౌద్ధ సన్యాసి. "ఏమది, రాజశ్యాలకుడు వస్తున్నాడు. ఎవడో భిక్షువు నేరం చేశాడనీ, భిక్షువన్నవాడు కనబడితే చాలు, ఎద్దుకు ముక్కుతాడు వేసినట్లు భావించి వస్తున్నాడు.

దిక్కులేని నాకు బుద్ధభగవానుడే దిక్కు" అనుకున్నాడు బౌద్ధ సన్యాసి. మూర్ఖుడు, జిత్తులమారి, రాజుగారి బామ్మర్దియైన శకారుడు బౌద్ధభిక్షువు వద్దకు వచ్చాడు.

"ఆగరా! ఒరే భిక్కూ! ఆగు. కల్లంగడిలోని ఎర్ర ముల్లంగి దుంపలాగు నిన్ను చితకబొడుస్తాను" అంటూ కర్ర తీసుకొని కొట్టాడు.

శకారుడి మిత్రుడయిన విటుడు, "కన్యాకుమారా! దుఃఖితుడై కావిగుడ్డకట్టుకున్న భిక్కునికొట్టడం ఏమీ మంచిది కాదు. అతనితో నీకేం పని? సుఖంగా విహరించదగ్గ ఈ ఉద్యానవనం అందాల్ని చూడు. ఈ తోట దిక్కులేనివారికి చెట్లతో ఆశ్రయమిస్తూ, మంచి పనిచేస్తున్నది, ఇది అప్పనంగా వచ్చిన రాజ్యంలాగు!" అన్నాడు.

"స్వాగతం! ఉపాసకా! అనుగ్రహించు"అని వేడుకున్నాడు భిక్షువు.

"బావా! చూడు, చూడు ఏదో అరుస్తున్నాడు" అన్నాడు శకారుడు.

"ఏమంటున్నాడు?"

"నన్ను ఉపాసకుడంటున్నాడు. నేనేమైనా మంగలినా?"

"అబ్బే, బౌద్ధ ఉపాసకుడివనీ నిన్ను పొగుడుతున్నాడు"

"పొగడరా భిక్కూ! పొగుడూ!"

"నువ్వు ధన్యుడవు, నువ్వు పుణ్యుడవు"

"బావా! ధన్యుడవు, పుణ్యుడవు అంటున్నాడు నన్ను. నేనేమైనా చార్వాకుణ్ణా? నీటి తొట్టెనా?

కుమ్మరివాణ్ణా?"

"కన్యాకుమారా! నిన్ను ధన్యుడవనీ, పుణ్యుడనీ మెచ్చుకుంటున్నాడు"

"బావా! ఐతే వీడిక్కడికి ఎందుకొచ్చినట్లు?"

"అదిగో! ఆ కావిగుడ్డ ఉతుక్కోవడానికి"

"ఒరే దుష్ట సన్యాసీ! మా అక్క పెనిమిటి, రాజుగారు అన్నితోటల్లోకీ ఉత్తమమైనదనీ, దీనిని నాకు ఇచ్చారు. కుక్కలు, నక్కలు ఇక్కడే నీళ్ళు తాగుతాయి. నేను గొప్ప మగపురుషుణ్ణి గనుక, ఇక్కడ స్నానం చెయ్యను.

నువ్వీ చెరువులో పాత ఉలవపులుసు రంగులో కంపుకొట్టే ఈ కావి గుడ్డలు జాడిస్తున్నావు. నీకు రెండు తగిలించాల్సిందే కదూ!"

"కన్యాకుమారా! ఇతడీ మధ్యనే సన్యసించివుంటాడనుకుంటాను. ఇప్పటికీ నుదుటిమీద జుట్టు తీసిన తెల్లనిగీత అట్లాగే వుంది.

సన్యసించి ఆట్టే రోజులు కాలేదు గనుక, కాషాయం వల్ల ఇంకా భుజమ్మీద జాడ పడలేదు. బట్టకు కాషాయపు రంగువేయడం చేతగాక, అక్కడక్కడా పొడలున్నాయి. బట్ట కొనలు, పోగులు ఒదులై భుజంమీద నిలబడ్డంలేదు"

"ఉపాసకా! నిజమే, నేను సన్యసించి ఆట్టే రోజులు కాలేదు" అన్నాడు భిక్షువు.

"ఐతే పుట్టగానే నువ్వెందుకు సన్యసించలేదురా?" అంటూ శకారుడు మళ్ళీ అతడ్ని కొట్టాడు.

భిక్షువు పైకి చూస్తూ, "బుద్ధదేవా! రక్షించు!" అని ప్రార్థించాడు.

"ఈ దీనుడ్ని కొట్టడం ఎందుకయ్యా, విడిచిపెట్టు, అతడి దారిన అతడ్ని పోనివ్వు!"

"ఒరేయ్ ఆలోచన చేసేదాకా వుండు"

"ఎవరితో?" అడిగాడు విటుడు.

"నా మనస్సుతో"

"అయ్యో, ఈ సన్యాసి ఇక్కడినుండి పోతే బాగుండును" అనుకున్నాడు విటుడు.

"కుమారా! హృదయమా! ఆచార్యా! పుత్రా! ఈ సన్యాసి ఉండడమా? వెళ్ళడమా? వెళ్ళనూ వద్దు, వుండనూ వద్దు. బావా! నా మనస్సు ఇలా అంటోంది. ఉండకూడదు, వెళ్ళకూడదు. వెంటనే ఇక్కడపడి చచ్చిపోవాలి" హీ... హీ...హీ అని సకిలించాడు శకారుడు.

"బుద్ధదేవా! రక్షించు! అయ్యో! మీరే నన్ను రక్షించాలి. శరుణువేడుతున్నాను" అని అతడు వణికిపోతూ విటుడ్ని ప్రార్థించాడు.

"వెళ్ళిపో!" అన్నాడు విటుడు వెంటనే!

"ఒక ఒడంబడికప్రకారం"అన్నాడు శకారుడు.

"ఏమిటది?" అన్నాడు విటుడు.

"నీరు మురికి కాకుండా నీళ్ళల్లో బురద వెయ్యాలి. లేకపోతే, నీరంతా పోగుచేసి, బురదలో పొయ్యాలి"



## మంచి ఆఫర్లు లేవట

తెలుగు తెరపై మలయాళ మగువలు ఎంతగా అలరిస్తున్నారో విడిగా చెప్పుకోనక్కర్లేదు. అయితే 'బెంగళూరు డేస్'లో రేడియో జాకీగానటించి పారాగా గుర్తుండిపోయిన పార్వతి మాత్రం కన్నడ, తమిళ భాషల్లో సినిమాలు చేస్తున్నది కాని, తెలుగులోకి రావడం లేదు. ఇదే సంగతిని ఆమెను అడిగితే

"తెలుగులో మంచి కథలేవీ రావడంలేదు. అందుకే ఇప్పటిదాకా తెలుగు సినిమాలు చెయ్యలేకపోయాను. నిజానికి నాకు తెలుగు సినిమాలు చేయడం ఇష్టం. మంచి అవకాశాలు వస్తే తప్పకుండా నటిస్తా" అంటోంది. ఇంతమంది మలయాళ అమ్మాయిలకు వచ్చిన అవకాశాలు ఈమెకు ఎందుకు రావడంలేదో!?!



భారత్‌లోని భిన్నవర్గాలను ఏకతాటిపైకి తీసుకురావటంలో నరేంద్రమోడీ అద్భుతంగా పనిచేస్తున్నారు.

-డోనాల్డ్ ట్రంప్, అమెరికా అధ్యక్షుడు





## సత్తా అపారం

*గొప్పలు చెప్పుకోవడంలో నీతూ చంద్రకు ఎవరూ సాటిలేరేమో!*

తన ప్రతిభపట్ల తనకుగల అపారమైన నమ్మకాన్ని మితిమీరిన అతిశయంతో వెల్లడించింది. బాలీవుడ్ తననుసరిగ్గాఉపయోగించుకోలేదని, సల్మాన్, షారూక్‌లాంటి సూపర్ స్టార్‌ల సరసన నటించాల్సిన సత్తా తనకు ఉందని అంటోంది.

కొన్నేళ్ళుగా తన కెరీర్ నత్తనడక నడవడానికి ఎన్నో కారణాలున్నాయట. "నాకు అవకాశాలు తగ్గడానికి వ్యక్తిగత కారణాలుకూడా ఉన్నాయి. పరిశ్రమలో నాకు ఎవ్వరూ బంధుమిత్రులు లేరు. ప్రతిభతోనే ఎదిగా" అంటున్నది నీతూచంద్ర.





అన్నాడు శకారుడు.

"ఈ మూర్ఖులు తలక్రిందులుగా ఆలోచించి పనులుచేస్తారు. వాళ్ళ శరీరాలు పాషాణాలు. పెరిగిన మాంసవృక్షాల్లాంటివాళ్ళు వీళ్ళు! ఇట్టివారితో ఈ భూమి బరువెక్కివుంది.

కొంతమంది ఛస్తే, 'ఇంత పుణ్యాత్ములు ఎందుకు చచ్చారో కదా!' అనుకుంటాం. వీళ్ళలాంటి వాళ్ళని చూస్తే, 'వీళ్ళసలు ఎందుకు పుట్టారో?' అనిపిస్తుంది" అనుకున్నాడు బౌద్ధసన్యాసి.

"ఏమిటీ ఇదంతా!" గోలపెట్టాడు బౌద్ధసన్యాసి. "ఏమిటీ అంటున్నాడు" ప్రశ్నించాడు శకారుడు.

"నీ గొప్పదనాన్ని పొగడుతున్నాడు" అన్నాడు విటుడు.

"ఒరే, పొగుడు పొగుడు, మళ్ళా పొగుడు"

ఇక బౌద్ధసన్యాసి అక్కడినుండి పారిపోయాడు.

"కన్యాకుమారా! ఈ తోట అందం చూడు! రాజసేవకులు బాగా పెంచిన ఈ చెట్లు, పండ్లతో, పువ్వులతో కళకళలాడుతూ గట్టిగా పెనగిన తీగలతో కూడి భార్యలతో కలిసిమెలిసివుండే గృహస్థుల్లా వున్నాయి. ఎంత బాగున్నాయో" శకారుని ధ్యాసను మరల్చేందుకు అలా అన్నాడు విటుడు.

"బాగా చెప్పావు. రకరకాల పూలు పడి, ఈ క్షేత్రం చిత్రంగా వుంది.

పువ్వుల బరువుతో చెట్లు కొంచెం వంగాయి.

చెట్లకొనల తీగలమీద వ్రేళాడుతూ కోతులు పనసపళ్ళలా వున్నాయి" అన్నాడు ఇకిలిస్తూ, శకారుడు.

"కన్యాకుమారా! ఈ రాతిపలక మీద కూర్చో"

"ఇదిగో, కూర్చున్నాను" అంటూ ఏనుగులాంటి తన శరీరాన్ని పలకమీద కూర్చోబెట్టాడు శకారుడు. "బావా! ఇప్పటికీ ఆ వసంతసేన జ్ఞాపకం వస్తూ, దుర్జనుడి మాటలామనసునుపట్టి విడవడంలేదు" అన్నాడు శకారుడు.

'అంతగా ఈసడించినా వీడు ఆమెనే తలుస్తాడు. స్త్రీలు అవమానించేకొద్దీ దుష్టులకు వారిమీదే వలపు!

సజ్జనుడికైతే, తొలినాటి ప్రేమ వుండదు. పూర్తిగా నశించనూ వచ్చు' అనుకున్నాడు విటుడు.

"బావా! బండి త్వరగా తీసుకు రమ్మని స్థావరకుడితో చెప్పి, ఎంతసేపైంది? ఇప్పటికింకా రాలేదే?

ఉః! ఆకలేస్తోంది. ఈ మధ్యాహ్నం వేళ నడిచిపోలేం. చూడు, ఆకాశం మధ్య సూర్యుడు కోపగించిన కోతిలా చూడ శక్యంగాకుండా వున్నాడు. ముగ్గురు చచ్చిన గాంధారివలె భూమి ఎంతగా తపించిపోతోంది!"

"అవునవునా, ఆవులు నీడల్లో కూర్చుని నెమరువేసుకుంటూ నిద్రపోతున్నాయి. అడవి జంతువులు పట్టరాని దప్పికతో వెచ్చవెచ్చని చెరువు నీరు తాగుతున్నాయి.

వేడికి భయపడి, జనులు రాజవీధిలో నడవడంలేదు. నేలకాలి ఉండడంవల్ల బండి ఎక్కడైనా ఆగిపోయిందేమో!" ఆలోచిస్తూ అన్నాడు విటుడు. "బావా! సూర్యుడిపాదం నా నెత్తిమీద పడింది. చెట్లకొమ్మల్లో పిట్టలు, పక్షులు, పురుగులు అణగిమణగివున్నాయి.

నరమానవులందరూ వెచ్చగా నిట్టూరుస్తూ, ఇంటి భవనాల్లో ఉండి, ఈ ఎండవేళ విశ్రాంతి తీసుకుంటున్నారు. బావా, ఇప్పటికీ ఆ బండివాడు రాలేదు. కాలక్షేపం కోసం ఏదైనా పాడుతాను" అని శకారుడు తన గార్దభస్వరంతో ఓ పాట పాడాడు.

"ఎలా వుంది పాట?" అడిగాడు శకారుడు.

'వేరే చెప్పాలా, నువ్వు గానగంధర్వుడివి బావ!"

"ఏమీ, నిజంగానే ఇంగువ కలిపి జీలకర్ర, తుంగ ముసలు, వీస, బెల్లం, శొంఠిమాత్ర కట్టి మింగుతున్నాను! నా కంఠస్వరం ఎందుకు బాగుండదు? బావా! బండి వాడింకా రాలేదేమయ్యా" అంటూ మళ్ళీ మొదలెట్టొచ్చాడు.

"బావా! కొంచెం ఓపికపట్టు, వస్తుంటాడులే!" అని విటుడు అంటుండగానే, వసంతసేనని బండిలో కూర్చోబెట్టుకున్న బండివాడు ఎడ్లను అదిలిస్తూ, శకారుడున్నచోటికి రాసాగాడు.

"ఛో, ఛో, నడవండి, నడవండి" అరవసాగాడు బండివాడు.

పరధ్యానంగా ఆలోచిస్తున్న వసంతసేన బండివాడి గొంతుని పరిశీలనగా విని, 'అరే ఇది వర్ధమానుడి స్వరంలా లేదే? చారుదత్తుడు మరో బండిని పంపించాడా?" ఆలోచించసాగిందామె. ఆమె మనస్సు బెంగతో నిండిపోయింది ఒక్కసారిగా. ఆమె కుడి కన్ను అశుభసూచకంగా అదిరింది.

అంతా శూన్యంగానూ, ప్రపంచం తలక్రిందులుగానూ ఆమెకు కనిపించసాగింది.

బండి శబ్దం విన్న శకారుడు, "బావా! బావా! బండి వచ్చింది" అన్నాడు ఉత్సాహంగా. "ఎలా తెలిసిందీ?"

"చూడ్డంలేదూ? ముసలిపందిలాగ గురగురా చప్పుడవుతోంది"

"బాగా కనిపెట్టావు, ఇదిగో వచ్చేసింది" అన్నాడు సంతోషంగా విటుడు.

"నాయనా! వచ్చేశావా?" బండివాడిని చూస్తూ అన్నాడు శకారుడు.

"వచ్చానండి"

"బండి కూడా వచ్చిందా?"

"వచ్చిందండి?" "ఎడ్లూ?"

"అవి కూడా వచ్చాయండీ" అని పైకి అంటూ, ఈ మూర్ఖుడితో ఇదే తలనొప్పి, అనుకున్నాడు బండివాడు మనసులో.

"అయితే రానీ బండి"

"ఎటువైపు?"

"ఈ గోడమీదనుంచి"

"బాబూ! బండి అలా రాదు. ఎడ్లు చస్తాయి. బండి విరుగుతుంది. బండివాణ్ణి నేనూ చస్తాను"

"అరే, నేనూ రాజుగారి బామ్మర్దినిరా! ఎడ్లు చస్తే, ఇంకో జత కొంటాను. బండి విరిగితే ఇంకోటి చేయిస్తాను. నువ్వు చస్తే ఇంకోడు బండి తోలుతాడు"

"అంతా నిజమేననుకోండి, కానీ నాకు నేను కాకుండా పోతాను"

"ఒరేయ్, ఏమి పోయినా సరే ముక్కచెక్కలైన గోడ మీదనుంచే బండి రానీ!"

"ఓ బండీ! విరిగిపో! నీ బండివాడితో కూడా విరిగిపో, ఇంకో బండి వస్తుంది. బాబుగారి వద్దకు వెళ్ళి చెబుతాను" అంటూ, బండివాడు అటువెళ్ళి, బండి తోలుకొని వచ్చి, వాళ్ళకి కాస్త దూరంలో నిలిపాడు. "అరే విరగలేదు. ఇదిగో బండి వచ్చేసింది!" అన్నాడు అతడే.

**ఇంకా ఉంది**



**నా ఇంటిపేరు గాంధీ కాకపోయివుంటే నేను 29 ఏళ్ళకే ఎమ్.పిని అయివుండేవాడిని కాదు.**

*-వరుణ్‌గాంధీ, బి.జె.పి. ఎమ్.పి.*



# కట్ వెజిటబుల్స్



Courtesy : MANAARROGYAM

ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం కూరగాయలు కోసి అప్పటికప్పుడు వంట చేసుకోవాలంటే చాలామంది ఉద్యోగినులకు సాధ్యపడకపోవచ్చు. ముందస్తుగానే కొన్ని కూరగాయలు తరిగి, వాటిని ఫ్రిజ్‌లో భద్రపరిచి అవసరం అయినప్పుడు ఉపయోగించుకోవడమనేది నేటి జీవన విధానంలో అనివార్యం అయిపోతున్నది.

ఇదంతా సౌకర్యపూరితమైన చర్యే అయినప్పటికీ, ఎక్కువ గంటలు కూరగాయలు కోసి వుంచడంవల్ల వాటిలోని కీలక పోషకాలు, ఖనిజాలు ఆక్సిడేషన్‌ద్వారా తగ్గిపోతాయి. వంట చేయడానికి కొద్ది నిమిషాల ముందుగా కూరగాయల్ని కోయడం అనేది మంచి చర్య. అయితే ప్రతిసారీ ఇది సాధ్యం కాదు.

కాబట్టి, కూరగాయలను కోశాక ఏ విధంగా భద్రపరుచుకోవాలో తెలుసుకుని, ఆ మేరకు చర్యలు తీసుకోవాలి. దీనివల్ల కొన్ని పోషకాలను అయినా పరిరక్షించుకున్నవారు అవుతారు.

**ఆకుకూరలు :** పాలకూర, కొత్తిమీర, మెంతి ఆకులను భద్రపరచాలనుకుంటే ఫ్రిజ్‌లో పెట్టడానికి ముందుఆకులను కాడలనుంచి కోసేయాలి.పాడయిపోయిన ఆకుల్ని ఏరివేయాలి.

ఫ్రిజ్‌లో పెట్టాలన్న ఆలోచన ఉన్నప్పుడు వాటిని ముందే కడగవద్దు. పేపర్‌టవల్‌లో చుట్టిపెడితే తేమ ఉండి తాజాగా వుంటాయి. పేపర్ టవల్ లేని పక్షంలో పల్చని కాటన్ వస్త్రంలో చుట్టి పెట్టవచ్చు.

దీనివల్ల గాలి బాగా ఆడుతుంది. తేమను పట్టి వుంచే అవకాశం వుంటుంది. ఫ్రిజ్‌లో పెట్టాక, ఆకుకూరలను రెండు రోజుల్లో వాడేయాలి. కొత్తిమీర అయితే ఆకుకోసి, ఏదైనా మూత గట్టిగా వుండే డబ్బాలో భద్రపరిస్తే ఆకులు తాజాగావుంటాయి. సువాసనకోల్పోవు.

**వేరు కూరగాయలు :** బంగాళాదుంపలు, ముల్లంగి, క్యారెట్ వంటివాటిని కట్‌చేసి, నిల్వవుంచుకుంటే వాటి టెక్చర్, రంగు కోల్పోతాయి. వాటిలోని తేమ ఆవిరైపోయి, పాడిబారి, దాదాపు రుచి లేకుండా పోతాయి.

బంగాళాదుంపలు, క్యారెట్లు, బీట్‌రూట్,ముల్లంగి వంటి వాటిని ఫ్రిజ్‌లో ఉంచదలిస్తే, స్లైసులుగా కట్ చేసి, నీరు పోసిన పాత్రలో వేసి, ఫ్రిజ్‌లో పెట్టుకోవాలి. మూత లూజ్‌గా పెడితే సరిపోతుంది.

ఒక రోజుకు మించి ఉంచకూడదు లేదంటే తడి పేపర్ టవల్ లేదా పల్చని కాటన్ వస్త్రంలో చుట్టి ఫ్రిజ్‌లో భద్రపరుచుకోవచ్చు. మూత గట్టిగా ఉండే డబ్బాలలో స్టోర్ చెయ్యవద్దు.ఇలా చేయడంవల్ల వాటిలోని సహజ తేమను కోల్పోవాల్సి వస్తుంది.

**పువ్వుల కూరగాయలు :** క్యాలీఫ్లవర్, బ్రొకోలి వంటి పువ్వులకూరగాయలు కట్‌చేసిన వెంటనేతేమను కోల్పోవు. అయితే, ఇవిచాలా సెన్సిటివ్‌గా వుంటాయి. ఫ్రిజ్‌లో పెట్టినప్పుడు ఫ్లేవర్లను పీల్చుకుంటాయి. వీటివాసన ఇతర పదార్థాలకూ అంటుతుంది.

కాబట్టి, క్యాలీఫ్లవర్‌ను కట్‌చేసిన వెంటనే గాలి చొరబడని పాత్రలో వుంచాలి. బ్రొకోలిని నెట్టెడ్ పౌచ్‌లలో భద్రపరచాలి. దీనివల్ల వాటికి గాలి బాగా ఆడుతుంది. క్యాబేజీ అయితే, కట్‌చేసి ప్లాసిక్ బ్యాగ్స్‌లో ఉంచి ఫ్రిజ్‌లో భద్రపరుచుకోవచ్చు.

**బీన్స్:** బీన్స్ కడిగి కట్‌చేసి ఆరనివ్వాలి. పూర్తిగా తడి లేకుండా ఆరిపోయాక ప్లాస్టిక్ బ్యాగ్‌లో ఉంచి ఫ్రిజ్‌లో పెట్టుకోవాలి. గాలి చొరబడని బాక్స్‌లో కూడా భద్ర పరుచుకోవచ్చు.

**ఉల్లిపాయలు :** కొంచెంకూడా గాలి చొరబడని డబ్బాలోవుంచుకోవాలి. లేనిపక్షంలో ఉల్లివాసన ఫ్రిజ్ అంతా నిండిపోతుంది. ఫ్రిజ్‌లో పెట్టినా ఉల్లిపాయ ముక్కల్ని ఒక్కరోజులో ఉపయోగించు కోవాలి.

**తీగ జాతి కూరగాయలు :** సొర, బీర, పొట్ల, కాకర వంటి వాటిని కట్‌చేసి ఎక్కువ రోజులు ఫ్రిజ్‌లో ఉంచినట్లయితే వాటిలోని తేమ నశించిపోతుంది. తడి పేపర్ టవల్ లేదా పల్చని కాటన్ వస్త్రం చుట్టి ఫ్రిజ్‌లో భద్రపరుచుకోవాలి. మూతగల పొరోస్ పాత్రలోకూడా భద్రపరుచుకోవచ్చు.

**వంకాయలు:** వీటిని కట్‌చేసిఉంచితే బ్రౌన్‌కలర్‌లోకి మారిపోతాయి. ఆక్సిడేషన్‌వల్ల ఇలా జరుగుతుంది. ఉప్పు జల్లి, పసుపు కలిపి, కొద్ది చుక్కలు నిమ్మరసం జల్లి ఉంచుకుంటే రంగు మారవు. ఏది ఏమైనప్పటికీ వంకాయల్ని వీలైనంతవరకు అప్పటికప్పుడు కట్‌చేసి వాడుకోవడమే మంచిది.

**పెప్పర్లు:** ఆకుపచ్చ, పసుపు,ఎరుపు క్యాప్సికంలను కట్‌చేసి, ప్లాస్టిక్ బ్యాగ్‌లోకాని, గాలి చొరబడని కంటెయినర్‌లో కాని ఉంచి, ఫ్రిజ్‌లో పెట్టుకోవాలి. వాటిని మాయిస్ట్ పేపర్ టవల్‌లో కాని లేదా తడి వస్త్రంలో కాని పెట్టకూడదు.

**పచ్చి అరటికాయ :** అరటికాయల్ని చిన్నచిన్న ముక్కలుగా కోసి, నీటిలో ముంచి, ఉప్పు, పసుపు జల్లి స్టోర్ చేసుకోవాలి.

**గుమ్మడి :** గుమ్మడికాయ కట్‌చేసి గాలి చొరబడని డబ్బాలో ఉంచి, ఫ్రీజర్‌లో పెట్టుకోవాలి.

**బఠాణీలు :** గాలి చొరబడని డబ్బాలో వేసి, ఫ్రిజ్‌లో వుంచాలి. ఫ్రీజర్‌లో పెట్టుకోవచ్చు. వీటిని సరైన పద్ధతిలో భద్రపరిచినట్లైతే ఆరునెలలదాకా వుంటాయి.

**ములక్కాయలు :** వీటిని కట్‌చేసి, గాలి చొరబడని కంటైనర్‌లో ఉంచాలి. ఇలా చేయడంవల్ల వారందాకా పోషకాలు కోల్పోకుండా వుంటాయి.

# కదిలే బొమ్మల కబుర్లు

Review

## వీసా-విడాకుల కథ

తమిళ జనాలు భలే చిత్రమైన పాయింట్లు పట్టుకుని, చిన్న సినిమాలు తయారుచేస్తారు. అక్కడి జనాలు చిన్న నటులు నటించినా, తక్కువ బడ్జెట్‌తో తయారుచేసినా, విషయం బాగుంటే సినిమాను దగ్గరకు తీసుకుంటారు.

కానీ మన జనాల వైనం వేరు. భారీతనానికి అలవాటుపడ్డారు లేదూ అంటే ఏదో ఒక పెద్ద తలకాయ సపోర్టు వెనకాల వుండాలి. ఈ రెండూ లేకుంటే చిన్న సినిమాకు టికెట్‌లు తెగవు. అయినా మన దగ్గర ప్రయత్నాలు జరుగుతూనే వుంటాయి.

తమిళనాట హిట్ అయిన 'ఆండవన్ కట్టలై' సినిమాను దర్శకుడు మారుతి తన స్వీయనిర్మాణంలో 'లండన్ బాబులు' తెలుగులోకి తెచ్చారు.

గతంలో ఒకటి, రెండు సినిమాలు అందించిన చిన్నికృష్ణకు దర్శకత్వ బాధ్యతలు అప్పగించారు. విజయవాడలోని స్వీట్ ఇండియా సంస్థకు చెందిన రక్షిత్ ఈ సినిమాలో కథానాయకుడు.

క్యాచీ టైటిల్ పెట్టుకున్న 'లండన్ బాబులు' సినిమా కథ చిత్రంగా వుంటుంది.

తన అవసరాలు, అప్పులు తీరడంకోసం లండన్ వెళ్ళాలనుకున్న కుర్రాడు, ఓ చిక్కుసమస్యలో ఇరుక్కుంటాడు. దాన్నుంచి ఎలా బయటపడాలో తెలియక కిందా మీదా అవుతాడు.

అయితే ఇక్కడ విషయం అది కాదు. దర్శకుడు ఆ సమస్య నేపథ్యంలో మన బ్యూరోక్రసీ వ్యవస్థ, కోర్టులు, వివాహాలు, విడాకులు ఇలాంటి విషయాలన్నీ సరదాగా ప్రస్తావిస్తూ, వాటిలోని లోటుపాట్లు చర్చిస్తాడు. ఈ విషయాల్లో దొర్లిన సెటైర్లు తమిళనాట 'ఆండవన్ కట్టలై' విజయానికి కారణమయ్యాయి.

ఇంతకీ విస్తారంగా చూస్తే 'లండన్ బాబులు' కథేంటంటే, గాంధీ (రక్షిత్) తన స్నేహితుడు సత్య (సత్య)తో కలిసి లండన్ వెళ్ళే ప్రయత్నంపై హైదరాబాద్ వస్తాడు. లండన్ వీసాకోసం ప్రయత్నాలు ప్రారంభిస్తాడు. కానీ వీసా రాదు.

పెళ్ళయి, భార్య వుందని చెబితే, వీసా రావడం సులువు అవుతుందని సలహాలు వినిపిస్తాయి. దీంతో అనుకోకుండా సూర్యకాంతం అనే పేరును భార్యగా వీసా దరఖాస్తులో రాస్తాడు.

కానీ సూర్యకాంతం అనే అమ్మాయి, ఆమెతో ఫోటో, శుభలేఖ ఇవన్నీ ఒకదాని వెంటఒకటి అవసరమై సమస్యను జటిలంచేస్తాయి.

సూర్యకాంతం అన్న పేరున్న అమ్మాయి (స్వాతి) పరిచయం అవుతుంది. ఆమె జర్నలిస్టు. గాంధీ మంచితనం చూసి సాయంచేస్తుంది. ఈలోగా గాంధీ తాత్కాలికంగా ఓ నాటకాల కంపెనీలో గుమాస్తాగా చేరతాడు. అక్కడ మళ్ళీ లండన్‌కు వెళ్ళే అవకాశం వస్తుంది, కానీ సూర్యకాంతం పేరును పాస్‌పోర్టులో తొలగించాల్సి వస్తుంది.

అలా చేయాలంటే వేరే అడ్డంకులు వచ్చి, కోర్టులో అధికారికంగా విడాకులు తీసుకోవాల్సివస్తుంది. అక్కడ రకరకాల పరిస్థితులు ఎదురవుతాయి. అప్పుడు ఏం జరిగిందన్నది మిగిలిన సినిమా.

'లండన్ బాబులు' కథలో చాలా వేరియేషన్లు వున్నాయి. నిరుద్యోగుల వ్యథలు, విదేశీ ఆశలు, ప్రయత్నాలు, వాటిని క్యాష్‌చేసుకుని మోసంచేసే జనాలు, పెళ్ళిళ్ళు, వర్తమాన సమాజంలో కామన్ అయిపోయిన విడాకులు, వీటన్నింటి మధ్యలో అంతర్లీనంగా నడిచే ఓ సున్నితమైన ప్రేమకథ. అందుకే ఈ సినిమా





### వెరీ స్పెషల్

సినిమాల సంఖ్యతోపాటు గ్లామర్ విందులోనూ జోరుమీదున్న రకుల్‌ప్రీత్‌సింగ్ 'ఖాకీ' చిత్రం తనకు చాలా స్పెషల్ అంటున్నది.

"ఇప్పటివరకు నేను ఇటువంటి పాత్ర చెయ్యలేదు. కార్తి హార్డ్‌వర్కర్. తనెంతో ప్యాషన్‌తో చేసిన సినిమా ఇది" అని చెప్పింది. ఈ మధ్య సినిమాలన్నీ పాటలకు, అరకొర నటనకు పరిమితం అయిపోతున్నాయేమో- రకుల్ కాస్తంత ఆలోచించాలేమో! ◆




తమిళనాట విజయం సాధించి వుంటుంది.

తెలుగులోకూడా దర్శకుడు చిన్ని కృష్ణ సిన్సియర్ ప్రయత్నమే చేశారు. దర్శకుడి తప్పిదం కానీ నటీ నటుల ప్రయత్నలోపాలుకానీ ఎక్కడాకనిపించవు.

అయితే సినిమాలో రెండు, మూడు కీలక సమస్యలు వున్నాయి. ఒకటి సినిమా, నెరేషన్ అన్నీ కాస్త సాదాసీదాగా సాగుతుంది. ఎక్కడా మరీ ఉత్కంఠ భరితమైన సన్నివేశాలువుండవు. వినోదంకూడా అలా అలా సహజంగా సాగుతుంది తప్ప, ప్రత్యేకంగావినోదంకోసం రాసుకున్నట్లు వుండవు.

సినిమా బడ్జెట్ కూడా అలాఅలా అంతంత మాత్రంగానే వుంటుంది. భారీ సినిమాలు, కలర్ ఫుల్ సినిమాలు చూడడం అలవాటైపోయిన మన ప్రేక్షకులు ఈ సినిమాను ఎలా స్వీకరిస్తారో అన్నది చిన్న అనుమానం.

పైగా హీరోయిన్ స్వాతి లుక్స్ కూడా నార్మల్‌గా వుంటాయి. కొత్త హీరోకూడా నార్మల్ లుక్స్‌తోనే వుంటాడు తప్ప, ఈ జనరేషన్ కుర్రాళ్ళలా ఫుల్ జోష్‌తో కనిపించడు. పాత్ర అలాంటిది మరి.

ఇవన్నీ కలిసి సినిమాను బాబాయ్ హోటల్ ఇడ్లీ లాగానో, సుబ్బయ్య హోటల్ భోజనంలాగానో సంప్రదాయబద్ధంగా చూపిస్తాయి తప్ప, ఫైవ్‌స్టార్ హోటల్ బఫే మాదిరిగాకాదు. కానీఎక్కడో చిన్నఆశవుంటుంది. ఒక్కోసారిమన ప్రేక్షకులు కూడా అనుకోకుండా కొన్ని చిన్న సినిమాలను కూడా అక్కున చేర్చుకుంటారు. అలాఏమన్నా కలిసి రావాలి ఈ సినిమాకు.

సినిమా మేకింగ్‌పరంగా చూసుకుంటే, సినిమా తొలిసగం బాగానే వుంటుంది. సరదాగానే సాగిపోతుంది. పెద్దగా ఇబ్బందిపడేది వుండదు. కానీ మలిసగంలో మాత్రం కోర్టుసీన్లు కొంచెం అడ్డం పడతాయి. దీంతో సినిమా నడక నెమ్మదిస్తుంది.

అసలు కథకన్నా ఈ కోర్టుసీన్ల కొసరు కథ ఎక్కువ అయినట్లు కనిపిస్తోంది. ఈ సీన్లు కథను కాస్త డీవియేట్ చేస్తాయి. అయితే వాటిద్వారా వేరే జోనర్‌నుకూడా టచ్‌చేసి, ప్రేక్షకులను ఆకట్టుకోవాలన్నది దర్శకుడి ఆలోచన కావచ్చు. కానీ అది అంత వర్కవుట్ అవుతుందా అన్నది అనుమానం.

టోటల్‌గా సినిమా ఓ సిన్సియర్ ప్రయత్నం. అది మాత్రం వాస్తవం. కానీ ఆ ప్రయత్నం, ఈ తరం ప్రేక్షకుల అభిరుచికి ఏమాత్రం అందుతుంది అన్నది మాత్రం కాస్త అనుమానమే.

మాటలు, చిత్రానువాదం, దర్శకత్వం, మాటల విషయంలో దర్శకుడు చిన్నికృష్ణ ప్రయత్నం అయితే నిజాయితీగానే వుంది. అది ఏమేరకు ఫలితం ఇస్తుందన్నది మాత్రం చూడాలి.

నిర్మాణ విలువలు కాస్త సాదాసీదాగానే వున్నాయి. నటీనటుల విషయంలో కూడా పొదుపుగానే వెళ్ళారు. సాంకేతిక విలువలు దానికి తగినట్లే వున్నాయి.

ప్లస్‌పాయింట్స్...
తొలిసగం

మైనస్‌పాయింట్స్...
నిర్మాణ విలువలు

పంచ్‌లైన్
లం'డల్' బాబులు ◆

## స్పందన లేదు

'ఫిదా' తర్వాత చటుక్కున నచ్చేసే ఆఫర్లు సాయి పల్లవికి తటస్థపడడంలేదట. నాలుగైదు కథలు విన్నది. చాలామంది దర్శక నిర్మాతలు ఆమెను సంప్రదించారు. కాని, ఆమెనుంచి స్పందన నిల్. రెగ్యులర్ కథానాయికల మాదిరి కాకుండా ఆమె భిన్నంగా ఆలోచిస్తున్నదన్న టాక్ పరిశ్రమలో ఎక్కువగా వినపడుతున్నది.

'ఫిదా' చేస్తున్నప్పుడే ఓ సినిమా కమిట్ అయింది. ఆపైన మరే తెలుగు సినిమాకూ సంతకాలు చెయ్యనే లేదు. గ్లామర్‌ప్రపంచంలో ఇలాంటితారలు అరుదు అనే వ్యాఖ్యలు వినపడుతున్నాయి. ◆



## ఎలా ఆడుతున్నాయి?

- 'అదిరింది' సినిమా అనుకున్న రేంజ్‌కు చేరకపోయినా, కొన్న రేటుకు చూసుకుంటే హిట్ అనిపించుకుంది.
- 'గరుడవేగ' సినిమాకు వచ్చిన రేంజ్‌కు కలెక్షన్లు లేవు. అలాగే ఖర్చుమేరకుకూడా లేవు. కానీ పది కోట్లకు పైగా షేర్ వచ్చింది కాబట్టి హిట్ అనే అనుకోవాలి.
- 'నెక్ట్స్ నువ్వే' సినిమా ఫ్లాప్‌గా మిగిలింది.
- 'కేరాఫ్ సూర్య' కూడా పెద్దగా సాధించింది ఏమీ లేదు. రాంగ్ టైమ్ రిలీజ్ అనుకోవాలి.
- చిన్నసినిమాలు తామరతంపరగా విడుదలవుతున్నాయి. థియేటర్ రెంట్లుకూడా వస్తున్నాయా అంటే అనుమానమే. ఒకేవారంపది సినిమాలవరకు విడుదలవుతున్నాయి, కానీ ఎవరికీ పేర్లు కూడా తెలియవు అంటే పరిస్థితి అర్థం అవుతుంది. ◆

## తమన్నా తాపత్రయం

అసలే నాజూకు భామ, ఆపైన తళుకుల తిప్పులాడి అయిన తమన్నా 'క్వీన్'గా రాణించి కెరీర్‌ను మలుపు తిప్పేయాలనుకుంటున్నదేమో- అందుకోసం ఒకటే కసరత్తులు సాగిస్తున్నదట.

ఇంకెంత నాజూకుదనం కావాలో కాని, వ్యాయామాల తీరు, ధోరణి మార్చేసింది.

ఇంతకుముందు చేసే మూడురోజుల ట్రైనింగ్‌ను ఆరురోజులకు పెంచేసింది. ప్రత్యేక ట్రైనర్‌ను ఏర్పాటు చేసుకున్నది. కెరీర్ నత్తనడకలో 'బాహుబలి' ఊపు కొంత ఇచ్చినా, మరోసారి 'క్వీన్'తో వెలుగొందాలన్నది తమన్నా తాపత్రయం. ◆

Review

# నేరము-పరిశోధన

క్రైమ్ ఇన్వెస్టిగేషన్ సినిమాలు ఇష్టపడేవారికి ఈ వారంకూడా పండుగే. గతవారమే 'డిటెక్టివ్' సినిమా వచ్చింది. ఇది అచ్చంగా అపరాధపరిశోధన స్టైల్ సినిమా. తుపాకి శబ్దాలు, ఛేజింగ్‌లు పెద్దగా లేకుండా, మెదడుకు పనిపెట్టే పరిశోధన అందులో చూస్తే, క్షణం నిల్వోకుండా -

పరుగులుపెట్టే పరిశోధన, పోరాటం, ఆరాటం, నేరం, ఘోరం ఇవన్నీ కలిపిన మరో తరహా క్రైమ్ ఇన్వెస్టిగేషన్ సినిమా ఈ వారం వచ్చింది.

ఈ తరహా సినిమాలు ఇష్టపడేవారికి దాదాపు సంతృప్తినిచ్చే సినిమా ఇది. అయితే సినిమా అంటే పాటలు, సరదాలు, ఫ్యామిలీ ఎంటర్‌టైనర్‌లు అనే జోనర్‌నే ఊహించుకునేవారు నిర్మొహమాటంగా ఈ సినిమాకు దూరంగా ఉండడం ఉత్తమం.

తమిళనాట 'ధీరన్ అధికారమ్ ఒంద్రు' అంటూ తెలుగులో 'ఖాకీ' అంటూ విడుదలైన ఈ ఇన్వెస్టిగేటివ్ యాక్షన్ మూవీలో కార్తీ కథానాయకుడు. 'ది పవర్ ఆఫ్ ది పోలీస్' అన్నది ట్యాగ్ లైన్.కానీ నిజానికి ది పవర్ ఆఫ్ ది పోలీస్ అనేకన్నా, 'ది స్ట్రగుల్ ఆఫ్ ది పోలీస్' అంటే అతికినట్లు సరిపోతుంది.

1990వ దశకంలో జరిగిన కొన్ని వాస్తవదోపిడీల ఆధారంగా అల్లుకున్నకథతో తయారైన సినిమా'ఖాకీ'. రాజస్థాన్‌లోని పూర్వ గెరిల్లా దళాలు, కాలక్రమంలో ఓ దోపిడీ ముఠాగా మారి, దేశం అంతటా దోపిడీలు చేస్తుంటాయి. వీరి దోపిడీలు మహాఘోరంగా వుంటాయి. కనిపించినవారిని కనిపించినట్లు దారుణంగా చంపేసి దోచుకోవడం అన్నది వీరికి అలవాటు.

ఇలాంటి కేసు నిజాయితీగల పోలీస్ అధికారి ధీరజ్ (కార్తీ) చేతికి వస్తుంది. అక్కడినుంచి ఈ కేసును ముగించడానికి అతనికి పదిహేనేళ్ళు పడుతుంది. ఈ పదిహేనేళ్ళు దేశం అంతటా తమిళనాడు పోలీసులుపడిన శ్రమ, పోయిన ప్రాణాలు, కోల్పోయిన జీవితాలు వెరసి 'ఖాకీ' సినిమా.

ధీరజ్ భార్య (రకుల్‌ప్రీత్‌సింగ్), దోపిడీ ముఠా నాయకుడు (అభిమన్యుసింగ్) మిగిలిన ప్రధాన పాత్రలు. 'ఖాకీ' సినిమా ఓ లైన్ ఆఫ్ ఆర్డర్‌లో సాగుతుంది. ఎక్కడా పెద్దగా నెమ్మదించదు.

సినిమా ప్రారంభమైన అరగంటకు తీసుకున్న టేకాఫ్ ముగింపు టైమ్‌లో తప్ప ఆగదు.

సినిమాప్రారంభంలో ఈ జోనర్‌కు పెద్దగా ముడి పడకపోయినా, హీరో ప్రేమ వ్యవహారం, భార్యతో అనుబంధం, రొమాంటిక్ మూవ్‌మెంట్స్ వంటివి బాగానే ఆకట్టుకుంటాయి.

నిజానికి వీటిని తగ్గించుకోవచ్చు. కానీ అందమైన రకుల్‌ప్రీత్‌సింగ్‌ను మరింత అందంగా, క్యాజువల్‌గా చూపించడం, హీరో, హీరోయిన్ల ఇంటిమసీ సీన్లు రసవత్తరంగా వుండడంతో పెద్దగా బోర్‌కొట్టదు.

కానీ టోటల్ నిడివి చూసుకుంటే, ఇవన్నీ కాస్త లెంగ్తీ అనిపిస్తాయి. నిజానికి దర్శకుడు ద్వితీయార్థంలో వున్న కథనం అంతటినీ దృష్టిలో వుంచుకుని, తొలి సగంలో కొంత తగ్గించుకుని,రెండు సగాలను సరిగ్గా బ్యాలెన్స్‌చేసివుంటే మరింత బాగుండేది.

కానీ ఇప్పుడు తొలిసగం చకచకా నడచిపోయి నట్లు అవుతుంది. మలిసగం ఎంతకూ తెమలనట్లు వుంటుంది. కానీ దర్శకుడు రాసుకున్న కథనం ఆద్యంతం ఆసక్తికరంగా వుండడం, ఆ కథనంలో అంతర్లీనంగా వున్న వేగం ఆకట్టుకోవడంవంటి అంశాలతో పక్కాగా ఈ జోనర్‌ను ఇష్టపడేవారికి ద్వితీయార్థంకూడా నచ్చుతుంది.

పదిహేనేళ్ళపాటు సాగిన కేసు,పోలీసులు పడిన కష్టం అన్నీ క్లియర్‌గా తెరకెక్కించాలన్న దర్శకుడి తపనే ద్వితీయార్థం నిడివిని కాస్త పెంచేలా చేసినట్టు కనిపిస్తోంది. సినిమాలో ఫ్యామిలీ విషయాలు పక్కన పెడితే యాక్షన్ సన్నివేశాలు, పరిశోధన విషయాలు ఖచ్చితంగా ఆకట్టుకుంటాయి.

మామూలుగా, ఓ సాదాసీదా నేరం, దాని పరిశోధన అన్నట్లు కాకుండా, వాస్తవ సంఘటనలు, వివిధ రాష్ట్రాలతో ముడిపడిన పరిశోధన అన్నది చాలా డిటైల్డ్‌గా చెప్పే ప్రయత్నంచేశాడు దర్శకుడు.ఆ క్రమంలోనే సాదా ప్రేక్షకులు ఇన్ని సీన్లు ఎందుకు, చకచకా లాగించేయవచ్చు కదా, ఫట్ ఫట్‌మని తేల్చేయవచ్చు కదా అని అనుకునే అవకాశం వుందని తెలిసికూడా దర్శకుడు తను నమ్మిన దారినే వెళ్ళాడు.

పవర్ ఆఫ్ ఖాకీ అన్న ట్యాగ్ లైన్ పెట్టుకున్నందున, అస్సలు సింగిల్ క్లూ కూడా లేని కేసును ఏ విధంగా పరిశోధన దారిలోకి తీసుకువచ్చారు. బ్యూరోక్రసీ, రాజకీయం, నేరస్తుల మొండితనం ఏ విధంగా అడుగు అడుగునా అడ్డంపడ్డాయి. అయినా పట్టువదలకుండా సాగించిన పరిశోధన ఇలాంటివి అన్నీ కాస్త వివరంగానే చర్చించాడు.అంతేకాదు, పోలీసుశాఖ సమస్యలు కూడా లేశమాత్రంగా ప్రస్తావించాడు.

సినిమా దర్శకుడి సమర్థతనే కాదు, నటీనటులు, సాంకేతిక నిపుణుల మద్దతునుకూడా స్పష్టంగా తెలియచేస్తుంది. నిజానికి ఇలాంటి సినిమాలో హీరోయిన్‌కు పెద్దగా అవకాశం వుండదు.

కానీ దర్శకుడు రకుల్‌ప్రీత్‌ను చాలావరకు సినిమాలో పాత్రను చేయగలిగాడు. ఆమెను సహజమైన అందాల్లో చూపించే ప్రయత్నంచేశాడు.

కార్తీ మంచి నటుడు అని ఇంతకు ముందే ప్రూవ్ చేసుకున్నాడు. ఈ సినిమా ఆ విషయాన్ని మరోసారి చెబుతుంది. సినిమాకు నేపథ్య సంగీతం చాలా ప్లస్ అయింది. పాటలు పెద్దగా ఆకట్టుకునే అవకాశం లేదు. కానీ జనాలను సన్నివేశాల్లో లీనమయ్యేలా చేయడంలో సంగీతం చాలా ఉపయోగపడుతుంది. కెమెరా పనితనం కూడా బాగుంది.

మొత్తంమీద చూసుకుంటే ఈ సినిమాకు రెండే సమస్యలు. ఒకటి ద్వితీయార్థం నిడివి, రెండవది కొద్దిమందికి మాత్రమే నచ్చే జోనర్.

**ప్లస్‌పాయింట్స్...**
కథనంలో వేగం, నేపథ్య సంగీతం

**మైనస్‌పాయింట్స్...**
నిడివి, సాగిన పరిశోధన

**పంచ్‌లైన్**
ది స్ట్రగుల్ ఆఫ్ ది పోలీస్

## రహస్యం ఎందుకంట?

నయనతార సంగతికి వస్తే ఆమె చెప్పే విషయాల కంటే ఊహాగానాలే ఎక్కువ. ప్రేమ, పెళ్ళి విషయంలో ఎన్ని కబుర్లు షికారుచేస్తున్నా ఆమెమాత్రం పెదవి విప్పి చెప్పింది లేదు.ఈ మధ్య ఓ మలయాళం ఛానల్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో మాత్రం కొద్దిపాటి కబుర్లు దొర్లించింది నయనతార.

"నయనతార రహస్యంగా పెళ్ళిచేసుకుంటుందంటూ వస్తున్న వార్తల్లో నిజమెంత ఉందో నాకు, నా కుటుంబసభ్యులకు మాత్రమే తెలుసు.

నా కుటుంబం నాకెంతో స్వేచ్ఛ ఇచ్చింది.వాళ్ళకు చెప్పకుండా నేనేదీ చేయను. ఎవరికీ తెలియకుండా రహస్యంగా పెళ్ళి చేసుకోవాల్సిన అవసరం అసలే లేదు" అంటూ క్లారిటీ ఇచ్చింది. ◆

# చివరి రోజుల్లో...

## దామెర్ల రామారావు (1897-1925)

ఒకనాడు ఆంధ్ర చిత్రకళ ఉన్నత స్థానానికి చేరింది. అజంతాగుహాలోని కుడ్య చిత్రాల్ని ఆంధ్ర చిత్రకళాకారులే చిత్రీకరించారు. ఆ క్షీణించిన చిత్రకళలకు ఆంధ్రదేశంలో ఆధునీకరణ తెచ్చిన కళాకారుడు దామెర్ల రామారావు. చిన్నతనంనుండి గీసిన గీతలు పిచ్చిగీతలు కావు అని, అతనిలోని చిత్రకారుడిని వెలికితీసిన గురువు ఆస్వాల్ట్ జెన్నింగ్స్ కూల్డ్రే.

ఆయన సాన్నిహిత్యంలో చక్కని చిత్రకళాకారుడయ్యాడు. చిత్రకళకు సాంఘికంగా గౌరవమంతగా లేని రోజుల్లో రామారావు తల్లిదండ్రులను ఒప్పించి బొంబాయిలోని జె.జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చిత్రకళ అభ్యాసానికి రామారావుని పంపినవాడు ఆస్వాల్ట్ జెన్నింగ్స్ కూల్డ్రే.

అలా ఒక సాంప్రదాయ కుటుంబం కుర్రాడు 1916వ సంవత్సరంలో బొంబాయికి చేరాడు. నాటినుండి రామారావు జీవితమంతా చిత్రకళతో ముడిపడింది. చిన్నవయసులోనే పెళ్ళిచేశారు కుటుంబపెద్దలు. భార్యను ఇంటవదిలి బైటకు వెళ్ళిన సిద్దార్థుడు అయ్యాడు రామారావు.

వ్యక్తిగత అనారోగ్యం, ఒంటరితనంవంటివి ఏవీ తన చిత్రకళకు అడ్డంకి కాకుండా చూసుకున్నాడు దామెర్ల రామారావు.

1919 వరకు గురువు కూల్డ్రేవెంట ఎన్నెన్నో ప్రాంతాలకు తిరిగాడు రామారావు. గోదావరి మన్య ప్రాంతంలో తిరిగే సమయంలో కీటకాల కాటుకు గురై కూల్డ్రేకి తీవ్ర అనారోగ్యం రావటంతో చికిత్సకై ఇంగ్లండ్ వెళ్ళిపోయాడు.

కాని రామారావు చిత్రకళకు, చదువుకు ఎటువంటి ఆటంకాలు కలుగకుండా ఏర్పాటుచేశాడు. 22 ఏళ్ళ వయసులో రామారావు మిత్రులతో కలిసి గుజరాత్ వెళ్ళాడు. అక్కడి రాజవంశస్తుల చిత్రాల్ని అందంగా గీశాడు. అక్కడ కనిపించిన రవీంద్రనాథ్ ఠాగూర్ బొమ్మగీసి ఆయన మెప్పు పొందాడు. శాంతినికేతన్ దర్శించమని ఠాగూర్ నుండి ఆహ్వానం అందుకున్నాడు.

బొంబాయిలో చిత్రకళ విద్య ముగిసిన తరువాత రాజమండ్రి చేరి 'ఆంధ్ర చిత్రకళా శైలి' అనేదానిని సృష్టించి దానికి గొప్ప గుర్తింపు తేవాలన్నది రామారావు ఆశ.

అందుకోసం రాజమండ్రికి చేరేముందు దేశమంతా పర్యటించి వివిధ ప్రాంతాలలోని చిత్రకళారీతులను, అందులోని లోటుపాట్లను అధ్యయనం చెయ్యాలనుకున్నాడు. అలా వెళ్ళిన చోటల్లా తన చిత్రాలను ప్రదర్శించాడు.



కలకత్తాలో దామెర్ల రామారావు వేసిన 'రుష్యశృంగ బంధనం'కి వైశ్రాయి ఆఫ్ ఇండియా అవార్డ్ రావటమే కాదు ఆ చిత్రాన్ని వైశ్రాయి లార్డ్ రీడింగ్ ముచ్చటపడి కొనుక్కున్నాడు. కుడ్యచిత్రాలు, రాజస్థాన్ మీనియేచర్ చిత్రాలు అధ్యయనంచేశాడు. కాంగ్రా చిత్రకళ గురించి, దాని క్షీణత గురించి చదివాడు.

భారతీయ కళలు పరాయి పాలనలో క్షీణించాయి కాబట్టి 20వ శతాబ్దంలో వాటిని పునరుద్ధరించాలని అందుకు ఆంధ్రుడిగా తనదైన ప్రత్యేక శైలిని సృష్టించాలన్న బలమైన కోరికతో రాజమండ్రి చేరాడు.

'ఆంధ్రా సొసైటీ ఆఫ్ ఇండియన్ ఆర్ట్'ని స్థాపించి ద్విగుణీకృతమైన తపనతో చిత్రరచన చేయటం మొదలుపెట్టాడు. ఉదయం వ్యాయామం, పన్నెండు గంటలవరకు చిత్రరచన, భోజనం, ఒక గంట విశ్రాంతి, తిరిగి సాయంత్రంవరకు చిత్రరచన, గోదావరి తీర విహారం, సాయం వ్యాయామం, భోజనం, గ్రంథపఠనం ఇది రామారావు దినచర్య. ఎటువంటి దుర్వ్యసనాలు లేవు. నిరాడంబర జీవితం.

అయితే దామెర్ల రామారావు ఆరోగ్యం చిన్నతనం నుండి అంత బాగుండేదికాదు. బక్కపలచని శరీరం.

దామెర్ల రామారావు వేసిన 'రుష్యశృంగ బంధనం'కి వైశ్రాయి ఆఫ్ ఇండియా అవార్డ్ రావటమే కాదు ఆ చిత్రాన్ని వైశ్రాయి లార్డ్ రీడింగ్ ముచ్చటపడి కొనుక్కున్నాడు. ఆయన చిత్రీకరించిన 'కృష్ణలీలలు' ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. భారతదేశంనుండి లండన్ ఇంపీరియల్ మ్యూజియమ్‌కి ఎంపికైన 12 చిత్రాలలో అది ఒకటి.

ఏదేదో తెలియని నలత వస్తుండేది. అయినా కళను వదలలేదు.పుట్టిన కొడుకు ఆరునెలలు తిరగకుండానే మరణించటం, చిత్రకారుడయిన మిత్రుడి అకాల మరణం రామారావును ఆందోళనకు గురిచేసింది. అయినా కళమీదే దృష్టిపెట్టాడు.

1923, 24 సంవత్సరాలు వరుసగా రాజమండ్రిలో జాతీయస్థాయి చిత్రకళా ప్రదర్శన నిర్వహించి ఆ పట్టణానికి విశేష గుర్తింపు తెచ్చాడు. ఆయన చిత్రీకరించిన 'కృష్ణలీలలు' ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. భారతదేశంనుండి లండన్ ఇంపీరియల్ మ్యూజియమ్‌కి ఎంపికైన 12 చిత్రాలలో అది ఒకటి.

ఆ కాలంలోనే ఆయన నగ్నచిత్రాలను గీశాడు. స్థానిక స్త్రీలను మోడల్‌గా నిలబెట్టుకుని గీయటం 90 ఏళ్ళక్రితమే రామారావు చేసిన ప్రయోగం. 1924 నాటికి రామారావు గీసిన చిత్రాలు అమెరికా, కెనడాల ప్రదర్శనల్లో చేరి మెప్పుపొందాయి.

గురువు కూల్డ్రే గతంలో ఎన్నో దేవాలయాలను సందర్శించి అక్కడి చిత్రకళను చిత్రీకరించే యత్నం చెయ్యటం, రామారావు మనసుకు గుర్తుంది. గురువు కోర్కెను తీర్చాలనుకున్నాడు. 1925 ప్రారంభంలో తన చిత్రకళా సరంజామా అంతా తీసుకుని, భార్య సత్యవాణితో కలిసి తిరుపతి వెళ్ళాడు.

తాను తీసుకువెళ్ళిన స్కెచ్ బుక్‌నిండా నల్లమలై కొండలమీద వున్న అడవుల ప్రకృతి, తిరుమల కొండలు, వాటి శోభ,పుష్కరిణి, దేవాలయ స్తంభాలు, శిల్పాలు ఇలా ఒకటేమిటి మొత్తం తిరుమల సౌందర్యాలన్నీ పుస్తకంలో చిత్రీకరించాడు.

మహదానందంతో ఎప్పుడెప్పుడు రాజమండ్రి చేరదామా...తాను గీసిన స్కెచ్‌లను రంగురంగుల చిత్రాలుగామార్చి తిరుమల అందాలను ప్రపంచానికి అందిద్దామా అన్న ఆలోచన ఆయన మదిలో ఉంది.

కాని నాటి బెజవాడ చేరేసరికి రామారావుకి జ్వరం మొదలయింది. ఆ జ్వరంతోనే రాజమండ్రి చేరాడు. సాదాసీదా జ్వరమే కదా కొద్దిరోజులలో తగ్గుతుంది. కోలుకున్నతరువాత తన చిత్రకళలోకి దిగవచ్చును కున్నాడు. ఒకటి, రెండురోజులు గడిచినా తగ్గుముఖం పట్టని జ్వరం సాదాసీదా జ్వరం కాదు. అది మసూచి జ్వరం అని తెలుసుకునేసరికి ఆలస్యమైంది.

ఆ రోజుల్లో మసూచికి తగిన మందులు లేవు. ఒక్కసారిగా షాక్. అప్పటికి ఆయన వయసు కేవలం 28 సంవత్సరాలే. అంత చిన్నవయసులోనే జీవిత చరమాంకంలోకి చేరుతున్నానన్న వాస్తవం మనసును కుదిపేసింది. రామారావు కన్న కలలు తీరలేదు.

తాను పెట్టుకున్న ఆంధ్ర చిత్రకళా ధ్యేయం పూర్తిగా నెరవేరలేదు. కట్టుకున్న భార్యకు 16 ఏళ్ళు కూడా నిండలేదు. తాను విదేశాలలో ప్రదర్శనకు పంపిన చిత్రాలు తిరిగి రాజమండ్రి రాలేదు.

కాలం ఎవరికోసం, దేనికోసం ఆగదన్న వాస్తవాన్ని మరొక్కమారు గుర్తుచేస్తూ విధి దామెర్ల రామారావు జీవితాన్ని నిండుయవ్వనంలో వుండగానే 1925 ఫిబ్రవరి 6న కబళించింది.ఆంధ్ర చిత్రకళారంగంలో ధృవతారగా నిలిచిపోయాడు రామారావు.

# ఈ శీర్షిక మీదే

ఉత్తమ ప్రశ్నకు ₹ 500
ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

* కె.వి.ఎస్.ఎస్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం
ఆశ్చర్యకరమైన విషయం?
ప్రతి మగాడి విజయం వెనుక స్త్రీ ఉంటుందంటారు గాని, భార్య అనకపోవడం.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం
'చెప్పు' కామెంట్ ప్లీజ్?
వాకింగ్‌తోపాటు వార్నింగ్‌లకీ వాడేది.

* డి.వి.చంద్రశేఖర్, కర్నూలు
ఏది నయం?
వినయం.

* జి.శ్రీహరి, పాకాల
ప్రశ్న వేసినవారిదగ్గరే సమాధానం ఉంటుంది అన్నదానికి రుజువు?
ఈ శీర్షిక మీదే.

* డి.కృష్ణప్రియ, ఆదోని
గృహిణికి-గడియారానికి బంధం?
మూడు ముళ్ళ బంధం.

* పి.యోబు, ముదునూరు
డివైడర్?
ఫ్లెక్సీలకు, లైటింగులకు స్టాండు.

* పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట
నేటి హీరోయిన్లు?
బాడీ లాంగ్వేజీతో ఏ లాంగ్వేజీలో అయినా నటించేవాళ్ళు.

* ఎస్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం
'అనారోగ్యం'తో ఉన్న 'భార్య' 'కుదుటపడిందని' ఎలా గుర్తుపట్టొచ్చు?
కాస్తంత 'గొడవ' పెట్టుకున్నప్పుడు.

* కె.దిలీప్, హైదరాబాద్
అమ్మాయికి, అమ్మకు తేడా?
అమ్మాయి అమ్మ కాగలదు, అమ్మ అమ్మాయి కాలేదు.

* ఎస్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం
'విసరడం'లో 'నేర్పరితనం' ఉన్నా 'ఒలింపిక్స్'లో పాల్గొనలేనివాడు?
'పేపర్ బాయ్'.

## ఈ కార్టూన్ మీదే



## B హ్యాపీ

"కాఫీ తాగటం లాభమా! నష్టమా డాక్టర్"
"అది మీరు మీ డబ్బులతో తాగుతున్నారా! ఇతరుల డబ్బులతో తాగుతున్నారా అనే దానిమీద ఆధారపడుంటుంది" అన్నాడు డాక్టర్ యథాలాపంగా.

కవికి నిర్వచనం ఇమ్మని ఒకసారి విశ్వవిద్యాలయం ఫంక్షన్‌లో శ్రీశ్రీని ఒక విద్యార్థి అడిగితే...
"కష్టజీవికి ఈ చివర ఆ చివరవుండి కాపుకాసేవాడే కవి" అంటూ చెప్పేసరికి చప్పట్లు మారుమోగాయి.

"అయ్యా మునిసిపల్ కమీషనర్‌గారూ, మా వీధిలో ఒక గాడిద చచ్చిపోయింది. మీ స్టాఫ్‌ని పంపండి" అని ఫోన్ చేశాడు ఒకాయన.
"మీరేం చేస్తుంటారు! అడిగాడు కమిషనర్"
"నేను పౌరోహిత్యం చేస్తుంటానండీ"
"మరింకేం మీరే అంతిమ సంస్కారం జరపవచ్చు కదా" అని మున్సిపల్ కమీషనర్ పగలబడి నవ్వాడు.
"నిజమేననుకోండి... జరిపించాలనే అనుకున్నా... ముందుగా చనిపోయినవారి బంధువులకు చెప్పాలి కదా అందుకని మీకు చెప్పా"

జానపద సినిమాలో రేలంగి పాత్రకు రాసిన డైలాగ్‌లు ఆయనకు వంటపట్టక "ఎవడయ్యా ఈ డైలాగ్‌లు రాసింది" అంటూ విసుక్కున్నాడు.
"పక్కనే వున్న మల్లాది రామకృష్ణశాస్త్రిగారు నేనేనండీ అవి రాసింది" అన్నారట.
ఆ కవిగారు అంటే విశేష గౌరవం వున్న రేలంగి నాలుక కరుచుకుని-
"అబ్బే అదికాదండీ- నాలుగో తరగతి తప్పిన నా నోటికి ఇటువంటి డైలాగ్‌లు అయితే ఎలా సర్" అని తప్పించుకునే ప్రయత్నం చేశాడు.

కాలు విరిగిన కాంతం, చెయ్యి విరిగిన ఆమె భర్త కాంతారావు ఇద్దరూ ఆసుపత్రిలో చేరారు. పక్క పక్క బెడ్స్‌మీద వున్నారు.
వాళ్ళిద్దరినీ పలకరించేందుకు వచ్చిన బంధువులు "బైక్‌మీద నుండి పడ్డారా ఇద్దరికీ దెబ్బలు తగిలాయి" అని అడిగారు.
"లేదు. అది అరటితొక్క మీద కాలేసి జారిపడింది" వివరించాడు కాంతారావు.
"మరి మీ చెయ్యి..."
"అది పడటం చూసి నేను నవ్వాను. అంతే..."

"ఇప్పుడు మావాడికి సిగరెట్లు, మందు అలవాటైంది" క్లబ్‌లో మిత్రులతో అన్నాడు అప్పారావు.
"విచారించవలసిన విషయం అలా చెపుతున్నావేమిట్రా" అన్నాడు ఓ మిత్రుడు.
"విచారమెందుకు... ఎప్పుడు కావాలంటే అప్పుడు కొట్టేస్తున్నా వాడిదగ్గరనుండి" అన్నాడు అప్పారావు.

రోగి డాక్టర్‌దగ్గరికి వెళ్ళి "చచ్చిపోవాలనివుందండీ, ఈ రోగం బాధ భరించలేకుండా వున్నా" నన్నాడు.
"మంచిపని చేశారు. మీరు నా క్లినిక్‌కి వచ్చారు కాబట్టి మీ కోరిక తప్పకుండా తీరుతుంది"

ఎప్పుడు మనం, నేను, నాది అనే భావన లేకుండా పనిచేస్తామో, అప్పుడే అత్యుత్తమంగా పనిచేస్తాము.

